# జయంతి

# 3

సం. ౧ సం. ౩ జనవరి, ౧౯౫౮

ఈ సంచికలో

మంజుశ్రీ
నాయని సుబ్బారావు
మునిమాణిక్యం నరసింహారావు
రమణారెడ్డి
బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు
దిగుమర్తి సీతారామస్వామి
వేటూరి ఆనందమూర్తి
కుందుర్తి ఆంజనేయులు
అనుముల కృష్ణమూర్తి
శ్రీపాదరేణువు
సోమసుందర్
కండిల
పొట్లపల్లి సీతారామారావు
విశ్వనాథ సత్యనారాయణ

# జయంతి

౩

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.





సంవత్సర చందా ౭-౦

విడి ప్రతి ౬౫ న. పై.

# పాఠకుల ఉత్తరాలు

"యొక్క" షష్ఠీ విభక్తి ప్రత్యయముకదా? అది "ఒక్క" కాదు—తెలుగున అద్యక్షరము యకారము నిషేధింపబడినపుడు ఈ "యొక్క" సంగతి ఏమిటి? ఈ "యొక్క" అస్వాభావికమైనదిగా తోచుచున్నది. సామాన్య వ్యవహారమునగాని పూర్వకవికావ్యాలలో గాని దీనికి ప్రయోగములేదు.

నా యీ సందేహమునకు మీ పత్రికాముఖమున సమాధానము సంగ్రహింపవలసినదిగా కోరుచున్నాను.

*గార్లపాటి రాఘవరెడ్డి*
హనుమకొండ

గ్రంథ సమీక్షలు తప్ప నాకు అన్నీ బాగున్నాయి. మీరు గ్రంథ పరిచయంచేయించండి చాలు. సమీక్షలు వద్దు.

సమీక్షకులు పుస్తకంలో చెప్పబడినదాన్ని గురించే చెప్పాలి. విమర్శనాదృష్టితో రచయిత శక్తిని కొలవాలి. పుస్తకంలో చెప్పబడని విషయాన్ని గురించి ఏమీ వ్రాయకూడదు.

"Neither praise nor blame is the object of criticisim. Justly to discriminate, firmly to establish, wisely to prescribe, and honestly to award—these are the aims and duties of criticism." గ్రంథ సమీక్ష పరిధిలో ఇది సాధ్యంకాదు కనుక ఉత్తమ గ్రంథాల పరిచయం చేయిస్తే చాలు. పాఠకుల ఉత్తరాలు ప్రచురించవద్దు Miller and the ass కథ తెలుసుకదా!

మంచి కవిత, మంచి కథలు, చాలా పత్రికలలో వస్తున్నాయి. మంచి విమర్శలు మాత్రం మీ పత్రికలోనే వస్తున్నాయి.

విమర్శను సహించనూలేక, భరించనూలేక దేశం వెర్రితలలు వేస్తున్న సమయంలో 'జయంతి' జయ జయ ధ్వానాలు ఎంతైనా అవసరం.

రాంషా
సామర్లకోట

కథలు, వగైరా పరిహరించి కేవలం కవిత్వానికి, కవితావిమర్శకి ఈ పత్రికని ప్రత్యేకించడం బాగుంటుందనుకుంటాను.

'సామెతల గన్న కథలు' నాకు నచ్చింది.

కేవలం పాండిత్య ప్రకర్షకూ, వివిధ విషయాలను గూర్చిన భోగట్టాకూ ప్రాధాన్యం ఇచ్చే రచనలు కాక, సత్యాన్వేషణ నిష్ఠతో, విశితమైన అంతరదృష్టితో, అణకువతో వెలువడేరచనలు ఈనాడు చాలా అవసరం. అలాంటి రచనలు సంపాదించి, కొన్ని శతాబ్దాలుగా ఆలోచించే అలవాటు తగ్గించుకున్న తెలుగు మేధకు తిరిగి ఆ అలవాటుచేసే ప్రయత్నంలో 'జయంతి' కొంతవరకైనా తోడ్పడగలదని నమ్ముతున్నాను.

*బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు*
వాల్తేరు

నిరాడంబర సుందరమైన 'జయంతి' పరిమాణమును మించిన గుణప్రమాణము కలదై వెలువడినందుకు సంతోషము. బాహ్యాకర్షణము కంటె అంతస్సౌందర్యమునకే (ఆశకు మితిలేదు గనుక) అభిలషించెద.

సాహిత్య సంపన్నమైన జయంతి వ్యాపార ప్రకటనలతో నింపబడకుండుట హర్షదాయకమే గాని నేటి కాలమున పదికాలాల పాటు మనగలుగుట కది యవసరమేమో? ఇది జయంతి చిరంజీవనమున కాశించిన మాట. జయంతి పాఠకులమగు మాబోటి వారి కింతకు మించిన మూల్యము చెల్లింపవలసివచ్చునను స్వార్థమును కొంతవరకు కారణము. జయంతిని యమూల్యముగా భావించుచుంటిని.

*జి. సీతారామయ్య*
ఉల్లిపాలెం

# కపివ్యథ

అనుముల కృష్ణమూర్తి

*'కపాలిన్ ! భిక్షో ! మే హృదయకపి మత్యంత చపలం'*

అంధతమఃపరీత కుహరాంతరగుప్త నిషిద్ధమార్గమం
దంధు లభేద్య తత్త్వముల నారయ నెప్పుడు నిర్గమింతు రి
ప్పాంథుల నెప్పు డెవ్వ డురుపంకమునంబడి చచ్చు ? నీగురు
గ్రంథము పిప్పిచెప్పు మొనగా డెవ డీ భువనమ్ములఁ ప్రభూ !

తీరము గానుపించని నదిఁ బడవైచితి జీవనావ ; గం
భీరజలప్రవాహమున భిన్నముగాక మతేమియౌను ? నీ
వేరికి సాయమైతివి ? వ్యయించెదలే ఎటులైననేమి ? నే
నేరికి పట్టిలేనని గ్రహించితిలే మునుపెప్పుడో ప్రభూ !

గ్రుడ్డిపొగడ్తలంబడి గగుర్పొడిచెఁ సనసన్న వెండ్రుకల్
వెడ్డిగ గొన్నినాళ్లు ; మన వెఱ్ఱితనమ్మది పొంగిపొంగి ఏ
గడ్డకా పేరుకొన్న నురుగై కనుపించిన నాటినుండి ని
న్నడ్డముబెట్టి జారుదునయా భగవత్కృపయంచు నో ప్రభూ !

గడచిన వత్సరమ్ముల నగాథములో బడద్రోసి ముందు వ
చ్చెడి వయసంత దుష్కృతి నిషేధమునఁ వినియోగమొందు క
ట్టడి నొనరించినాను కపటమ్ము మమత్వములేక సాధునై
నడచెద ఈ యనాథ శరణాలయమం దొక దీనుడఁ ప్రభూ !

పరులని భేదమేని నిజబాంధవులంచనురాగమేని సు
స్థిరమతియైన యోగికి రుచింపవు భౌతిక రక్తిలేమి ; సుం
దరమయి సత్యమై శివమునై వెలుగొందెడి పూర్ణభావ మే
ర్పఱచిన తత్త్వమిద్దియ ప్రపంచ రహస్య మెఱింగినన్ ప్రభూ !

భక్తియనంగనేమొ కడుపామరుడఁ దెలియంగలేను నీ
శక్తిని నీదు తత్త్వమది సాధ్యముగా దెఱుగంగ నాకు నౌ
ముక్తినిగాని గోర భవమోచన మేనియు గోరగాని ; ఆ
వ్యక్తిని జూచి ఈ జటిల పంకమునన్ బడద్రోతువా ప్రభూ !

ఎన్నడుగాని ఇంతగ తపించదు నా ఎద, గుండెలింతగా
నెన్నడు కొట్టుకోవు మఱి ఎన్ని యుగమ్ముల నోచుకొన్న నా
పున్నెము పండిపండి యొక మో మొక ము క్కొక రెండు కన్నులై
తిన్నగలేచినిల్చినది తీరనికోరిక తీరుగా ప్రభూ !

కనులనుమూసి నీకనుల గాంచుదు, వీనుల మూసికొన్నచో
వినియెద నీదు వాక్యము, వివేకము మూసిన నిన్నెజూతు ఈ
మనసును మూసి నీ మనసు మర్మము జూతును కాని ఎట్టు లీ
గుణముల మూసికొందు, గనుగొందును నిర్గుణు నిన్ను నో ప్రభూ !

నాదగు వేదనా హృదయనాదము నీచెవి కింపుగానిచో
రాదగు నాలసింపక పరాకును జేయుట పాడిగాదు నీ
వే దయచేయగా వలయు ఈ 'స్వరభంగుని' కేమి నేర్పి స
మ్మోదము గూర్చికొందో నను మూకను జేసిన శాస్తికో ప్రభూ !

కనులున్నందుకు వెల్గబెట్టినదియున్ కన్పించదో యన్న ! లే
వనుకున్నన్ మఱి కొంపమున్గినది లేదన్నా ! జగత్తొక్క రీ
తిని సంసారముజేయ నేర్చినది విస్తీర్ణించు మర్యాద నే
ర్చిన దీ వున్నను లేకపోయినను ; నీ చిక్కంత నాకే ప్రభూ !

సాపేక్షం జపియించి కాంచితిని సంసారమ్ములో స్వర్గ మా
క్షేపించందగు నిద్రభోగముల నిస్సీ ! మోముకొట్టెన్ నిర
స్త్రాపేక్షం దపియింతు నిప్పుడు సమస్తానంద కేంద్రమ్ముగా
దీపించందగునంచు చిద్గగన చాంద్రీమాతృమూర్తీ శివా !

# బోరిస్ పాస్టర్ నాక్

## జీవితమూ - కవిత్వమూ

సోమసుందర్

బోరిస్ పాస్టర్-నాక్ అనే రష్యను కవి 1890 లో జన్మించాడు. జారు ప్రభువుల నిరంకుశ పరిపాలనలో బాల్యదశ గడుపుకున్నాడు. 1905లో జరిగిన తొలి రష్యను విప్లవం నాటికి పదిహేనేళ్ళ లేబ్రాయమువాడు. 1917 లో లెనిన్ నాయకత్వాన జరిగిన సోషలిస్టు మహా విప్లవం నాటికి 27 సంవత్సరాల ప్రౌఢ వయస్కుడు. అప్పటికే మయకొవిస్కీ ప్రారంభించిన ఫ్యూచరిస్టు కవితోద్యమ భాగస్వామియై రచనల కావిస్తున్నవాడు. 1980 లో మయకొవిస్కీ మరణానంతరం రష్యన్ కవితారంగంలో అతనికి జోడైన చైతన్యమూర్తి పాస్టర్ నాక్ మాత్రమేనన్న ప్రతిష్ఠ బడసినవాడు. షేక్స్పియర్ నాటకాలను అనేక గేయాలను, షెల్లీ, కీట్సు, బైరను వంటి ఆంగ్లకవుల కావ్యాలనూ రష్యన్ భాషలోకి అనువదించాడు.

షేక్స్పియర్ కృతులను అనువదించినవారు రష్యాలో చాలమంది వున్నారు. కాని పాస్టర్ నాక్ అనువాదాలే గణనీయమైనవి. అతనిసాహిత్య జీవితపు ద్వితీయార్ధంలో మాత్రమే అనువాదాలు ప్రారంభించాడు. అయినా అత నను వదించిన హేమ్లెట్, రోమియో-జూలియట్, ఆన్టోనీ-క్లియోపాత్రా, నాల్గవ హెన్రీ-వంటి నాటకాలు సోవియట్ రష్యా అంతటా విశిష్టఖ్యాతి నార్జించుకున్నాయి. అతను అనువాదకళ గురించి కొన్ని అత్యుత్తమ వ్యాసాలు ప్రచురించాడు. ఇవి సాహిత్య గుణంలో మౌలికమైనవే కాక మనోజ్ఞమైనవి కూడ. ముఖ్యంగా షేక్స్పియర్ నాటకాలను తాను రష్యను లోనికి భాషాంతరీకరిస్తున్నపుడు కలిగిన అనుభవాలను పురస్కరించుకొని పాస్టర్ నాక్ రచించిన వ్యాసాలన్నీ ఉదాత్తమైనవే!

పాస్టర్ నాక్ వచన రచనల్లో కొన్ని ముఖ్యమైన వానిని ఆంగ్లంలోకి అనువదించి విండ్సే డ్రమ్మండ్ ప్రకాశన సంస్థ ప్రచురించింది. ఈ గ్రంథానికి స్టెఫాన్ స్కిమానిస్కీ తొలిపలుకు వ్రాశాడు. ఆగ్రంథంలో కథలను రాబర్టు పెయిన్ అనునాతడు ఆంగ్లంలోని కనువదించాడు. మిగిలిన వ్యాసాలన్నీ బీట్రైస్ స్కాట్ అనువదించాడు. ఆ గ్రంథానికి వ్రాసిన తొలిపలుకుల్లో స్టెఫాన్షిమానిస్కీ యిలా అన్నాడు: "పాస్టర్ నాక్ వచనం కూడ అతని కవితకు అనుబంధంవలెనే, రమ్యంగా రసతుందిలంగా వుంటుంది. అతని గద్య కూడ కవిత అవలంబించే అంతర్గత ధర్మాలనే నిబిడీకృతంగా పాలిస్తూంటుంది. సంగీతమూ, లయా అతని గద్యంలో కాని పద్యంలో కాని సమానశక్తినే నిర్వహిస్తాయి. సజీవులైన ఏ సోవియట్ రచయితకు లేని రమణీయ వచన రచనాశక్తి పాస్టర్ నాక్కు అబ్బింది. అతని స్వయంశక్తీ, నవోన్మేష ప్రజ్ఞా, అనన్య సామాన్యమైనవి. అతని కథానికలు గాని, సాహిత్య వ్యాసాలు గాని-ఏ వచన రచనలైనా కవితాసౌందర్యమునే ప్రకాశించుతూ వుంటాయి. ............" అంటాడు. పాస్టర్ నాక్ కవిగా యింతటి ఉత్తమ వచన రచనాశక్తి కలిగిన వాడన డాని కీతాఖ్యానం చాలు ననుకుంటాను.

మయకొవిస్కీ తరానికి చెందిన సజీవులలో యిరువురు ప్రముఖ కవులు గణనీయులు. వీరిలో బోరిస్ పాస్టర్ నాక్ ప్రథముడు. ఇతనికన్న వయ

సులో ఆరేళ్ళు చిన్నవాడైన 'నికోలాయ్ తికనోవ్' రెండవవాడు. వీరిరువురికీ సంవిధానరీతిలో గాని, భావనాసంపదలో గాని, తాత్త్విక విశ్వాసాలలో గాని—ఎంతో వైవిధ్యమున్నమాట వాస్తవమే. అయినా తరువాత ప్రాదుర్భవించిన సాహిత్య తరాలకు వీరిరువురూ సమానంగానే ఆవేశోత్సాహాల నిచ్చారు. ఇందులో వీరికి విభిన్నత లేదు. పాస్టర్ నాక్‌తో పాటు మరికొంతమందిలో చిత్ర భావకవిత్వధోరణులు నేటికీ కనిపిస్తూనేవున్నాయి. కనుకనే సోవియట్ కవితావృక్షానికి గల ఒక శాఖకు వైయక్తిక భావకవితాకుసుమాలు విరియడమూ, వేరొక శాఖకు జానపద కవితారీతి ప్రసవించడమూ కనిపిస్తూనేవుంటుంది. ముఖ్యంగా పాస్టర్ నాక్ కవిత్వంలో ఈ భావకవితాధోరణి (Lyricism) ప్రముఖలక్షణం. అల్లే తికనోవ్ కవిత్వంలో జానపద కవిత్వ ధోరణి విస్పష్టమైనది.

మయకొవిస్కీ ప్రారంభించిన భావకవితావాద (Futurist Poetry) ధోరణికి చెందినవాడే బోరిస్ పాస్టర్ నాక్ అన్న విషయం ముందు చెప్పుకున్నాం. కాని వీరిరువురి కవితా ధోరణులకూ కించిత్తు విభేదమున్నది. ఇతని కవితలో భావకవితారీతి ప్రాధాన్యత వహిస్తూంది. కాని తత్పూర్వ భావ కవితాసంప్రదాయానికి ఈ విధానం పూర్తిగా విభిన్నమైనది. భాషాశృంఖలాల త్రెంచుకోవడమన్నది— ఫ్యూచరిస్టుల ప్రధాన నినాదం! ముఖ్యంగా కొన్ని పదాలు మాత్రమే మనోహరమైనవన్న సిద్ధాంతాన్ని వీరు తృణీకరించారు. కనుకనే వీరిఉద్యమం గత భావకవితాసంప్రదాయంపై తిరుగుబాటుగా పరిగణించబడింది.

సోవియట్ సాహిత్య విమర్శకులలో 'అంటోకొవిస్కీ' అనే కవిపేరు తప్పనిసరిగా చేర్చుకోవల్సివుంది. ఆయన వ్రాసిన అసంఖ్యాక విమర్శక వ్యాసాలలో కొన్ని మాత్రమే 1945లో సంపుటిగా ప్రచురించబడ్డాయి. ఆ వ్యాససంపుటికి 'కాలపరీక్ష' అన్న పేరు పెట్టాడాయన. ఆ గ్రంథంలో ప్రముఖ కవులందరి గురించీ ధారావాహికగా సమాలోచన చేశాడు. అందులో వెర్మాంటోవ్, బాజాన్, సుర్కోవ్, పెర్వోమావిస్కీ, పాస్టర్ నాక్, ప్రభృతులందరూ సమీక్షించబడివున్నారు. 45 నాటికి సోవియట్ కవిత్వంలో వికసించిన నూత్న వాణిని పరిశీలించేందుకు అంటొకొవిస్కీ చేసిన ఈ ఉద్ఘాటన మానదండంగా ఉపకరిస్తుంది—"మానవ సంస్కృతీ పురోభివృద్ధికి కవిత ఒక శక్తిమంతమైన ఆయుధం. సముద్రయానము నెరుగుటకు వెనుకటిస్థితివలె— మానవుడు గొడ్డలి నుపయోగించుకొనుటకు పూర్వమున్న స్థితివలె అగ్నిజ్వాలల స్వాధీనంచేసుకొనుట ఎరుగనిస్థితివలె - కవితావిర్భూతికి పూర్వమున్నస్థితి కూడ నిద్రాణమైన అన్వేషణయే! మానవునిలో కొండొక మౌన తపోనిష్ఠయే - మూగవేదనయే - కానిపించును. అనాదికాలంనుంచీ కూడ కవిత పరిస్థితులపై మానవవిజిగీషకు సంకేతమే! కనుకనే, కవిత సాధించబడిన విజయం!... అభివృద్ధిచెందే మానవ సృజనాత్మకశక్తికి మనోజ్ఞచిహ్నమే కవిత! జానపద కవితాసంపద యావత్తు ఈ నిర్వచనానికి ప్రబలసాక్ష్యమే ఇస్తుంది. జానపద గాథలన్నీ, సమూహగానాలన్నీ, పురాణములన్నీ - పైనిర్ణయాన్ని సమర్థించేవే!" అంటాడు అంటొకొవిస్కీ.

ఈ ఉద్ఘాటనను ఊతగా తీసుకొని, యుద్ధజ్వాలలు విజృంభిస్తున్నదశలో సోవియట్ కవుల సృజనాత్మక కృత్యమెట్లు విలసిల్లిందో పరిశీలించవచ్చు. ముఖ్యంగా భావగీతం ఏ ఏ కొత్తరేకుల తొడుగుకున్నదో గమనించవచ్చును.

"ఇట్టి పరిశీలన బోరిస్ పాస్టర్ నాక్ కవిత్వ సమాలోచనతో ప్రారంభం కావడం ఉచితం. ఈయన ఉన్న కవులందరిలోకీ ప్రథమ గణ్యుడు. అంతేకాక, అందరిలోకీ వయోవృద్ధుడు. ప్రపంచ పాఠకులదృష్టిని విశేషంగా అకర్షించుకున్నవాడితను. 1910 నాటికే ఉత్తమ భావకవిగా ప్రఖ్యాతుడయ్యాడు."— అన్నాడు జార్జిరెవీ

నేటి సోవియట్ సాహిత్యసమీక్ష-అనే తన గ్రంథంలో కవితా ప్రకరణాన్ని ప్రారంభిస్తూ!

పాస్టర్ నాక్ 1922 లో రచించిన 'సోదరీ, నా జీవితం' కాని, 1928 లో రచించిన 'ఇతి వృత్తాలూ—విపరిణామాలు' అనే కావ్యం కాని, అతనార్జించుకున్న పూర్వ విఖ్యాతిని మరింత బలో పేతం చేశాయి. అతని భావనావ్యక్తి స్వయం ప్రకాశకమైనదీ, శక్తిమంతమైనదీని. అతని వ్యంజన, చిత్రణాశక్తి, పఠితలో వర్ణచిత్రసముద్దీప్తి, కలిగించ గలది. అతని కవితాభావ భాండారం— మానసిక స్మృతి పీఠపై యింద్రధనుర్వల్లికల నెలకొల్పగలది! అతని పదశక్తి ఉదాత్తమైనది. విస్తృతమై, నవ నవోన్మేషశాలినియైన ప్రతిభతో అతని కవితాసునిశి తత్వం— ఉదయ సాయంసంధ్యలలో దిగంతాల వెలిగించే నునుమెత్తని రుచిరకాంతిలో యవ్వన హృదయస్మృతులు జలకమాడినట్లుగా స్ఫూర్తి మంతాలవుతాయి. సంగీతతంత్రీనిక్వణాలవుతాయి గాఢముద్రణాదీప్తితో అగాధ భావనాశక్తితో ప్రకృతినే కన్నులముందు నిలబెట్టుతుంది— అంటూ ప్రస్తుతిస్తాడు జార్జిరెవీ.

రైనర్ మేరియా రిల్కే మహాకవి కావ్యాలలో ద్యోతకమయ్యే వాతావరణ సౌందర్యం పాస్టర్ నాక్ కవితలో కూడ గోచరమవుతుంది. రిల్కే ప్రసక్తి వచ్చిన ఈ సందర్భంలో మరొక విష యాన్ని స్మరించుకోవడం అనవసరంకాదు. పాస్టర్ నాక్ తండ్రి అతని కాలంలో విఖ్యాతుడైన చిత్ర కారుడు. రిల్కే ఒకసారి మాస్కోకు విచ్చేసిన సంద ర్భంలో, ఆ మహాకవి తైలవర్ణచిత్రాన్ని పాస్టర్ నాక్ తండ్రి అసమానప్రతిభతో చిత్రించాడట! ఆ సంబంధమే పాస్టర్ నాక్ కవితకు అదృశ్యబీజమై వారసత్వాన్ని వహించిందేమో!

పాస్టర్ నాక్ పద్యాలు చైతన్య రసపూరితాలు. అంతర్గత క్రియాజన్య పదచిత్ర సముదయాన్ని సహజమైన పునాదిగా పొందుపర్చుకుంటాయి. అతని పదసిర్మాణం పూర్ణస్వరూపం పొందేసరికి— చిత్రమైన భావకాంతిగా రూపుతొడిగి మార్పుల నాకట్టుకొని మనలో అపురూప రుచుల నెలకొల్పు తుంది. అయినా అతని పద్యాలు నిరాడంబరంగానే వుంటవి. హృదయాన్ని సూటిగా స్పర్శించి, గాఢ ముద్రా ప్రతీకల కలిగిస్తాయి.

అతని పదశక్తి, ఆలోచనాస్ఫోరకత్వంలో గల చైతన్యమూ అసాధారణ విస్తృతిని కలిగివుంటవి. అతని చిత్రనిర్మాణమూ, యోచనా, అభివ్యక్తీ, అలభ్యానుసరణీయంగా కూడ మారడం కద్దు.

ప్రథమశ్రేణికి చెందిన భావకవిగా అతనిని ప్రస్తు తించేటపుడు సైతం ఒక ముఖ్యాంశాన్ని ఎవరూ విస్మరించలేరు. ఎందువల్లనో అతని కవిత విశేష ప్రజానీకపు అంతరాంతరాలలోకి ఎన్నడూ చొచ్చుకుపోలేకపోయింది. అంతేకాదు; అధికార ముద్రను కూడ విశేషంగా పొందనేలేకపోయింది. అతనికి గల అర్హతనుబట్టి— తగిన స్థానం లభించక పోవడానికి గల కారణమొకటున్నది; సామాజిక మైన నిత్యనైమిత్తిక కార్యకలాపాలలో పాస్టర్ నాక్ కవిత ఎన్నడూ తలమునకలు వేయలేదు. సాధారణ దైనిక సంఘటనలపై తాత్కాలి కావే శంతో అతను కవిత చెప్పలేదు. కాని, 1905 లో వ్రాసిన లేఖాయపు కృతులలోను, 'కేప్టెన్‌ష్మిట్' (Captain-Schmidt) అనే కృతిలోనూ— విప్లవా త్మక సన్నివేశాల యితివృత్తంతో వాస్తవిక కవితా ధోరణి వెలయించకపోలేదు. సహజసిద్ధమైన అతని చైతన్య స్వభావం అట్టి కృతులలో కూడ ద్యోత మానం కాక తప్పలేదు.

ఈ విషయం-అతని కవితా జీవితాన్ని పూర్వో త్తర రంగాలుగా విభజిస్తుంది. "కవిత్వమూ-అరాజ కత్వము"—అనే శీర్షికతో ప్రముఖాంగ్ల విమర్శకు డైన హెర్బర్టురీడ్ 1938 లో ఒకగ్రంథం ప్రచు రించాడు. అందులో "పాస్టర్ నాక్ బందీకృతు డైనాడు" అని ఒక్క విచిత్ర ఆరోపణ చేశాడు. సోవియట్ సాహిత్య చరిత్రకు సంబంధించిన సత్యా లను చిత్తశుద్ధితో అన్వేషించే ఏ ఒక్కరికైనా ఈ

ఆరోపణ నిరాధారమైన ఆరోపణగా స్పష్టపడుతుంది.

పాస్టర్‌నాక్‌కు ప్రజలలో విస్తృత ప్రతీతి లభించక పోవడానికి వేరొక కారణంకూడ కనిపిస్తుంది; అతని సాహిత్య జీవితంలో అధికభాగం—అనువాద కృషికి అంకితం కావడంకూడ బహుశా ఒక ప్రబల కారణమే కావచ్చు. ఏమైతేనేం—అతని సాహిత్య జీవితాన్ని మొత్తంగా పరిశీలించినపుడు అతని స్వంత సృజనాత్మక ప్రచురిత గ్రంథాలు స్వల్పంగానే మన కీనాడు లభిస్తున్నాయి.

జీవితంలో ఏదో ఒక గ్రంథంమాత్రమే రచించి మహాకవిగా కీర్తి నార్జించుకొని, ఇంక ఏమీ వ్రాయనక్కర లేకుండానే—గత కీర్తిమీద బ్రతుకుతూ, మన దేశంలోవలె మహాకవిగా పరిగణింపబడటం—ఆ దేశాలలో కుదరదు. గుణాత్మకంగాను, ద్రవ్యాత్మకంగాను కూడ నిత్యసాహిత్యకృషి ప్రకాశమానమవుతూ ఉంటేనే కాని ఎంత గొప్పవాడినైనా పాశ్చాత్య దేశాలలో సజీవ కవిగా పరిగణించరు. ఆ వరవడిన చూసినప్పుడే పాస్టర్‌నాక్ స్వంత గ్రంథాలు అధికంగా ప్రచురించ లేదన్న అపకీర్తికి పాల్పడవలసి వచ్చింది. కాని వేరొక దృష్టితో చూస్తే, అతను అడపాతడపా ఏదో ఒక గ్రంథాన్ని ప్రచురిస్తూనే ఉన్నాడని కూడ పరిశీలకులు అంగీకరిస్తారు. ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో వెలువడిన సాహిత్యంలో—పాస్టర్‌నాక్ గ్రంథాలు కూడ అనల్ప సంఖ్యలో కనిపిస్తూనే వున్నాయి. ఆ గ్రంథాలు రాసిక్యంలో అల్పమైనవే కావచ్చు గాక! ఇక యుద్ధానంతర పరిస్థితులలోనైనా అతని సాహిత్యకృషి యితోధికమై రాణించవలసివుందని రెవీ వంటి విజ్ఞులు ఆశించారు. కాని ఇప్పుడీ 'డాక్టర్ ఝివాగో' అనే అతని నవలపై ప్రపంచం మొత్తంలో యింత రభస యేర్పడ్డం శోచనీయమే మరి!

ఇంత చెప్పినా అతని కవిత్వం గురించి మరొక ప్రముఖ సత్యం చెప్పవలసే వున్నది. అతని భావకవిత కేవలం స్వాత్మకమైనది. సామాజిక వాస్తవికతాబీజాలు అతని కవితలో అత్యల్పంగా సాగు చేయబడ్డాయి. ఈ విషయంలో యితర సోవియట్ కవుల విధానంనుంచి పాస్టర్‌నాక్ విడివడినవాడేననడానికి సందేహించ నవసరంలేదు. అయితే—ఈ కవి 1945 లో 'విపులాచ పృథ్వీ' అనే శీర్షికతో ప్రచురించిన కావ్యంలో ఎన్నో పద్యాలు నిశితమైన వాస్తవిక దృక్పథాన్ని పుణికిపుచ్చుకున్నాయి. అల్లే అతని అసంఖ్యాక సమరగీతాలు కూడ—ఈ దృష్టినుంచి విదూరమైనవి కావు. అట్టివానిలో చాలా గీతాలు 'ప్రవదా' లో ఆ కాలమందే ప్రచురించపడ్డాయి.

ఇంతకుముందే పేర్కొనబడిన 'అంటొకొలిస్కీ' అనే సోవియట్ విమర్శకుడు పాస్టర్‌నాక్‌పై చేసిన విమర్శలలో ఆనాటి సోవియట్ ప్రజల మనోభావాలు సువ్యక్త మవుతాయి; "బోరిస్ పాస్టర్‌నాక్ నూతన గ్రంథ ప్రచురణం (1945) ఇటీవలి సోవియట్ కవితా చరిత్రలో పరిగణనీయమైన సంఘటన! అలా అనడానికి ఎన్నో కారణాలున్నాయి. అతను గణనీయమైన కవి కావడ మొక్కటేకాదు; అతని గ్రంథాలు చాల అరుదుగా వెలువడుతూండడ మొక్కటే కాదు; అతని కవితా హృదయం సంపూర్ణకళా పరిపక్వస్థితిని ఈ గ్రంథంలో అందుకోగలగడమూ, ఇందులో మాత్రమే అతను నిస్తులమైన నిరాడంబరత్వాన్నీ - స్వచ్ఛమైన విస్పష్టతనూ పుంజుకోవడమూ, పరిసర జీవితంతోనూ - సమాజ జీవన వాస్తవికతలతోనూ-కవిగా అతనికిగల మానవతా సంబంధం దృఢతరం కావడమూ, వంటి అనేక కారణాలు ఆధారపడుతున్నాయి..." అన్నాడతను. పాస్టర్‌నాక్ కవితా గ్రంథ ప్రచురణ ఆనాడు అంతటి గణనీయమైన ప్రాశస్త్యాన్ని పొందింది.

యుద్ధ సమయంలో పాస్టర్‌నాక్ రెండు కవితా సంపుటాలు ప్రచురించాడు. 'ప్రభాత

కాంతులు' అనే మొదటి సంపుటి 1943 లో వెలువడింది. ఇందులో రెండవ సంపుటి- 'విపులాచ పృథ్వీ' అనే పేర 1945 లో వెలువడింది. నిజానికి రెండవ గ్రంథం మొదటి దానినుంచి ఎన్నికచేయబడిన కొన్ని కృతుల పునర్ముద్రణమే. అయితే- ఇందులో క్రొత్తగా కొన్ని మార్పులూ, చేర్పులూ చేయబడ్డాయి.

ప్రభాతకాంతి లో ఇరువదియారు ఖండకృతు లున్నాయి. అందులోని పదిహేను ఖండికలు 1941 లో వ్రాసినవి. మిగిలినవి 1936 లో వ్రాసినవే! అవన్నీ అప్పటి కప్పుడే 'కళాకారుడు' అనేపేర గ్రంథస్థమైనవే. ఈ సంపుటిలో కళాకారు డనే ఒక ఉత్తమ కావ్యమున్నది. అది ఈ క్రింది పద్యంతో ప్రారంభించబడింది.

"హృదయ కాఠిన్యముల నుద్భవించినట్టి
సుమకళాకారుడను నాదు అంతరాత్మ
సుఖతరస్ఫూర్తిలో క్రీడ సలుపుచుండు
ప్రబలమై మెయి నిలచు సమయములందు-
మానవాళుల జ్వాలికాతోరణాల
తొలగద్రోసుక మనుచుండు, వెలుగుటిరుల;
పదను పదముల నావికాయాత్రతోడ
కలగుచుందును నవకళాకారుడేను!
నాదు గ్రంథాళి దోష భూయిష్ఠమనగ
సిగ్గుతో వంతతో కుందుచుందు నెపుడు!"

ఈ కవి రచించిన 'విహంగాలు' అనే మరొక మృదుతర భావగీతిలో తన స్వగ్రామపు పరిసర ప్రాంతాల జానపద వాతావరణాన్ని పరిపూర్ణ రమ్యతతో చిత్రించాడు. ఈ గీతిలో అతను కవిగా, కళాకారునిగా తన ఆత్మవిశ్వాసాలను పునరుద్ఘా టించుకొన్నాడు:

"విహంగాల సముదయాలు అనంతాలు,
వినువీథుల ఎగసి ఎగసి నికుంజాల
మనకోసం నిర్మించును పతంగాలు.
మృదుశీతల సుమనికుంజ విలాసాలు!
గొడ్డలి,గుద్దలి, పొలాల ముఖ మెరుగనివనాలలో
బిడ్డలవలె పలవిస్తూ, కేరిస్తూ తాపించును
మహాశక్తి నందుకొనిన కళాజీవి హృదయంవలె-
ఖగవిహార మనవరతం స్వేచ్ఛాజీవన గీతం!"

పరిపక్వమైన కళాకారుని హృదయం విహంగ విహారంవలె నిర్నిబద్ధంగా వుండాలని ఈ కవి కానాటినుంచీ వాంఛితమే కాబోలు! అంటే - సామాజికమైన బాధ్యతలతో నిర్నిమిత్తమింగా బ్రత కాలని ఈకవి ఆశయం కాబోలు! ఇలాంటి వ్యక్తిత్వ వాద (Individualistic) ధోరణులే పెరిగి పెద్దవై, డాక్టర్ ఝివాగో రచనగా రూపొందడానికి అభ్యం తరమేముంటుంది?

ఈ కవి రచన 'విపులాచ పృథ్వీ' అనే కృతిలో- 1941 లో రచించబడిన సమర గీతాలకు పునర్నిర్మిత స్వరూపాలే అధికభాగం గ్రథించబడ్డాయి.

'వసంతహాసం' అనే కవితాసంపుటిలో- సమ కూరవలసిన విజయంపట్ల అస్పష్టమైన ఆశా భావమూ, నిరీక్షణా ద్యోతకమవుతాయి.

"అవును సుమా, ఈ వసంతమేదో కాని-
ప్రత్యేకపు సొబగులతో, వింతవింత
తొడవులతో,
రంగురంగు నవ్వులతో నర్తించెను,
కనుము సుమా!
అల్పజీవులైన పచ్చగడ్డి పిచుక లవే
అనల్ప కంఠస్వరాల సుద్దులెవో-
ముప్పొద్దుల వినిపించెను వినుము సుమా!"

ఇలాంటి సాంకేతిక పదచిత్రాలతో కూడిన ఆశా వాణిని వినిపింపచేయడమేకాక, ఈతని కృతులలో యుద్ధరంగాన్నిగూర్చిన విస్పష్ట వాస్తవిక చిత్రణలు కూడ ఎన్నో వున్నాయి.

'ప్రాచీన క్రీడాస్థలి' అనే గీతంలో విచిత్ర వర్ణ సముచయం దీప్తిమంతమైంది. ఆ కావ్యానికి ఇతి వృత్తమిది. యుద్ధభూమిలో బాగా గాయపడిన సిపాయి అపస్మారస్థితిలో ఆస్పత్రికి చేర్చబడతాడు. వైద్యసహాయంవల్లక్రమంగా అతనిఆరోగ్యం కోలు కుంటుంది. కళ్ళుతెరచి ఆస్పత్రిని పరిశీలిస్తాడు.

హఠాత్తుగా ఏవో అస్పష్టమైన స్మృతులు కలిగి, ఆ నీరసస్థితిలో ఎంతో కష్టంమీద ఏకాగ్రంగా ధ్యానిస్తాడు. మెల్లమెల్లగా ఆ స్మృతుల విస్పష్ట స్వరూపాల నాకళించుకుంటాడు. మనసు నీరసం గా నిస్తేజంగా మూలుగుతూనే వుంటుంది. స్మృతి రేఖలు మెరుపుతీగలై అతని మనసులో సంచరిస్తుంటాయి. ఆ అనువర్తి భవనం తాను పుట్టి పెరిగి- బాల్య జీవితాన్ని గడపినదే! ఈ సత్యం పొడకట్టేసరికి ఆలోచనాప్రవాహం అనంతమై అతని మనసులో వరదలు వారుతుంది. కలవరం కలిగిస్తున్నది. అతని జీవితసంబంధమైన చరిత్మాత్మక సంఘటనలెన్నో విస్మృతగాథల అడుగుపుటలలోంచి సజీవమూర్తులై వెలువడ నారంభిస్తాయి. ఈకావ్యం నిజంగా జీవిత మహేతివృత్తాన్ని సాంకేతికంగా చిత్రించింది. అనుపమానమైన ప్రతిభ ప్రదర్శించ బడ్డది. ఎంతటి శిఖరాయమాణమైన వ్యాఖ్యాన మునకైనా అర్హమైనదీకావ్యం. ఈ కృతి సంవిధాన చాతురిలో ప్రాతక్రొత్తలమేలు కలయిక సమకూర్చ బడింది—

"వర్తమాన యుగోద్భూత కంఠమహానాదంలో
గత కాలపు వెలుగునీడ-జీరలవే కనిపించెను.
రోగిప్రక్క చేరి ప్రేమలొలికించే నర్సులవలె
వెనుకటి గాయాలుమాన్పి నూత్నోత్తేజము
లిచ్చెను."

'ప్రభాతకాంతులు' కావ్యంలో యుద్ధపు తొలి దినాల సుప్తబీభత్సాలు త్రవ్వి తలకెత్తబడినవి. ఈ గీతం, అలతి అలతి అంగలతో అలెగ్జాండర్ బ్లాక్ మహాకవి గీతాలవలె - పురాస్మృతుల తలపోతల బరువుతో సాగిపోతుంది.

"గతం విగత జీవంగా
కనుపించిన మరునిముసము,
హఠాత్ కవిత సంపదవలె
సమరదరిద్రాణమైన
ప్రస్తుతయుగ ముఖరేఖల
నిశ్శబ్దముగా మార్చును.
సుఖక్రాంత స్ఫూర్తిమంత
జీవన కాంతిలోకము
పలుచని వెలుగై తేర్చును,
రష్యా నా మాతృభూమి
స్వయంసిద్ధ స్వరూపమది-
భయద వికృతి పరిమార్చును."

డి. యస్. మిర్‌స్కీ వంటి ప్రముఖ విమర్శకు లనేకులు 'ప్రభాతకాంతుల' లో పాస్టర్ నాక్ శిల్పం 'డానే' కవి సంవిధానమువంటిదనిపోల్చారు కాని నా ఉద్దేశంలో డానేతో యితనికున్న పోలి కలు చాల స్వల్పమే. అతని కవిత్వంలో గల పద చిత్ర జన్యమైన రసప్రకర్షను బట్టి చూసినా, స్పష్టా స్పష్టమైన ఉపమానాలంకారాదుల బట్టి చూసినా, జి. యం. హాప్కిన్స్ కవితారీతులతో పోల్చతగిన లక్షణాలు కలవాడుగా నా కనిపిస్తాడు." అంటాడు జార్జి రెవీ. గెరార్డుమాన్లీ హాప్కిన్సు మహాకవి ఆధుని కాంగ్ల కవితాపితామహుడు. హాప్కిన్సు కవిత అధికంగా మతాశ్రయమైనది. కాని పాస్టర్ నాక్ కవితలో మతాభినివేశం మచ్చుకైనా కన్పిం చదు. పదాల పోహళింపులో సహజసిద్ధంగా సమ కూరే విచిత్రనాదమూ, లయా, భావనాతరంగమూ, మానసికప్రేరిత చిత్రసముచ్చయమూ వంటి కవితా జీవనధాతువు లన్నింటా హాప్కిన్సు కవితో పోలిక లున్నాయి. అట్టి ఉత్తమశ్రేణి చతుష్పాద పద్య లక్షణాలనే పాస్టర్ నాక్ కూడ సముపార్జించు కున్నాడు. ఇతని పద్యాలన్నీ సంవిధానంలో నిత్య నూతనత్వం అలవర్చుకుంటాయి. పతిత్రుహ్పాద యంలో హఠాత్ సంభ్రమాన్ని పాదుకొల్పు తాయి. తలవని తలంపుగా అతని మాట బొమ్మ లలో అనునిత్యం మారుతూండే రంగులూ, రుచులూ, కళాఖండాలలోని ఆనందప్రద సన్ని వేశాలు మాత్రమే యిందుకు కారణమని చెప్ప వచ్చు.

ఇందుకు ఉదాహరణలుగా ఈ క్రింది ఖండ కృతులను పరిశీలించవచ్చును :—

హేమంతరోదసి :
సరిగానే చెబుతున్నా
ఒక వారం క్రిందటనే
చుక్కల వెనువెలుగు వాక
పొగమంచును చీల్చి వెడలె,
హిమబిందు స్నపితమూర్తి
ఘలంఘలల మొరసి నడచె,
గాజుతలుపు బ్రద్దలైన చప్పుడు వలె—
యామినీధునీ గడచెను.
మంచుగడ్డ పలకపైన
జారినటుల, సంతసాల
పంటకోసి కుప్ప
వేసికొనెను నాడు !
మంచుగడ్డపై నడచే
సాహస యాత్రిక వినుమా !
సావధాన చిత్తుడవై
వేయవలయు ముందుకడుగు;
లేకుంటే నీ అడుగులు
తడబడి పడిపోదువులే !
మలుపుతిరుగు కాడ-
సులువుకాదు, నీవె నీకు బరువు
తెరు వెవ్వరి వేడెదవో-
తరిగే దార్ఢ్యము కడవర !
ఇరుల దొంతరల కొండకు
ఇనుప గొలుసుతో గాలిని
బంధించిన నిశీధమిది ;
పగతో విషసర్పకులా
యములన్నీ తెరచెనదే !
శర్వరీ రహోగీతుల
శల్యాకుల్యముల పరచెను ;
సావధానచిత్తుడవై
సాగించుము మనుగడ
ముందుకు పథికా !
చలికాలపు పెనుగాలుల
వేటకుక్క మెడగంటలు
నలుగడలకు పరచె భీతి !
నిశి రక్కసి యినుపమడమ
కలిగించెను నెలవంకకు
ఘనీభావ విషరూపము !
ఊపిరి సలుపని నాలుక
లావాకీలల నుమిసెను ;
నోళుల లాలాజలముల
గడ్డకట్టుకొనిపోయెను.
సావధాన చిత్తముతో
సాగించుము జీవయాత్ర !

సుప్తారామం :
సుప్తారామము వెదజల్లెను
జీర్ణ పత్రముల—
కరగి కాలి నుసియై
పోయిన యిత్తడిరేకులు ;
నాతో, నా సహచారిణి
దీపశిఖిపింఛముతో—
సప్తవర్ణ దీధితి మయ
విశ్వమహోజ్యోతిర్మయి
వేలుచుండె తలక్రిందుగ !
వినిపించనిదేదో జీవపరమార్థము
రహస్యమై, శ్రవఃపేయ నిస్వనమై, సుహాసమై,
వినిపించెను లోలోపల నిశాశిఖరి తిమిరగర్భ
సోపానము లొకటొక్కటి—
తారావళి నూతగగొని
ఆరోహించెద నొంటిగ !
గిరిమల్లిక శాఖలవే,
వియద్రాజ్య జయకేతన
ధ్వజముల నెత్తిన రీతిగ—
గర్వోన్నతమై నిలచెను ;
శుష్కపత్ర సముచయాల,
జీర్ణకుసుమ సమూహాల
చాంద్రీ బింబావరణము
కప్పుచుండె మేలిముసుగు
తెరల మరల సుతారముగ !

అదిగో అదె కాసారం—
ఎద వెలువజు రహస్యమై
పదిలముగా గుసగుసలతో
బదరీపాదపముతోడ
పలుకుచుండె, తీవ్రకాంతు
వోతె నిలచి, పిలచుచుండె,
వేల్లిత జలధర పంక్తుల
నంబరమదె మొగసాలల
నారామస్థగితమై స్త్ర
సుమసదనం భాసించగ!

★

జార్జి రెవీ చెప్పినట్లు ఈ యుగాన మయకొవిస్కీ ఒక్కడే రష్యన్ సాహిత్యంలో సచేతనమైన సహజ ప్రతిభ గల మహాకవి. అతను మరణించిన తర్వాత, అతని కవితాశక్తి కీడుజోడైన చైతన్యమూర్తి మరొకడులేడు. కాని పాస్టర్‌నాక్ ఒక్కనిలో మాత్రం మయకొవిస్కీ సచేతన కవితావాణి వార సత్వం కొద్దిగానైనా వహించుకున్నది. పాస్టర్‌నాక్ దర్శనలో గాని, కవితానిర్మాణంలో గాని మయకొవిస్కీ సంప్రదాయం ఉన్నంతలో అనవకుంఠితంగానే దీపిల్లింది. కాని వర్తమాన విషయాలపై అతనికి అభిరుచి లేకపోవడమూ, నిత్యనైమిత్తిక సంఘటనల నుంచి అతని కవితావాణి ప్రేరేపణ పొందకపోవడమూ, సమూజ జీవనసమస్యల యెడల ఉపేక్షాభావం కలిగి వుండడమూ, వంటి దుర్లక్షణాలు రష్యన్ కవితరంగిణిలో మయకొవిస్కీ ప్రక్క స్థానం పాస్టర్‌నాక్‌కు లభించకుండా చేస్తున్నాయి....అన్న జార్జి రెవీ మాటలలో సత్యం లేకపోలేదు. ఏమైతేనేం, అతడిటీవల రచించిన 'డాక్టర్ ఝివాగో' అనే నవల నేటి ప్రపంచంలో గొప్ప సంచలనాన్నే కల్గించింది. ఆ నవలను 1957లో ప్రభుత్వ ప్రోత్సాహంతో నడిచేసోవియట్ ప్రచురణ సంస్థ ముద్రించాలనిసమకట్టింది. ఇంతలోసోవియట్ రచయితల సంఘం ఆ నవలను పరిశీలనగా చదివి, సుదీర్ఘంగాచర్చలుజరిపింది. డాక్టర్ ఝివాగో ప్రచురణ యోగ్యమైనది కాదని నిర్ణయించింది. ఇటలీ దేశానికిచెందిన మలాన్ ప్రచురణకర్త ఒకరుఆనవల వ్రాత ప్రతిని ఎలాగో సంపాదించి, ముద్రించాడు. ఆ నవలను చదివిన కొందరు పలుకుబడిదార్లు నోబెల్ బహుమానం పాస్టర్ నాక్‌కు యివ్వాలని సిఫారసు చేశారు. కాని తన మాతృదేశంలో రచయితలనుంచీ, ప్రజానీకం నుంచీ యింతటి తీవ్ర ప్రతికూల విమర్శలపొందిన తన నవలకు దేశాంతరాలనుంచి వచ్చిన బహుమానం గ్రహించడం భావ్యం కాదని పాస్టర్‌నాక్ స్వచ్ఛందంగా నిర్ణయించుకున్నాడు. ఇంతవరకూ విడ్డూర మేమీలేదు.

నోబెల్ బహూకరణ సంస్థ ఏర్పడిన తర్వాత రష్యాలో ఎందరో మహారచయిత లుద్భవిల్లారు. రోమారోలాకు ఆప్తమిత్రుడైన గోర్కీ, కుప్రిన్, ఛకోవ్. డోస్టవిస్కీ, తుర్గినీవ్ వంటి మహనీయులు అపూర్వ కళాఖండాలను సృష్టించారు. వారి కెవ్వరికీ నోబెల్ బహుమానం ఇవ్వబడలేదు. ఇటీవలి వారిలో కూడ షొలొకోవ్, ఫెడిన్. ఫెడియేవ్, ఇల్యా ఎహ్రెన్‌బర్గు వంటి ఉత్తమ రచయితలెందరో వున్నారు. కాని వారి కెవ్వరికీ ఈ బహుమానం ఇవ్వబడలేదు.

యుద్ధానంతర దశలో సోవియట్ రష్యాలో అంత ప్రసిద్ధుడుగా గాక, ఏదో ఒక మూలనుండి తనకుతానై తోచినప్పుడల్లా యేదో వ్రాసుకుంటూన్న పాస్టర్ నాక్ నేటి ప్రపంచ రాజకీయవేత్తల జూదపు పెత్తులకు పావు కావలసి రావడమే అబ్బురమైన సంగతి.

---

[ఈ వ్యాసరచనకు విండ్సేడ్రమ్మండ్ లిమిటెడ్, గల్ఫర్డ్ ప్లేస్, లండన్ - ప్రకాశనసంస్థవారు ప్రచురించిన ఈ క్రింది గ్రంథాలు ఎంతగానో సహకరించాయి. ఆ ప్రచురణసంస్థకూ, రచయితలకూ నా కృతజ్ఞతలు.

**1. Soviet Literature Today — by Georg Reavey. 2. Boris Pasternak — Selected Poems— Translated by J. N. Kohen. 3. The collected Prose works of Boris Pasternak—]**

# ఆముక్తమాల్యద
## రసదృష్టి-మతదృష్టి

వేటూరి ఆనందమూర్తి

ఆంధ్ర సాహిత్యోద్యానమున వస్తు ప్రధానములగు రసాల బీజములను, ఋషితుల్యులగు కృషీవలులు నాటగా నవి మొలకెత్తి, పెరిగి పెద్దవై, ప్రభుపోషణమునఁ బుంజుకొని రచనారూపమునఁ గొమ్మలతోను రెమ్మలతోను గుబురుకొని, యౌవనావిర్భావమున రాయల యుగమను ఋతురాట్సమయ సమాగమమునఁ బుష్పించి ఫల ప్రదములై, రస ప్రధానములగు ప్రబంధములను మన కందించినవి. ఆ కవితా వృక్షమునఁ బండిన తీయని ప్రబంధ ఫలమున కుండిన తొడిమయే మతము. అందుండియే దానికిఁ గావలసిన మధురస సామగ్రి సంగ్రహింపఁబడినది. ఆదియే లేకున్న నా ఫలమునకు నిలుకడయేలేదు. అది తల్లివంటిది. కాని పండు పండఁబారి యోగ్యమైనప్పు డది పట్టువిడి యదృశ్యమై సంకేతరూపమున మాత్రమే శిరస్స్థానమున నుండును. ఇఁక నా ఫలము నందలి రససామగ్రి కడుగున మడగియుండు కోష్ఠమే కథావస్తువు. ఆ బీజము పరిమాణమున నెంతటి దైనప్పటికిని, ఫల సౌష్ఠవమున కది యాశ్రయము కల్పించిన దైనప్పటికిని, రసపరిగ్రహణ సందర్భమున మాత్రము రసికవశ్యుల కది పరిత్యాజ్యమే యైనది. మరి యా కోశము నాశ్రయించి మెండుకొని నిండుకొన్నదే అమృతోపమానమగు రసపదార్థము. అది యవశ్య మాస్వాద్యము. అట్టి యా రసమును బంధించు సంశ్లిష నిర్మాణమే రచన. అది దర్శనీయము—మరియు—విమర్శనీయము. ఇఁక నా ఫలమున కోశమునుండి త్వగావరణము వరకును గల సర్వవస్తు సముదాయము నందును, నునికి యెఱుఁగరాక వ్యాపించి, పరిమళించు మాధుర్యమే ధ్వని. అది యనుభవైక వేద్యము. కావున నా ఫల మవశ్య మనుభవింపఁదగినదే!

అట్టి వానిలో రాయ లందిచ్చిన ఆముక్తమాల్యదాఖ్య ప్రబంధ ఫల మత్యపూర్వమైనది. అది యెట్లు పండబారి రసవిష్టమైనదో యిందు ముందు వివరింతును.

మత సాహిత్యముల విషయమునఁ దిక్కన కల్పించిన సహన సామరస్యము లను పునాదులపై జరిగిన నూత్న కావ్య నిర్మాణమెల్లఁ జాలవరకు రసభరితమే కాఁజొచ్చినది. అదియు పదునారవ శతాబ్ది తొలి పాదమున విజయనగర చక్రవర్తియగు శ్రీకృష్ణ దేవరాయల పరిపాలనాకాలమున పరాకాష్ఠ నందుకొన్నది. అంతకుఁ గొంత పూర్వమే ఆంధ్ర దేశమున రాజకీయ రంగమం దెట్లుండినప్పటికిని, మత సాంఘిక రంగములందు మాత్ర మలజడి తొలఁగి శాంతి సౌఖ్యములు నర్తన మాడఁ దొడఁగినవి. సామూహిక రాజకీయ ప్రపంచమున భేదవాదము లుండినప్పటికిని నాఁటి సర్వాంధ్ర ప్రజల యేకైకలక్ష్యము హైందవ ధర్మోద్ధరణమే యగుట దానికిఁ బ్రబల హేతు వైనది. నాఁడు హైందవ ధర్మముతో బాటు లలిత కళలకును వికాసము కల్గి దేశ ప్రజల మనస్తత్త్వము లలితము సుందరమునై, సామాజిక జీవితమే భోగ భాగ్యముల కాలవాల మైనది. తత్ప్రతిబింబమే నాఁటి సాహిత్యము. అదను పదనులు సరిగా పొసగి తెలుఁగు పొలమునఁ బెరిగిన సాహిత్యపు పైరు కృష్ణరాయల కాలమున బంగారు పంట పండి, కోతకు దిగి వచ్చినది. ఎన్నటికిఁ దరిగిపోని యెనిమిది పుట్ల సాహిత్యపు బంగారు పంట నా రాయలు మూటలుగట్టి భువన విజయ సభా భవనమున నిక్షిప్త పరచినాఁడు. సారస్వత లోకమున కరువు కాటకములు తొలఁగిపోయినవి.

"అక్షర పక్షపాతమున" రాయలు పలువురు కవులను బోషించినాఁడు. వారు తమ దివ్యకవితాసుగంధరసమును ప్రబంధించి రాయల రసికమూర్తి కభ్యంజనము గావించినారు. ఆ వాసన కొంత తన సంస్కార గంధమునకుఁ దోడయి కానోపును, రాయలును సరసుడై తన యభిమతమును బ్రబంధించి స్వామికి నిబంధించుకొనినాఁడు. ఆనాఁటి ప్రబంధము లల్పకథావస్తుకములు. అనంత రసాత్మకములు. ఔచితీసమంచితములు. వర్ణనా ప్రధానములు. అవి రమణీయములగు శ్రవ్యకావ్యము లైనను నందలి కల్పన అత్యంత దర్శనీయములై వానికి దృశ్యకావ్యత్వ మారోపించినవి. వర్ణన లుండినప్పటికిని కావ్యములందలి కథాగతి లోకరీతి ననుసరించి, క్రియాత్మకమై

ప్రత్యక్ష మగుటను బట్టి యవి దృశ్యశ్రవ్యైకరూపము లనఁదగు ప్రబంధములుగా రూపొందినవి. అదియే నాఁటి కావ్యముల వైశిష్ట్యము.

అట్టి వాసిలో వైష్ణవాంధ్ర సాహిత్యమున విష్ణుచిత్తీయమను నామాంతరము గల ఆముక్తమాల్యదాఖ్య ప్రబంధమునకొక విశిష్టస్థాన మున్నది. ఏలన తత్కృతికర్త వైష్ణవుఁడు. కృతిభర్త శ్రీ వేంకటేశ్వరస్వామి. ఇఁక కృతి విషయము కూడ వైష్ణవమే. ఇట్లన్నియు నతర్కితముగా వైష్ణవములు గానే సమకూడు టొక వింత. అదియుఁ గవికిఁ గల వైష్ణవ మతాభిమానమును బట్టియు, తన్మత ప్రచారమం దాతనికిఁ గల గాఢాభినివేశమును బట్టియు నొనగూడినది. ఆ ప్రబంధము నాద్యంతముఁ బరిశీలించితిమేని వైష్ణవ మత సిద్ధాంతస్థాపనకును, బ్రచారమునకును ఆ కవి గావించిన యపార పరిశ్రమము తెలియనగును. కృత్యాద్యవస్థలోనే మన కా విషయము తేటతెల్లము కాఁగలదు.

రాయ లెంత మత సహనము కలవాఁడని తెలియవచ్చినను ఆతనికిఁ గల వైష్ణవ మతాభినివేశ మసాధారణమైనదనియే చెప్పవలయును. ఈ విషయ మాతని యీ ప్రబంధ కథావస్తుస్వీకారము నందును, దన్నిర్వహణ మందును, భావ ప్రకటనమునందును, వర్ణన వైఖరియందును నడుగడుగునఁ బ్రస్ఫుట మగుచుండును. ఆ యభినివేశ మాతని యవ్యక్త హృదయమునుండి మెలమెల్లఁ వెలువడి కథా కథనమున వ్యక్తావ్యక్తమై రచనా రూపమున సువ్యక్తమైనది.

ఇది యొక కథల సంపుటి. ఇందు ప్రధాన కథ విష్ణుచిత్తమునుల ముద్దు పట్టి యగు గోదాదేవి కథయే కాని దానికేదేని నెపమున ముడిపెట్టిన యితర గాథ లన్నియుఁ బ్రధాన కథకు కథావిషయమున నంతగా నంగభూతములు కాకున్నను, తద్రచనా ప్రణాళికకు వెనుక నున్న మూలధర్మమగు మత ప్రచారమునకు మాత్ర మధికముగనే దోహదము చేసినవి. ఆ దృష్టితోఁ బరిశీలించినపుడు మాత్రమే ఈ ప్రబంధమున పై కథల యునికియు, వాని విస్తృతియు సమర్థనీయములగుచున్నవి. రాయల కవితాసృష్టిలోఁ గల దృష్టి ద్వివిధము. అందు మొదటిది మతదృష్టి, రెండవది రస దృష్టి. ఈ దృష్టిని మనము దర్శించినపుడుగాని యీ కవి సృష్టిలోని సౌందర్యమును మనము గుఱుతింప జాలము. ఇప్పు డాతని మతదృష్టిని గొంత రసదృష్టితో బాటు వివరింతుము.

రాయ లొకతూరి "కళింగ దేశ విజిగీషా మనీషం దండెత్తి పోయి విజయ వాటిం గొన్ని వాసరంబు లుండి శ్రీకాకుళ నికేతనుం డగు నాంధ్ర మధు మథను సేవింపఁ బోయి, హరివాస రోపవాసం బచ్చటఁ గావింప నప్పుణ్య రాత్ర చతుర్థ యామంబున"—కలలోఁ దెలుంగు రాయఁడు ప్రత్యక్షమై "ఆంధ్రభాష యసాధ్యంబె యందు నొక కృతి వినిర్మింపు మిఁక నాకుఁ బ్రియముగాఁగ" నని యర్థించుచు—

"ఎన్నినుఁ గూర్తు నన్న, విను, మేమును
దాల్చిన మాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి
చెప్పుము, మున్ను గొంటి నే
వన్నన దండ యొక్క మగవాఁడిఁద,
నేను దెలుంగు రాయఁడ,
గ్గన్నడ రాయ, యక్కొఁదువఁ గప్పు
ప్రియాపరిభుక్త భాక్కృతన్" (1-14)

అని యాదేశించెను. రాయ లా యాదేశమును శిరసా వహించి తన "యిష్టమైన వేల్పగు శ్రీ వేంకటపతి కంకితముగా గోదాదేవి చరిత్రమును రచించెను. కావ్య ప్రారంభమందే యిష్టదేవతా వందన మాచరించి, తదుపరి కావ్య సంప్రదాయము ననుసరించి తదితర స్తుతి ప్రశంసాదిక పద్యములను రచించి, కథాకథనమున కుపక్రమించెను. కావ్య వస్తువు మొత్తమిం దేఁడాశ్వాసములలో నున్నది. గోదాదేవి శ్రీరంగనాథుని పరిణయమాడుట ఇందలి ప్రధానేతివృత్తము. "శూడి క్కొడుత్త నాచ్చియార్" అని ద్రావిడ వాఙ్మయమునఁ బ్రశస్తిఁగాంచిన ఈ గోదాదేవి, పన్నిద్ద రాళ్వారులలో నొకరని ప్రఖ్యాతిఁగన్న పెరియాళ్వారు లనఁబడు విష్ణుచిత్త మహామునులకుఁ బెంపుడుబిడ్డ—ఈమెయు నందొక యాళ్వారే—వీరి వృత్తాంతములు సవిస్తరముగా దివ్యసూరిచరిత్రము, ప్రపన్నామృతము మున్నగు సంస్కృత గ్రంథములందును, వైష్ణవగురు పరంపరా ప్రభావమును దెలుపు కొన్ని ద్రావిడ గ్రంథములందును కాననగుచున్నవి వానెల్ల నాధారములుగా గొనిరాయలా ప్రధానకథను రచించుచు, నడుమనడుమ తనకు హితములని తోచిన మత సాహిత్య సంప్రదాయములను వెల్లడించుటకుఁగా కొన్ని మార్పులను చేర్పులను గావించి, యీ ప్రబంధమును బెంచినాడు. ఇందాతనికి కథ చెప్పుట కాదు ప్రధానము—కథ నాధారముగాఁగొని మతమును రసముగా పర్యవసింపఁజేసి మన కందించుటయే; —కావున నా దృష్టితోఁ బరిశీలించితిమేని యీ ప్రబంధమందలి కథల కూర్పులో రాయ లెంతవరకు కృతకృత్యుఁడైనాఁడో యెఱుగ వగును. అప్పుడాతని కథల కూర్పులో పొందిక పొసగినదా, ప్రబంధమందు వస్త్వైక్యమున్నదా యను ప్రశ్నల కెడ ముండదు. కావున నా దృష్టితో మాత్రమే యందలి యితివృత్తమును బరిశీలించి యాకరములను వెల్లడించుచున్నాను.

## ఇందలి కథావస్తువు - ఆకరములు మార్పులు, చేర్పులు

కథాప్రారంభమందే భాగవత పూజాసక్తుడును, మహా భక్తుడును నగు విష్ణుచిత్తుని యావాసస్థానమగు శ్రీ విల్లి బుత్తూరు వర్ణన మున్నది.

"అందుండున్ ద్వయసద్మ పద్మ వదనుం
దద్వంద్వుఁ డక్రాంత యో
గాందూబద్ధ మధు ద్విషద్విరదుఁ
డన్వర్థాభిధానుం డురు
చ్ఛందోబృంద తదంతవాగపఠనా
సంజాత తజ్జన్య వి
ష్పంద ద్వైత సుసంవిదాలయుఁడు
నిష్ఠ న్విష్ణుచిత్తుండ నన్." (1-7)

అనినాఁడు.[1] ఇందలి చివరి చరణములనుబట్టి యాతఁడీ జన్మలో వేద వేదాంతములు చదువకున్నను "ప్రహ్లాదో జన్మ వైష్ణవః" అనినట్లు సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షము ననే జ్ఞానియు, యోగియు నైనట్లు తెలియుచున్నది. అతఁడు న్యాయార్జిత విత్తమున జీవికఁ గడపుచు, భాగవతుల పూజింపుచు, మాలాకైంకర్యమున నా యూరి స్వామిని సేవింపుచుండెను. ఈ వివరములను జెప్పుచు, వాని నట్లుంచి కవి యా నడుమ పాండ్యమండలమున మధురాపురమును విపులముగా వర్ణించి, దాని నేలు మత్స్యధ్వజుని[2] గూర్చి ప్రస్తావించును. అపై గ్రీష్మవర్ణన—అ గ్రీష్మమున నొకరాత్రి మత్స్యధ్వజుఁడు అరక్షక పరివారముతో భోగిని[3] యింటి కేగుచు మార్గ మధ్యమున మధురాపుర వైభవమును జూడవచ్చి నిజపురోహితు నింటి వాకిటి వేదికపై విడిసి యుండిన పరదేశి విప్రుఁ డొకఁ డుబుసుపోకకుఁ దోడి వారితోఁ బ్రసంగించుచుండిన సుభాషితముల నాలించెను.—అందొకట—[4]

"వినియె నెల లెనిమిదియుని
వృష్టిదినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను, బూవి
పరంబున కిప్పు, డుద్యమం
బనువుగఁ జేయఁగావలయు నంచు
బురోహిత ధర్మ మాత్మ గీ
ర్ణ్యాన నల విప్రుఁ డా ద్విజులలోన
సుభాషితము న్పఠింపఁగన్". (2-78)

విని రాజు తద్గ్రంథార్థము నెమ్మనమున నూహించి, భోగ వైభవములు క్షణికములని యెంచి, మోక్ష ప్రాప్తి మార్గముల నన్వేషించుట కుద్యుక్తుఁడాయెను. తనకు జ్ఞానోదయము గల్గించిన యా విప్రునకు "వ్వీటీ కరండమున ముద్రితమై యునిచిన యొక ముడుపు" నారక్షకునిచేత నిచ్చి పుచ్చి, నగరు సొచ్చి, యా నిశ గడవగనే, తద్విషయమున నొక నిశ్చితాభిప్రాయమునకు వచ్చుటకై తన సభలో భిన్న మత ముల వారి కొక శాస్త్రచర్చ నేర్పాటుగావించి, విజువగల బహుమతిని ప్రకటించెను— ఎంద రెందరో చర్చలో పాల్గొనుచుండిరి. అపు డొకనాఁడు "విల్లిబుత్తూరిలో నల్ల విష్ణుచిత్తుఁ డతులతులసీసుగంధ మాల్యమును మూల మంత్రమున నక్కు పేర్పఁ" బోగా మన్నారు స్వామి యా మహామతిని సంబోధించి వాదమునకేగి దుర్మదాంధుల నణచి, యిహము రోసిన పాండ్యునకు వైష్ణవ మిప్పింప వలసినదిగా నాజ్ఞాపించెను. అతఁ డందు కర్హుడు కాకున్నను దైవాజ్ఞను బాటించి యందుల కచ్చటికేగి, సంభావితుఁడై, శాస్త్రచర్చలో స్వామి యనుగ్రహమున సర్వ మతస్థుల నోడించి వైష్ణవమును సిద్ధాంతపరచెను. పిదప తత్పోష

---

1. జ్యేష్ఠే మాసే పవమానతారే, శ్రేషోగుణేనా ఉజని భట్టనాథః,
తత్ర త్రయీ రూప గరుత్మ దాత్మా కటాక్ష లక్ష్యం కమలాపతే ర్యః. ది. సూ. చ.

2. దివ్యసూరి చరిత్రాదులన్నింటిలోను పాండ్యరాజు పేరు వల్లభదేవుఁడని యున్నది.

3. ద్రావిడ గ్రంథములలో నీ సందర్భము వ్యత్యస్తముగ నున్నది.

"పాణ్డియన్ కులత్తిలే శ్రీ వల్లభ నెన్గిర రాజా....మధురై లేయిరున్ను రాజ్యం పణ్ణిక్కొణ్డు పోరుకి అకాలత్తిలే, అన్ద రాజా, నగర శోభనార్థమాక ఇరుకిఱ వళవిలే ఒరు బ్రాహ్మణన్ అజ్గే ఒరు తిణ్ణయిపే కిడక్క కణ్డు, రాజా అవనై యెళుప్పినార్"—

ఇత్యాదిగా ద్రావిడ గురు పరంపరా ప్రభావమున నున్నది. పెరియాళ్వార్ వైభవమ్ పేజి 75.

4. "........అనాల్ ఒరు శ్లోకమ్ శొల్లిక్కొణ్డాయ్" ఎన్న అన్ద బ్రాహ్మణనుమ్—"వర్షార మష్టౌ ప్రయతేత మాసాన్, నిశార్థ మర్థం దివసం యతేత, వార్థక్య హేతో ర్వయసా నవేన, పరత్ర హేతోరిహ జన్మనాచ" ఎన్గిఱ శ్లోకత్తై చ్చొల్ల... .... ద్రావిడ గురు పరంపరా ప్రభావం—పెరియాల్వార్ వైభవమ్—పేజి 75.

కముగా "ఖాండిక్య కేశిధ్వజ సంవాద"[5] మను నొక యితి హాసమును గూడ వక్కాణించెను. విజయముతోఁ బాటు బహుమానమును గూడ నాతఁడే గ్రహించి, రాజలాంఛన ములతో నేనుఁగు మీఁద విల్లిబుత్తూరున కేతెంచెను. గ్రామము పొలిమేరలో నాతనికి మన్నారుస్వామి ప్రత్యక్ష మాయెను. ఆ భక్తుఁ డా స్వామి యవతార మూర్తులను భక్తితో స్తుతించి తాండవమాడెను.[6] తనకు లభించిన గౌరవ సంభావనల నా స్వామికే యర్పించి యథావిధిగా ద్విగుణీ కృతోత్సాహముతో భాగవత మాలాకైంకర్యాదులఁ గొన సాగించుచు సుఖ ముండెను. ఇక నాతని కొకనాడు తులసీ వనమున నాండాళమ్మ పసిబిడ్డగా చేతికి దొరకుట తర్వాతికథ. ఈ లోపుగా కవి ఇట్టి మహాభక్తుఁడే యనఁదగు యామునా చార్యుల చరిత్రము[7]ను గూడఁ గొంత విపులముగనే పక్షి పుంగవ కేతనుండు పుండరీక నికేతనకుఁ జెప్పినట్లు చెప్పుచు, నా వడుమనే కథాగతి కనుకూలముగా నుండునట్లు వర్ష శర దృతువుల నధికముగా వర్ణించి, యొకింత రాజనీతిని గూడ గ్రంథస్థము గావించెను. ఆ పైఁ గొన్ని ఋతువులు వెళ్ళినవి. ఒకనాడు తోటలో "వెలిదమ్మి బావికిఁ జెంగట నల్లసిల్లు తులసీ వన సీమ" లో నొక పాల గచ్చు తిన్నె మీఁద నొక యాడు పసుఁగు దొరికినది. కన్నబిడ్డ కన్న నెక్కుడు గారాబ ముతో నా బిడ్డను బెంచి పెద్దసేసెను. ఆమెయే గోదా దేవి[8]. సంస్కార వశమున నామెరంగనాథునే ప్రేమించినది. తండ్రి దండలుకట్టఁగా ఆమె రహస్యముగా వానిని గొప్పునఁ దాల్చి, యలంకరించుకొని, కూపవారిలోఁ బ్రతిబింబమును జూచుకొని మురియుచుండెడిది. తిరిగి యా దండనే గూడలోఁ బెట్టగా తండ్రి యెఱుగక స్వామి కర్పించెడివాఁడు. స్వామియు సంతసించు చుండెడివాడు. ఇట్లు కొంత కాలము గడచినది. ఆమె వియోగ మధికమైనది. తుదకు రంగనాథుని మీఁది విరాళితో నామె యొక పుణ్య వ్రతము నారంభించి, దిన దినమునకు శుష్కించుచుండెను. "అబుద్ధేశి ధనుః పత్రి" యగు నా విష్ణుచిత్తుఁ డదియేమో యెఱుఁగఁజాలక, గోద యవస్థను స్వామికి విన్నవించెను. ఆయన మందస్మితము గావించి, తన భక్తురాలి వ్రత విధాన మును వివరించుటకై విష్ణుచిత్తునకు మాలదాసరి గాథను విపులీకరించి, యామె మహీమహిళ యవతారమని చెప్పెను. విష్ణుచిత్తుడు సంతసించి, గోదాదేవితోఁ గూడ శ్రీరంగమున కేగెను. వివాహ నిర్ణయము జరిగెను. గోదా రంగనాథుల వివాహమును విష్ణుచిత్తుఁడే దివ్యముగ జరిపించెను. దేవతలు పుష్పవృష్టి గురిసిరి. ఇదియే అందలి కథాసారము.[9]

ఈ ప్రధా నేతివృత్తము నీతఁడు ద్రావిడ గ్రంథముల నుండి గ్రహించినను, దన్నిర్వహణమున మాత్రము కవి స్వేచ్ఛను బాటించినాఁడు. అందలి వల్లభదేవుఁ డిందు మత్స్య ధ్వజుఁడైనాఁడు. మూలమున నా రాజు నగర శోధనార్థమేగి యా బ్రాహ్మణునితోఁ బ్రసంగించి వచ్చినట్లుండఁగా నిందు రాజు భోగిని కడ కేగుచుండినపుడు జరిగినట్లీ వృత్తాంతమును మార్చినాఁడు. విషయోన్ముఖుఁడగు రాజున కా తర్వాత వైరాగ్య చింతన ముచితమగునని కాఁబోలు నీ కవి యిట్లు మార్చినాడు.[10] ఆ బ్రాహ్మణుని నిద్రలేపి యడిగినట్లు మూల

---

5. ఈ పట్టున నీ యుపాఖ్యానము ద్రావిడ గ్రంథములలోఁ గానరాదు. ఇది విష్ణుపురాణాంతర్గత గాథ.

6. ఈ పట్టున నిందలి రచన మూలానుసారియై యున్నది.
"తాళౌ గృహీత్వా కరిరాజ ఘంటే తన్మంగళాశాసన గేయమాహ" — ది. సూ. చ. 5 (69)
"పల్ వక్తై యాలుమ్ తిరుప్పల్లాణ్డు పాడి యెరుళినార్"
ద్రావిడ గురుపరంపరా ప్రభావము— పెరియాళ్వార్ వైభవము—పేజి 82

7. వీరి చరిత్రము కూడ దివ్యసూరి చరిత్రాదులందు కలదు. కాని, కొన్ని యంశములలో నించుక భేదమున్నది. ముమ్ముందు వివరింతును.

8. "స విష్ణుచిత్త స్తులసీ వనావనిం, ఖనిత్రవక్త్రేణ విఖాతయన్ కిరౌ,
శుభే ముహూర్తే శుచిమాసి ఫల్గునీ ప్రతీతకారే తులసీవనాన్తరే,
భువోభవా త్కాంచన బాలకన్యకాం భూమ్యంశకాం వీక్ష్య విసిష్మయే ముదా" (ది. సూ. చ.)

9. గోదాదేవి కథయే యిందలి యితివృత్తము గావున నీ ప్రబంధమునకు "ఆముక్తమాల్యద" అని పేరైనది. ద్రవిడ ప్రబంధములలో కానసగు "శూడిక్కొడుత్తాళ్" అను వ్యవహార నామమునకు "ఆముక్తమాల్యద" సరియైన యను వాదము.

10. "భోగలంపటునకే తద్వైముఖ్యము జెప్పుట అనంతర తత్త్వజిజ్ఞాసాభినివేశమునకు అనుకూలతరమని ఆంధ్రకవి యిట్లు మార్చినాఁడనవలసి యున్నది." (కి. శే. వేదంవారి పీఠిక-పు. 5)

మున నుండఁగా నిందు వేసఁగిలో వెన్నెల బయట తిన్నెపైఁ గూర్చుండి సుభాషితము లాడుకొనుచుండిన విప్రుని మాటలు వినినట్లు మాత్రమే కూర్చినాఁడు. ఇందు రాజు గభీరుఁడు. ఈ మార్పు సుందరము.

## గోదాదేవి కథ

ఇట్లే గోదాదేవి చరిత్రమునను గొన్ని మార్పు లున్నవి. ఆమె నిసుఁగుగా నున్నప్పుడు తోటలోని తిన్నెపై దొరకిన దన్న మార్పులో కవి కున్న నవీనదృష్టి ప్రదర్శితమగు చున్నది. మూలము ననుసరించి గోద భూదేవియవతారమని వివరించినను కవి "త్రైకాలిక జ్ఞానవంతులైన ఋషులు పలికి" న ట్లామె చెలికత్తెల మూలమున గోద సత్యాదేవి యవతార మని కూడఁజెప్పించెను.[11] ఈ విషయము ద్రావిడ గ్రంథము లలోఁ గానరాదు. మూలమున నీమె చెలికత్తె అనుగ్రహ యొక్కతియే. కాని యిందు మరాళి, హారిణి, స్రగ్విణి మున్నగు పేర్లు కలవారు ముగ్గురు నలుగు రున్నారు. వారంద అను బూర్వ భవమున నాగకన్యలని కవి చెప్పెను. ఇందు వారు గోదాదేవి విరహమును గమనించి, యుపచారాదులచేఁ గాపాడి, రంగనాథుని బొసగించుకొనుటకుఁ దగిన వ్రత చర్య కామెను బ్రోత్సహించినారు అయోగ శృంగారమును వర్ణించు నప్పు డీ చెలికత్తెల ప్రమేయమే గాని విష్ణుచిత్తుల వారు జోక్యము గల్పించుకొని విచారించుట, పరిశీలించుట ఇందు కానరాదు. వ్రత విధానమున బిడ్డ కృశించుచున్నదని దిగులుపడి మన్నారుస్వామినే యతండు ప్రార్థించును. వివరము తెలిసికొని యుత్సాహముతో శుభకార్యమున కేర్పాటు చేయును.

అంతియేకాని మూలమునందువలె యౌవనవతియగు కుమార్తెను తండ్రి వివరము లడుగుటయు, నామె రంగ నాథుని వరించినట్లుచెప్పుటయు, వారు తీర్థయాత్రల కేగుటయు మున్నగు సంశము లిందు లేవు. కథాకథనమున నౌచిత్యము నధికము గావించుటకే ఈ మార్పు కావింపఁబడినది. ఇట్టిదే గోదాదేవి పూల మాలలను ముడిచి విడుచు పట్టు కూడ: మూలమున తండ్రి కా విషయము తెలియుటయు, నాతఁడు నొచ్చుకొనుటయు, స్వామి యాతని యభిప్రాయమును దిద్దుటయు జరుగును. ఈ ఘట్టమున నిందాముక్తమాల్యద చారిత్ర మా పుణ్యదంపతులకు మాత్రమే యెఱుక. తండ్రికిఁ గూడ నా విషయము నెఱుకపరుప కుండుటను బట్టి కవికిఁ గల రసదృష్టి యెట్టిదో యూహింపవగును. ఇట్లే గోదాదేవి పరిణయానంతర మామెను రంగనాథుఁ డంతర్ధానము గావించినట్లు మూలమున నుండ గా నిందు కావ్యమును బరిణయము తోడనే కవి పూర్తిగావించినాఁడు. కాని యామె యంతర్ధానమైన నెట్లుండునో సూచించుటకుఁ గవి యా విషయమును గొంత ముందుగానే ముచ్చటించినాఁడు. విష్ణుచిత్తుఁడు గోదాదేవిని శ్రీరంగమునకుఁ గొంపోయి స్వామి దర్శనము చేయించినపుఁ డా రంగనాథు డామెమీఁది తమకము నాపుకొనలేక లోఁగొని తత్స్థానమున నొక్క మాయావధూటిని గల్పించెను. పల్లకి యెక్కినది తన బిడ్డయే యనుకొని విష్ణుచిత్తుఁడు విడిది కేగి పరిశీలింపఁగా నందెవ్వరును గానరారు. తన బిడ్డను మాయఁజేసి రంగనాథుఁ డపహరించెనని తండ్రి తకపికలై పోయినాఁడు. అప్పు డా "భాగవత శోభంబునకు భువన భర్తయు భయంపడి, తచ్ఛందసంబునకు గేలిసేయుచున్న వాఁడను భావం బతనికిఁ దోఁప" విష్ణుచిత్తుని స్వామి మందలించి, యేమియు నెఱుఁగ నట్లు విడిదిలో నామె నెప్పటియ ట్లుంచెను. ఈ చమత్కృతి మూలమునలేదు. ఇందు కవి పరిణయము తోడనే కథ పూర్తి గావించినాఁడు.

## యామునాచార్య చరితము

ప్రబంధమునందలి ప్రధానేతివృత్తమున కప్రసక్తముగా నిందు లక్ష్మీనారాయణుల ప్రసంగ రూపమున జొప్పింపఁ బడిన యామునాచార్య చరిత్రము కూడ ద్రావిడ గ్రంథముల నుండి పరిగ్రహించినదే. కథాస్వీకారమున నెట్లుండినప్పటి కిని, గథా నిర్వహణమున మాత్ర మేదృష్టితో దానికిఁ గావ్యమున స్థానము గల్పింపఁ బడినదో యా దృష్టి కను కూల మగు విధముననే రచన సాగినది. విశిష్టాద్వైత మత సిద్ధాంతమును ప్రచార మొనర్చుట కనువైన మఱియొక

11. "దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి చూపోప, కిం
తవు జిల్గుంబని యంతవేసి, మది నీర్ష్యాక్రోధమేల్పందడిం
వ, విరింబోక, ద్రుమంబునైకొని, పతి న్మందన్న మ్రానెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య నీవహహా! కావా? భామినీ నావుడున్." (5-74)

ఈ ప్రస్తావనలో సత్యాదేవి కథ నంది తిమ్మనగారి పారిజాతాపహరణ కావ్యము ననుసరించి యున్నది. ఆ విషయ మును స్మరించుటకే కవి యీ ప్రస్తావన నిందు తెచ్చినాఁడేమో!

మహా భక్తుని దివ్యచరిత్రమును స్మరించి, తత్ప్రసంగమునం దనకుం దోచిన వ్రాంతలనో, నీతులనో కవితారూపమున సాహిత్యకుల కందించుటయే దాని పరమార్థము. ఈ కథ కాకరము మాత్రము వేఱు గాని యింక నందలి కల్పన లన్నియు నీతని సొంతములే. ద్రావిడ గ్రంథములలో వీశ్వరముని పుత్రుండును, నాథముని పౌత్రుండును నగు నీ యామునాచార్యులు మహా భాష్య భట్టరుల శిష్యులనియు, నొకతూరి యప్పటి పాండ్యరాజు నాస్థాన విద్వాంసుండగు నక్కి యాళ్వాన్ రాజునకు వలెనే తనకును విద్వాంసు లందఱును గప్పము కట్టవలెనని నిర్బంధింపంగా నొచ్చుకొని నిర్భయముగా యామునులు వారి నెదిరించుటయుం దత్కారణముగా రాజ సభలో వాదమగుటయు నిత్యాదిగా నున్నది.[12] కాని యిం దారంభముననే కథ భేదించినది. ఇం దా పాండ్య రాజు[13] వెట్టి శైవంబు ముదిరినవాండు. వీరశైవుండై మతము పేరిట నెన్ని ద్రోహములనేని నైరించువాండు, కాని వానిధర్మపత్ని పరమ వైష్ణవి. పతివ్రత. విష్ణు ప్రతిమలకు మ్రొక్కుట కూడ భర్తకుం దప్పే—కాని యామె యెట్లో పతి ననువర్తించుకొని, విష్ణు వాసరోపవాసాదులను నిర్వర్తించుకొనుచుండెను. ఈ ప్రసంగ మేమియును మూలమున లేదు. వీర వైష్ణవాభినివేశమున రాయలు కల్పించిన విశేషములే యివి. ఇట్లుండ నొకనాండు "విష్ణు తత్వంబే పరతత్వంబని వాదించి నిరూపింపంజాలిన వైదేశికుండగు వైష్ణవ వటుం డొకండు అమ్మగారి నాశ్రయించి, సభా ప్రవేశ మెట్లో గల్పించుకొని, వాదించి, జయించి, విష్ణుదేవుండే పరతత్త్వంబనియు, విశిష్టాద్వైతంబె మతం" బనియు రాద్ధాంతపరచెను. వాదమున నోడిన "మొట్టోయన"గ మెడలో లింగము గట్టించుం నన్న వీరశైవుండును దల వంచుకొని, మతము మార్చుకొని, ప్రతిజ్ఞను జెల్లించి యా వటున కర్ధ రాజ్య మిప్పించినాండు, మూలమున మహావిద్వాంసు లెందఱో వీరి వాదమునకు సాక్షులు కాంగా నిందు సభాభవనమునకు ముందున్న యశ్వత్థ వృక్షమే సాక్షియైనది. "అశ్వత్థం సర్వ వృక్షాణామ్" అన్న గీతావాక్యము ననుసంధించి, శ్రీమన్నారాయణుండే వీరికి సాక్షి యైనాడు. ఇట్టిమార్పులు గ్రంథవిషయమున నెంతటి యల్పమైన వైనప్పటికిని, రచయితయొక్క వ్యక్తిత్వమును బ్రతిపాదించునవి కావున మనకీ పట్టున నవి యతిముఖ్యములే యగుచున్నవి. ఈ మార్పులలో నాతనికిం గల వీర వైష్ణవాభినివేశ మెంత ప్రగాఢమైనదో యెఱుగనగుచున్నది కదా! ఇట్లే తర్వాతి కథాభాగమున ఋతువులను వర్ణించుటయు, రాజనీతిని జొప్పించుటకై యనువు గల్పించుకొని యామునుడు భోగములనుభవించుటయు, దిగ్విజయము లొనర్చుటయు, వివరించి యా పై రామమిశ్రు లలర్కాకముతో నాతనిని సాత్వికునిగా నొనర్చి వైష్ణవ దీక్ష నిప్పించుటాదిగా కథను బెంచినాడు. యామునుండు "పంచ సంస్కార సంస్కృతుండై, యంత నిలువక తురీయాశ్రమంబునకుం" బోవువాండై, కుమారుని రాజ్యమందు నిలిపి దీర్ఘముగా రాజనీతి[14] నాతని కుపదేశించును. దానితో నాతని చరిత్ర కథనమును నారాయణుండు ముగించును.[15]

---

12. అనన్తరమ్ యమునైత్తుతె వరుమ్ మహాభాష్య భట్టరుడనే శాస్త్రాభ్యాసం పణ్ణుకిఱ కాలత్తిలే, అన్ద రాజ్యత్తిలే, రాజపురోహితనాయ్, పెరియ విద్వానాయిరున్ద అక్కియాళ్వానుక్కు అన్ద దేశత్తిల్ విద్వానగళెల్లోరుమ్ దళబన్ద మిఱుత్తు పోరుకై యారె, మహాభాష్య భట్టర్ పక్కలిలుమ్ దళబన్దత్తుక్కు త్తరవుర .. అదైక్కేట్టురుళి ఇవరుమ్ వన్ద తరవై క్కుజిత్తువిడ, అక్కియాళ్వాణున్ ఇత్తైక్కేట్టు 'పెరుమ్ కవియో తన్త్రిపారగనో' ఎన్ఱు కేట్టువరవిడ యమునైత్తురైవరుమ్ 'నవయం కవయస్తుకేవలం నవయాం కేవల తన్త్రిపారగాః, అపితు ప్రతివాది వారణ ప్రకటాటోప విపాటనక్షమాః' ఎన్గిఱ శ్లోకత్తై ఎరుతి పోవివిట్టరుళ....రాణావుమ్ యమునైత్తురైవరై శరక్కైన వరువతెన్ను స్వశాసనం పరవిడ....ఇత్యాదిగా నున్నది. ద్రావిడ గురుపరంపరా ప్రభావమ్—యమునైత్తువర్ వైభవమ్—పు. 203-4.

13. వెట్టి శైవము ముదిరిన దనుటకు శ్రీ రాళ్ళపల్లి వా రన్నట్లు రాయలకు వీరవైష్ణవము ముదిరి యుండుటయే. హేతువు కానోపును.

14. ఈ పట్టున రాయలు వివరించిన రాజనీతి కేవల మాతనికి సంబంధించినదిగానే మనము గుర్తింపవలెను. ఎవరెవరి కెపుడు చెప్పినా రన్నదికాదు. రాయ లక్కడ గమనించినది, తాను చెప్పం దలచుకొన్నది చెప్పించి యొప్పించినాండా లేదా అనియే కావున నట్లే మన మా విషయమును పరిగ్రహింపవలెను.

15. ఈ ప్రబంధము నంతటిని కవి యొక్కమొగిని వ్రాసినట్లు గోచరింపదు. లక్ష్మీనారాయణుల వాదరూపముననో, మరియొక తెఱంగుననో ప్రవేశపెట్టబడిన యా యా గాథలలోం గొన్నిటిని రాయ లప్పుడప్పుడు రచించి యిందు ప్రబంధించినాండేమో యనందగి యున్నవి. ఆ యనుమానమునకు ముఖ్యముగా నీ యుపాఖ్యానము దోహద మిచ్చుచున్నది. విష్ణుచిత్తుల యామునుల కాలము లందలి విపర్యాసమున కిదియే హేతువు. ఆ కథ నచ్చటనే చొప్పింప వలసివది, యది

## ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము

ఈ గాథను విష్ణుపురాణమునుండి రాయలు సంగ్రహించినాఁడు.[16] ఇందలి కథావస్తువు మూలమునకు సన్నిహితమైన దైనను వంశ వివరణమున మాత్రము కొంత వ్యత్యాస మున్నది. ఇందు నిమి వంశ్యుఁడగు ధర్మధ్వజునకు మితిధ్వజుఁడు, కృతధ్వజుఁడు పుత్రులనియు, వారికిఁ గ్రమమున ఖాండిక్య కేశిధ్వజు లిరువురును బుత్రులనియు నున్నది. అనఁగా ఖాండిక్యుఁడు కేశిధ్వజునకు పితృవ్య పుత్రుఁడు;—కాని మూలమున భిన్నముగ నున్నది. అందు అమితధ్వజుడను వానికిఁ గృతధ్వజుఁడును, ఖాండిక్యుఁడును జన్మించిరి. ఆ కృతధ్వజుని కుమారుఁడే కేశిధ్వజుఁడు. ఈతఁడు పినతండ్రితో విరోధించి యుద్ధము ప్రకటించును. సంప్రదాయ మిట్లుండ రాయలు వానిని మార్చుటకు హేతువేమో స్పష్టముగ నెఱుఁగరాదు. ప్రాయశః సముల యెడనే వైరాదులు చెల్లునని యట్లు మార్చినాఁడేమో, ఏమైనను మిగిలిన కథ యంతయు మూలానుసారమే యిందున్నది. తుదకు కేశిధ్వజుఁడు ఖాండిక్యునకు బోధించిన యోగ విద్యా ప్రకార మిందు విపులముగను, వైష్ణవమునకు సన్నిహితముగను నున్నది.

## మాలదాసరి కథ - సోమశర్మోపాఖ్యానము

ఈ మాలదాసరి కథను "వహన సమయంబునఁ గుహనా వరాహంబు వలన మహీ మహిళ" వినినట్లు మన్నారుస్వామి విష్ణుచిత్తులకు వివరించెను. "విష్ణు పూజోచితోపచారంబుల విశేష ఫలదంబు గానంబ" యని వైష్ణవియగు నా మహీ మహిళ గోదాదేవిగా నవతరించుటకీ కథాకర్ణనమే హేతువని యిందున్నది. సత్యమును, బరహితమును, భక్తిని, సంకీర్తనా రూపమగు కైంకర్యము నుద్బోధించెడి యీ యుపాఖ్యానమున కాకరము సంస్కృత వరాహ పురాణమునఁ గలదు. (చూ. ఆముక్త-పీఠిక పుట 76.) కాని ఇంతకుఁ బూర్వుఁడగు ననంతామాత్యుని భోజరాజీయమున గూడ[17] నిట్టి సత్య సంధుల, బ్రహ్మరాక్షసుల కథలున్నవి. అందలి గోవ్యాఘ్ర సంవాదమను గాథను బోలినదే యీ మాలదాసరి కథ. కాని యిందు మాలదాసరి యెంతటి భక్తుడో ఆ బ్రహ్మరాక్షసుడు కూడ నంతటి సంస్కారి. నోటికడియైన యా దాసరిని స్వామికి గాన కైంకర్యము చేసివచ్చుట కనుమతించుట కనుమానించుచుండఁగా నాతఁడొక్కఁడే ప్రమాణము చేసినాడు.[18] తానన్న మాటను దప్పినచో విష్ణువు కాక వేఱొండు దైవ మున్నాఁడని చెప్పిన పాపమునఁబోయినవానితో సమానుఁడనగుదునని! అప్పు డా రాక్షసుఁడు వాని బంధ మూడ్చి యనుమతించును. రాయలకున్న వీరవైష్ణవాభినివేశ మాతని యీ ప్రమాణము వలన క్రూరుఁడగు నా రాక్షసుని గుండెలలో కూడ కొంత కనికరమునకుఁ దావు గల్పించినది. లేకున్న నా పట్టున రాక్షసుఁడు వానిని విడువవలసినదికాదు. ఇఁక నాఁతడు క్షేమముగాఁ దిరిగివచ్చి శరీరమును దృణప్రాయముగాఁ బరహితార్థమై యర్పించుటను జూచి బ్రహ్మరాక్షసుఁడు తలక్రిందులైపోయినాఁడు. ఎట్టకేని నా దాసరి ప్రభాత సమయమునఁ బాడిన చరమగీత ఫలమీయఁగా బ్రహ్మరాక్షసున కా రూపు పోయినది. అతఁడే సోమశర్మ- చోళదేశమందుండు నొకానొక బ్రాహ్మణుఁడు. అతఁడొక తూరి మిత్రులతో సాతుగట్టి తన యూరికిఁ బయనమగుచుండగా నరణ్యమున బందిపోటు జరిగినది. ధనాశచేతను, రాజభీతిచేతను సోమశర్మ నా బందిపోటు దొంగలు ప్రాణముండఁగనే చిత్రవధచేసి చంపిరి ఆ క్రౌర్యమును దర్శించి

---

యసంగత మగునని యెఱిఁగి దానిని దిద్దుకొనుటకే రాయలు "ధాతా యథాపూర్వ మకల్పయత్" అన్న ప్రమాణము నాధారము చేసికొని, ప్రజ్ఞతోనే, "చెలువ యిప్పటి పాండ్య నృపతి పూర్వ వంశ్యుండే యొః౦డు" అని నారాయణుఁడని నట్లు వ్రాసినాఁడు. దానితో ప్రతిబంధములు తొలగిపోయినట్లే.

16. ప్రాయికముగా నీతని కాలమువాఁడేయగు వెన్నెలకంటి సూరన తన 'విష్ణుపురాణము'న నీకథనుకూడ తెలిఁగించినాఁడు.

17. ఈ భోజరాజీయమున ప్రధానేతి వృత్త మల్పమేయైనప్పటికి నందలి యుపాఖ్యానముల యల్లిక జిగిబిగి యాముక్తమాల్యదా కారునకును గొంత యలవడినదనవచ్చును. రచన యందును గొంత దాని యనుకరణ మిందు కాననగుచున్నది. (ఆ విషయమును ముందు వివరింతును.)

18. "ఎవ్వని చూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మరి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్కవేల్పు గణియించిన పాతకినౌదు నేఁడనే
నెవ్విధినైన నిగ్గదియవేని, యనవ్విని బంధ మూడ్చిపన్." (6-48)

నరక మనుభవించుటచేత నాతఁడొక బ్రహ్మరాక్షసుఁడై వెనుకటి కథలోఁ బ్రత్యక్షమైనాఁడు. ఆ రాక్షసుఁడును సంస్కారి యని నిరూపించుటకే యీ కథ యవతరించి యుండవచ్చును. కాదేని ప్రాయశః రాయలు తా నెఱిగిన కొన్ని సంఘటనల నదికిచెప్పుట కీ కథను స్వయముగఁ బెంచియు నుండవచ్చును.[19]

ఇట్లెన్నో కథలను గాథలను, కన్నవానిని, విన్నవానిని గుదిగ్రుచ్చి యొక చక్కని ప్రబంధమణిహారమును రచించి రాయలు భక్తితో వేంకటేశ్వరస్వామిని పరిష్కరించినాఁడు.

## వస్తువు - మతము

ఈ ప్రబంధమందలి వస్తువు ప్రధానముగా మతము నాశ్రయించుకొని యున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతములను ప్రతిపాదించుట కనువైన సన్నివేశములతోడను, వైష్ణవ మత ధర్మముల నావిష్కరించు నుపాఖ్యానముల సముదాయముతోడను గూడుకొని, మత తత్త్వములను రెంటిని ప్రదర్శించు నీ యాముక్త మాల్యద నాఁటి వైష్ణవ ప్రబంధములలోఁ దలమానిక మనఁదగినది. వీరవైష్ణవాళినివేశముతో నేతత్కర్తృ గావించిన రచనలోఁ దత్త్వాంగముతోబాటు, భగవద్భక్తి, భాగవత భక్తి, కైంకర్యము, గురుభక్తి, యోగము, శరణాగతి, భారన్యాసము, సర్వాత్మ సమర్పణము, మున్నగు మతాంగములను ప్రతిపాదింపఁబడినవి. ఇందు భక్తిరసపూరితములగు నీతులున్నవి. అవతార వర్ణన లున్నవి. వైష్ణవ సంకేతములను గీర్తించు వర్ణనలున్నవి. చైతన్య మత సంప్రదాయమును గొంత యున్నది. కాక, విశేషమేమనఁగా, వివియెల్ల రచనలో నావేశపూరితములుగను, రసమయములుగను పరిష్కరింపఁబడినవి. ఇట్లు జీవిత మర్మమనఁదగు మతమునకును, సాహిత్యధర్మమనదగు రసమునకును సామరస్యమంత చక్కగఁ బోషింపఁబడుటచేతనే యీ ప్రబంధమునకొక ప్రాముఖ్యమున్నదనుట-పై యంశములను వివరింతును.

## విశిష్టాద్వైత తత్త్వము

విష్ణుచిత్తుఁడు పాండ్యుని సభ కేగి భిన్న మతస్థులను శాస్త్రోక్తసరణి నోడించి వైష్ణవమే సర్వోత్కృష్టమని సిద్ధాంతపరచెను. అన్యమతముల నాతఁ డిట్లు నిరసించెను.

౩౦సీ. "జగదుద్గతికిని బీజము ప్రధాన" మన 'నీ
క్ష' త్యాది నీఁక నశబ్దవాదిఁ,[1]
బోరి 'నీఁకుఁడేన' నా 'భోగమాత్రేత్యా' ద్యు
దాహృతి స్ఫూర్తి మాయావివాది,[2]

---

19. చోళ పాండ్య మండలములకుఁ బ్రసిద్ధులగు తంజావూరు, మధుర ప్రాంతము లానా దలబడులకు గురియగుచుండినవనియు, ముఖ్యముగ తంజావూరు ప్రాంతమున బందిపోటుతనము లధికముగ సాగుచుండినవనియు, వాని నెల్ల రాయల సేనాను లణచి రనియు, నా పునాదుల మీఁదనే తర్వాత తంజావూరు మధురరాజ్యము లేర్పడినవనియు చరిత్ర మూలమున మన మెఱిగిన విషయమే. అం దేగాథనేని కవి యిందు విపులీకరించినాఁడేమో. (చూ. తంజావూరు ఆంధ్ర రాజుల చరిత్ర — వేటూరివారి పీఠిక)

20. ఇందుదాహృతములైన బ్రహ్మ సూత్రములకు రామానుజస్వామి శ్రీభాష్యమున నిచ్చిన వ్యాఖ్యానమ్ము చొప్పున నాయా మత సంప్రదాయములు నిరసింపఁబడినవి. రాయలు బ్రహ్మ సూత్ర భాష్యాదులు చదివినవాడు గావున నా యంశము లిందు గ్రంథస్థము గావింపఁబడినవి. విష్ణుచిత్తునితో ముడిపెట్టి కాలవిపర్యాసము నిందు గమనింపఁగూడదు.

(1) సాంఖ్యమును బ్రహ్మసూత్రములందలి "ఈక్షతేర్నా శబ్దమ్" (1, 1, 5) అను వాక్యమును వ్యాఖ్యానించి నిరసించెను. దానికి రామానుజుని వ్యాఖ్యాన మిట్లున్నది. "యస్మిన్ శబ్ద ఏవ ప్రమాణం నభవతి తదశబ్దమ్ అనుమానికం ప్రధాన మిత్యర్థః. నతజ్జగత్కారణవాది వాక్య ప్రతిపాద్యమ్. కుతః, ఈక్షతేః సచ్ఛబ్దవాచ్య సమ్బన్ధి వ్యాపార విశేషాభిధాయిన ఈక్షితేర్థాతోః శ్రవణాత్, శ్రు. "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి"

ఈక్షణ క్రియాయోగ శ్చాచేతనే ప్రధానే నసంభవతి—అతః ఈ దృశేక్షణక్షమ శ్చేతన విశేష స్సర్వజ్ఞ స్సర్వశక్తిః పురుషోత్తమ స్సచ్ఛబ్దాభిధేయః—తథాచ సర్వే ష్వేవ సృష్టి ప్రకరణే ష్వీక్ష పూర్వికైవ సృష్టిః ప్రతీయతే—శ్రు. 'స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాల్లోకా నసృజత'— శ్రు. 'స ఈక్షాంచక్రే స ప్రాణ మసృజతే' త్యాదిషు శ్రీభాష్యము.

(2) అద్వైతమును "భోగమాత్ర సామ్య లిఙ్గాచ్చ" (బ్ర. సూ. 4-4-21) అను వాక్యమును వ్యాఖ్యానించి నిరసించెను. దానికి రామానుజుని వ్యాఖ్యాన మిట్లున్నది.

"బ్రహ్మయాథాత్మ్యానుభవరూప భోగమాత్రే ముక్తస్య బ్రహ్మసామ్య ప్రతిపాదనాచ్చ లిఙ్గా జ్జగద్వ్యాపార వర్జ్య మిత్యవగమ్యతే.— శ్రు "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణావిపశ్చితేతి. అతో ముక్తస్య పరమ పురుష

'ఫలియించుఁ గ్రియయ' నా 'ఫలమత' యిత్యాది
సర్వేశుఁ గొనవి యపూర్వవాది.[3]
'శాస్త్రయోని' త్వాది సరణి 'నీశ్వరునిఁ దె
ల్పెదు ననుమాన' మన్నీలువాది.[4]
'నిత్యులందెల్ల నిత్యుఁ' డ న్మశ్రిత్యురూక్తి
క్షణిక సర్వజ్ఞతేషి సౌగత వివాది.[5]
'నమపపత్తే ర్న' యను సూత్రమాదియైన
వాణి నృపతీశుఁ బ్రత్యక్షవాది, గెలిచె.[6] (3-8)

ఇందు క్రమముగా సాంఖ్యము, అద్వైతము, మీమాంస, వైశేషికము, బౌద్ధము, చార్వాకము - అను మతములు విరసింపఁబడినవి.

ఇట్లు సర్వ మతములను ఖండించి,
"విద్వద్వందితుఁ డాతఁడిట్లు
సుఖ సంవిత్తత్త్వబోధైక చుం
చు ద్వైపాయన సూత్ర సద్రుతుల
నీశు మ్మ న్నిరూపించి, పైఁ
దద్విష్టుత్వము దాని కన్య
దివిషద్వాక్య వర్తనంబు న్విశి
ష్టాద్వైతంబును దేటగాఁ దెలుప
మాటాడెన్ బ్రమాణంబులన్" (3-9)

సీ. [21]ఆదినారాయణుండాయె నొక్కఁడ, బ్రహ్మ[1-2]
లేఁడు, మహేశుండు లేఁడు, లేదు

---

సామ్యం సత్య సంకల్పత్వంచ పరమ పురుషాసాధారణ నిఖిల జగన్నియమన శ్రుత్యానుగుణ్యేన వర్ణనీయ మితి జగద్వ్యాపార వర్జ్యమేవ ముక్తైశ్వర్యమ్" శ్రీభాష్యము.

(3) మీమాంసా మతమును "ఫల మత ఉపపత్తేః" (బ్ర. సూ. 3-2-38) అను వాక్యము నిట్లు వ్యాఖ్యానించి విరసించెను.

"తుల్య న్యాయతయా శాస్త్రీయ మైహికాముష్మిక మపి ఫలమ్ అత ఏవ. పరస్మాత్ పురుషా ద్భవ తీతి సామాన్యేన.— శ్రు. 'ఫలమత ఇత్యుచ్యతే కుత ఏతత్— (ఉపపత్తేః) స ఏవ హి సర్వజ్ఞః సర్వశక్తి ర్మహోదారో యాగదాన హోమాది రుపాసనేన చారాధిత ఐహికాముష్మిక భోగజాతం స్వస్వరూపావాప్తి రూప మపవర్గంచ దాతు మీష్టే—సహ. చేతనం కర్మక్షణధ్వంసి కాలాన్తర భావిఫలసాధకం భవితు మర్హతి"

(4) వైశేషిక మతమును "శాస్త్రయోనిత్వాత్" (బ్ర. సూ. 1-1-3) అను వాక్యమును వ్యాఖ్యానించి విరసించెను దానికి రామానుజుని వ్యాఖ్యాన మిట్లున్నది.

"శాస్త్రం యస్య యోనిః కారణం ప్రమాణం తచ్ఛాస్త్రయోని— తస్య భావః శాస్త్రయోనిత్వమ్— తస్మాత్ బ్రహ్మజ్ఞాన కారణత్వాత్ శాస్త్రస్య— తద్యోనిత్వం బ్రహ్మణః. అత్యన్తాతీన్ద్రియత్వేన ప్రత్యక్షాది ప్రమాణా విషయతయా బ్రహ్మణ శ్శాస్త్రైకప్రమాణకత్వాత్ ఉక్త స్వరూపం బ్రహ్మణః.— శ్రు. 'యతోవా ఇమాని భూతా" నీత్యాది వాక్యం బోధయత్యేవేత్యర్థః" శ్రీభాష్యం.

(5) బౌద్ధ మతమును "నిత్యోనిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యోవిదధాతి కామాన్ తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తి శ్శాశ్వతీ నేతరేషామ్" (కఠ· 5-13) అని యాత్మ నిత్యత్వమును చెప్పెడు శ్రుతి వాక్యములచే విరసించెను.

(6) అట్లే చార్వాక మతమును "అనుపపత్తేస్తు శారీరః" (బ్ర. సూ. 1-2-3.) అను వాక్యమునిట్లు వ్యాఖ్యానించి విరసించెను.

"తమిమం గుణసాగరం పర్యాలోచయతాం ఖద్యోతకల్పస్య శరీర సంబన్ధ నిబన్ధనా పరిమిత దుఃఖసంబన్ధ యోగ్యస్య బద్ధముక్తావస్థస్య జీవస్య ప్రస్తుత గుణలేశసంబన్ధ గన్ధోఽపి నోపపద్యత ఇతి నాఽస్మిన్ ప్రకరణే శారీర పరిగ్రహ శఙ్కాఽజాయత ఇత్యర్థః"

21. ఇందు పరామర్శింపఁబడిన యుపనిషద్వాకము లివి : (చూ. వ్యాఖ్య.)

(1) "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేక మేవాద్వితీయమ్..." ఛాందో. 6, (2)

(2) ఏకోహ వై నారాయణ ఆసీ న్న బ్రహ్మోనేశానోనాపో నాగ్నిషో
మౌనేమే ద్యావా పృథివీ న నక్షత్రాణి న సూర్యో న చన్ద్రమా" మహోప 1. అ.

(3) "స ఏకాకీ నరమేత, తస్యధ్యానాన్తః స్థస్య...జాయన్తే దశేన్ద్రియాణి. మహోప. 1. అ.

(4) "సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి, సతపోఽతప్యత సతపస్తప్త్వా ఇదగ్ సర్వమసృజత, యదిదం కించ, తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య, సచ్చత్యచ్చాభవత్" తై. ఉ. 2, 6.

రోదసి, లేఁడు సూర్యుఁడు, లేఁడు చంద్రుఁడు,
లేవు నక్షత్రము ల్లేవు పిఱ్ఱు.
లే దగ్ని, యట్లుండ 'శీల నేకాకిత[3]
చనదు, పెక్కయ్యెద ననుచు నయ్యెఁ[4]
చిద చిద్ద్వయంబుసొచ్చి' యని ఛాందోగ్యంబు
దెలిపెడు నంతరాదిత్య విద్య[5]
నర్కలోఁబుండరీకాక్షుఁ డతఁడయగుట
కక్షిణీయని యష్ట దృక్త్ర్యక్ష దశ శ
తాక్ష విధి రుద్ర శక్రాదులందు నొకఁడు
లేమి కా శ్రుతియే విలక్షణతఁ దెలిపె. (3-10)

బహూపనిషత్సార మనఁదగినఁ పైపద్యమునఁ గవి విపు తత్త్వాధిక్యమును వెల్లడించెను.

“తులలేకుండు స్వరూప రూపగుణ
భూతులోచు నేతచ్ఛ్రుతిన్
దలమై లో వెలి దానెయుక్కఁ దెలి[22]
పె న్నారాయణం. బారుణం
బుల సామాన్య విశేషరీతి నిఖి
లంబు న్శబ్దజాలంబు ని
ర్మల నారాయణ[23] శబ్దమందునె తుదన్
బర్యాప్తమయ్యెన్ శ్రుతిన్.” (3-11)

“వా దపహతపాప్మా ది
వ్యో దేవ”[24] యనంగఁ బరఁగు సూక్తుల మీఁదం
బాదగు నారాయణ పద
మే దేవాంతరము లేమి కీ శ్రుతిఁ దీర్చెన్. (3-12)

కావున నారాయణునికన్న వేఱు దేవుఁడు లేఁడని విష్ణుచిత్తుని వాక్కునఁ గని నిరూపించినాఁడు, దివోదా సాత్మజుం డగు ప్రతర్దనుఁడు జనార్దన నెఱుఁగక యపవర్గ కాంక్ష నింద్రు నారాధించిన నతండు సన్నిహితుఁడై “మాముపాస్వ” యనినాఁడట; తన్నే కొలిచిన వానితోఁ దన్నే కొలువమనుట తన కంతర్యామియైన నారాయణుని కొలువు మనుటగా గ్రహింపవలెను. ఋగ్వేద మందలి కౌశీతకిబ్రాహ్మణోపనిషత్తు నందలి యీ గాథనుకూడ కవి యిందు వ్రాసి పై వాక్యములను నిర్ధారించెను. ఇట్లే అడుగడుగున. ముఖ్యముగ నీ ఘట్టమున తన విజ్ఞానమంతయుఁ బ్రదర్శించి రాయలు విష్ణు మహత్త్వమును. విశిష్టాద్వైత తత్త్వమును వేవిధములం బ్రకటించినాఁడు. మఱి యొండు రెం డుదాహరణముల నుద్ధరింతును.

“చిదచిచ్ఛరీరకుం డగు నప్పరమాత్ముం గూర్చి....”

“చిదచిత్ప్రపంచంబు లతని శరీరంబులనియు వినంబడు”

“ముముక్షువున కప్పుండరీకాక్షుఁ దక్క నే వ్యక్తినైన నుపాసింపవచ్చునే?”

“బ్రహ్మ రుద్రార్జున....భార్గవాది భజనంబు త్రైవర్గికునకుం గాక యపవర్గ కాంక్షుల కయుక్తంబు”

“మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతిర్నారాయణ” యని సమస్తంబునకుఁ “బరాయణంబుగా నతనిం బ్రతిపాదించు శ్రుత్యంతరంబు గలదు.” (3-13 వచనము)

“ఈ చెప్పఁబడిన సకలప్రపంచంబును విష్ణు శక్తి సమన్వితంబై యతనికి శరీరంబునై యుండు (3-79 వచనము)[25]

ఈ విధమునఁ దత్త్వము బోధించి రాయలు భక్తిని కూడ ప్రదర్శించెను. ఆ విషయము తరువాత ప్రస్తావింతును.

---

(5) య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆ ప్రణఖా త్సర్వ ఏవ సువర్ణస్తస్య యథాకప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యోయ ఏవం వేద” 1, 6 (6-7) ఛాందో - అన్తరాదిత్య విద్యా.

22. “యచ్చ కిఞ్చి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః”
శ్రుతియందారుణములలో నీ విషయ ముక్తము. (నారాయణీయ యజ్ఞికోపనిషత్తు)

23. “సర్వే శబ్దాః అచిజ్జీవ విశిష్ట పరమాత్మనో వాచకాః ఇత్యుక్తమ్ ‘నామరూపే వ్యాకరవాణి’ ఇత్యత్ర” రామానుజుని వేదార్థ సంగ్రహము.

24. “స ఏష సర్వ భూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః” సుబాలోపనిషత్.

25. ప్రకృతికంటెఁ బరుండగు దన్నును, తనకంటెఁ బరుండగు పరమేశ్వరుందును....ఆత్మీయ తదీయ శేష శేషిత్వ సంబంధం బనాద్యంబుగాఁ దెలిసి....” (1-78 వ) ఇత్యాది వచన మొకటి యున్నది. కాని యిది ప్రక్షిప్తమని జోగి జగన్నాథ పండితమతము. (చూ. ఆము. వ్యాఖ్య. పు. 81)

# కొత్తపుంత | బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

రమణయ్య పంతుల్ని ఒకమాటు చూస్తే మరచిపోలేము. చిన్నపిల్లలకు ఆయనంటే ఎంత భయమో అంత అభిమానం. లావుగా, పొడుగ్గా, పెద్ద బొజ్జ, పలచటి తలకట్టూ, పిలక, ఎత్తుపళ్లూ ఆ విచిత్రమైన ఆకారం-పంచ, జుబ్బా, కిందువా వేసుకొని వీథిలో నడచివస్తుంటే బడిపిల్లలకు హడలు.

బడిదొంగలు ఇంట్లో దాగివుంటే తల్లులు బయటికొచ్చి, పంతులుగార్ని ఇంట్లోకి పిలిచి, వాళ్ళను అప్పగించేవారు. "ఏం రా వెధవా బడిమానేస్తే చదువు సంధ్యలు అంటక తరువాత దమ్మిడీకి మారవు. అడుక్కు తినాలి తెలుసా?" అని ఆయన మందలిస్తుంటే పిల్లల్ని, "అదీ... అలా బుద్ధిచెప్పండి బాబూ, మరీ పెంకి వెధవై చేతికి రాకుండా పోతున్నాడు. వీడికి చదువు ఎలా వస్తుందో అంతుపట్టకుండా ఉంది" అని తల్లులు బెంగపెట్టుకుంటే, "మరేంభయం లేదమ్మా చిన్నతనం, వాడి వంశంలో మహా విద్వాంసులు జన్మించారు. వీడి తాతగారు నాకు తెలుసు, గొప్ప పండితుడు. బహుదొడ్డ మనిషి" అని ఊరడించి దాహానికి ఇన్ని మజ్జిగ పుచ్చుకొని, కూరగాయలో, తాటిముంజలో, అల్లమో బెల్లమో ఏదో ఒకటి మూటగట్టుకొని మళ్ళీ వీథిన పడేవాడు.

ఆ రోజులే వేరు! పెంకిపిల్లలు తనకు పేర్లు పెట్టడం వంటి పాకుపనులు చేసినా ఆయనకు ఆ ఉద్యోగం బాగుండేది. ఊళ్ళో ఎంతో ఆదరముండేది. ఎవరింటనైనా యేదైనా ఒక కార్యం తలపెట్టుకొని వంటబ్రాహ్మడు రాకపోతే రమణయ్య సాయం కోరేవారు. ఆయన వంటంతా అవలీలగా చేసేవాడు. ఆయన ఫలానా పెళ్ళిలో గంపెడు బూర్లు తిన్నాడనీ.... ఆయన్ను గురించి రకరకాలుగా కథలు చెప్పుకుంటుంటారు. అయినా ఊళ్ళో ఏకార్యం జరిగినా తా నుండవలసిందే.

ఇప్పుడు రోజులు మారిపొయ్యాయి. ఇప్పుడు అలాంటి కర్మిష్ఠులూ లేరు, అటువంటి కార్యాలూ లేవు.

జవసత్వాలుడిగిన రాత్రి వెలవెలబోతూ పండుటాకులా రాలిపోతున్నది. పెరటివైపు చింతచెట్లమీద పక్షులు కిలకిలమంటున్నాయి. పక్కమీద దొర్లుతూ రమణయ్య ముసుగు తొలిగించేసరికి, తెల్లటి వెలుతురు గవాక్షంలో నుంచి వచ్చి అతని ముఖంమీద పడ్డది. మగత నిద్రలో తెగిపోయిన వేరులా చెదరిపోతున్న ఆలోచనల్ని కూడదియ్యడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

'ఒరే తమ్ముడూ తెల్లారింది ఏమిటా పడక, వేగం లే. ఇవ్వాళ నీ పుట్టిన రోజు కూడా' అన్నది రమణయ్య అక్కగారు.

'ఏమిటీ పుట్టినరోజా, నేనెప్పుడు పుట్టానంటావు?' రమణయ్య మంచంమీద లేచికూర్చున్నాడు.

'నువ్వుపుట్టి అరవయ్యేళ్ళు. ఇవ్వాళ షష్టిపూర్తిరా నీకు.... లే తలంటుకుందువుగాని....'

'అయితే మనమింకా చిన్నవాళ్ళమేనన్నమాట...'

'అయ్యో చిన్నతనంకాక మరేమిట్రా, తొందరపడి వాళ్ళు ఉద్యోగం తీసేశారుగాని... '

'ఉద్యోగం ఏనాడైపోయింది? నీ లెక్కప్రకారం నా ఉద్యోగం ఏభయ్యోఏటనే పోయింది. అప్పటికి నాకు రిటైరయ్యే వయస్సు వచ్చిందని వాళ్ళు లెక్కలుగట్టారు. కాదంటే రుజువు చేసుకోమన్నారు. రుజువులూ సాక్ష్యాలూ మనదగ్గ రేమున్నాయి గనుక-జాతక చక్రమేనా లేదాయిరి. నీ సాక్ష్యం వాళ్ళకు

పనికిరాదుట. నా పుట్టుపూర్వోత్తరాలు ఎరిగినదానివి నువ్వేనాయె. అయితే అక్కయ్యా నీకెన్నేళ్ళు.... ఇప్పుడు ?'

'అయ్యో నా బతుకుమండా ? అడక్కడక్క నా సంగతే అడిగావూ ? తాటిచెట్టుకు ఎన్నేళ్ళుంటే నేమిట్రా ?'

రవణయ్యకు నవ్వొచ్చింది. తాటిచెట్టు మాత్రం పనికిరాదూ ? ప్రతిచెట్టు వల్లా ఏదో ఒక ఉపయోగ ముంది. ఎక్కువ తక్కువలు, కాస్త తారతమ్యా లుంటాయి అంతే. ఆసంగతి రవణయ్య చెబుదా మనుకున్నాడుగానీ ఆవిడ చెవినపెట్టదని ఊరు కున్నాడు. తన్ను పెంచి పెద్దచేసింది. ఆవిడ లేకుంటే తను ఏమయ్యేవాడో !

"లేరా తమ్ముడూ తలంటుతాను. వేగం బజారు కెళ్ళి వద్దువుగాని...."

"ఎందుకూ బజారుకి ?" బజారంటేనే భయం రవణయ్యకు.

"నన్న బియ్యం... పప్పు... ఓ కొబ్బరికాయ పట్టుకురారా. అంత పిండివంట కూడా చేస్తాను...."

రవణయ్యకు ఏం పిండివంటో అడగా లని పించింది. కాని అడగడ మెందుకని వూరుకున్నాడు.

కాలకృత్యాలు తీర్చుకొని యథావిధిగా దేవతార్చన ముగించుకొన్నాడు రవణయ్య. దంతధావనం దగ్గ ర్నించీ అనుష్ఠానందాకా అన్నీ గడియారంముల్లులా జరిగిపోయాయి. కండువా వేసుకొని గడపదగ్గర కొచ్చి, మళ్ళీ ఒకడుగు లోపలికివేసి, అక్కగార్ని పిలిచి నతమస్తకుడై నమస్కారం చేశాడు. తమ్ముడ్ని చూచుకొని మురిసిపోయింది అక్కగారు. చేతిలోవున్న అక్షతలు రవణయ్య తలమీదవేసి, నూరేళ్ళు బతకమని దీవించింది.

"ఇంకా నలభైయ్యేళ్ళు బతకమంటావా అక్కయ్యా ?" అన్నాడు రవణయ్య. చెమ్మగిలిన కళ్ళను తుడుచుకొన్నది ఆవిడ. తన మరదలు చిన్న తనంలోనే పుణ్యస్త్రీగా చనిపోయింది.

రవణయ్య బజారుకని వీథిలో నడక ప్రారం భించాడు. చిన్నప్పట్నించీ తను ఇదే దారిన నడిచాడు. అయితే ఆ దారికి ఇరుప్రక్కలా వున్న ఇళ్ళుమాత్రం కొన్ని గుర్తుపట్టడానికి వీలులేకుండా మారాయి. చితికిన కుటుంబాల ప్రహరీగోడలు పగుళ్ళిచ్చి, వాటిల్లో మొక్కలు లేచాయి. కొన్ని పడిపోయిన యిళ్ళ స్థానంలో కొత్త ఇళ్ళు లేచాయి. అక్కడక్కడా కొన్ని - చల్లారిన సంసారాలను జ్ఞాపకం చేస్తున్న మొండిగోడ లున్నాయి. ఒక సుదీర్ఘ స్వప్నంలా, ఒక నిరంతర సంఘర్షణలా, ఎడతెగని ప్రవాహంలా గతం అతని కళ్ళముందు నీడలు పాగుతున్నది.

రవణయ్య వెంకట్రాజు గారింట్లోకి నడిచాడు. వీథి సావిట్లో రాజుగారు కూర్చుని మిత్రులతో మాట్లాడుతున్నారు. రవణయ్యను చూడగానే కుశల ప్రశ్నలు వేసి, తన కుమారుడు రంగయ్యకు కలిగిన పుత్రప్రాప్తిని గురించి తెలియజేసారు.

"శుభం !.... రంగయ్యబాబు ఎంతవాడైనాడు. నా కళ్ళముందు పుట్టి పెరిగాడు. నా దగ్గర చదువు కున్నాడు. తరువాత పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగస్థుడయాడు. ఇప్పుడు సంతానప్రాప్తి కూడా కలిగింది. ఈ పెత్తనంలో రాజుగారూ తమకు ఇంత కన్న కావలసింది మరోటి ఏముంటుంది" అన్నాడు రవణయ్య.

"నిజమే పంతులుగారూ, అంతా పరమేశ్వరుని కృప. ఏం ఇలా వచ్చారు పెద్దలు ...?"

"ఏమని చెప్పను పెద్దయ్యగారూ, రోజులు గడ వడం దుర్లభంగా వుంది...."

"ఏం పెన్షను రాదా మీకు ?"

"పింఛనీ లేదు గింఛనీ లేదు. గవర్నమెంటు నౌఖరీ గనకనా. ఇప్పుడంటే బడి పెద్దదైనందువల్ల ప్రభుత్వం నడుపుతున్నది గానీ అప్పుడేముందయ్యా వీథి బడే నాయిరి ?"

"ఓహో ! అవునుమరి. కలిగినవాళ్ళకే కాలం కటకటగా వుంది....."

'కటకట ఇట్లాగట్లాగని చెప్పలేం బాబూ, మరీ మామూలు వాళ్ళసంగతి.... ఒక్కరూపాయి యిచ్చిస్తా రేమోనని తమర్నన్నా అడుగుదామని....' రాజుగారి ముఖకవళిక అదోవిధంగా మారడంచూచి రవణయ్య మాట పూర్తిచెయ్యలేక నీళ్ళు నములుతున్నాడు.

ఇంతలో రాజుగారే 'అయ్యో అడక్కడక్కడి గారు ఎర్రటి ఏగానీలేదు చెప్తే నమ్మరుగావి' అని అంటుండగానే లోపలినుంచి రాజుగారి అబ్బాయి రంగయ్యబాబు వచ్చాడు. 'అబ్బాయి పెద్ద ఉద్యోగస్తుడయ్యాడు. ఏం బాబూ పట్నంలో అంతా వదుపాయంగా ఉంటుందా?' అని పలకరించాడు రవణయ్య.

"ఏం ఉద్యోగాలు పంతులుగారూ, పేరుగొప్ప, ఊరు దిబ్బ ..." అన్నాడు రంగయ్యబాబు వొంకులు తిరిగి ముఖంమీద పడుతున్న క్రాపును మునివేళ్ళతో సవరించుకొంటూ.

"సరే వస్తానుబాబూ సెలవు... " అని రవణయ్య మళ్ళీ వీథిన నడక ప్రారంభించాడు. తూరుపెటూ పడమరెటూ అని తర్కించుకొంటూ అడుగుతీసి అడుగు వేస్తున్నాడు. సంపన్న కుటుంబీకుడుకదా అని రామన్న పంతుల్నీ అడిగి చూచాడు. సాటివాడు, ఎన్నడూ నోరుతెరచి అడగనివాడు అడిగాడన్నమాట కూడా లేకుండా చిల్లిగవ్వ దొరకదని కట్టెవిరిచినట్టు చెప్పాడు రామన్నపంతులు. అంతటితో లేదన్నవాడు ఊరుకుంటే బాగుండిపోను. పుండుమీద కారం చల్లినట్టు, చేతులు నలుపుకుంటూ కూర్చొనకపోతే ఏదన్నా పనిచేసుకోకూడదూ అని సలహా యిచ్చాడు.

ఎండ నెత్తికెక్కుతున్నది. మరిద్దర్ని అడిగి చూచాడుగానీ లాభం లేకపోయింది. రచ్చబండ దగ్గరి వేపచెట్టు నీడన క్షణంపాటు నిల్చున్నాడు. ఆ పక్కనే సాలె పద్దయ్య పడుగు పోస్తున్నాడు. చిక్కు పడుతున్న ఒక్కొక్క పోగూ ఓపికతో సవరిస్తున్నాడు. చెట్టు నీడలో మధ్య మధ్యన దీపులలా పడుతున్న ఎండ పొడలలోనుంచి పద్దయ్య పడుస్తున్నప్పుడు బక్కచిక్కినా నల్లటి అతని విగ్రహం సురసురమంటున్న మింటి వెలుగులో ధగధగ మంటున్నది. చెట్టునీడన తెలుపులు వారకట్టినట్టుగా పున్నెన్ని పోగులు అల్లంతదూరం ప్రాకి. పద్దయ్య పంతుల్నిచూచి నమస్కరించాడు. జరుగుబాటు ఎట్లావుంటున్నదని అడిగాడు పంతులు పద్దయ్యని. "ఏం బాబూ ఎనకటి రోజులు మళ్ళీ రావు. చీరెలిస్తేమటుకు డబ్బు సమయానికి చేతికిస్తారా బాబూ వర్తకులు?" అన్నాడు. అవును, ఉన్నవాళ్ళయినా, లేనివాళ్ళయినా ఇవ్వాలిసిన డబ్బే సమయాని కివ్వరు; ఇంక ఊరికే ఇమ్మంటే ఎవరిస్తారు? ఈనాటికీ తను ఏదో ఒకపని చేసుకుంటూనే వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా రోజులు గడుపుకొస్తున్నాడు. తన వంట్లో జవసత్వాలు ఉడగనంతవరకూ ఎంత వయసు వచ్చినా పని చేసుకుంటేనే తప్ప దినాలు గడవ్వని అతనికి తెలుసు. అయినా ఎందుకో ఇవ్వాళ తొలిసారిగా చెయ్యిచాచి నలుగుర్నీ అడిగి లేదనిపించుకున్నాడు. డబ్బులు దొరకనందుకు తనకు కష్టమనిపించలేదు. ఈ డబ్బుకూ మానవ సంబంధాలకూ సాన్నిహిత్య మున్నదేమో నన్న సందేహం తన్ను కలతపరుస్తున్నది. రూక చూడకుండా అతను ఎంతోకాలం హాయిగా గడిపాడు. డబ్బుకూ మనిషికీ ఇంత అతుకు ఉన్నట్టయితే, అదే నిజమైనట్టయితే మానవ సమాజం ఎంతో దుస్థితికి దిగజారినదన్న మాట!

తను చిన్నతనంనుంచీ తోటి మానవుల ఆదరాభిమానాల మధ్య పెరిగి దారిద్ర్యాన్ని గురించి ఎప్పుడూ చింతించ లేదు. పిల్లల్ని వాత్సల్యంతో చూచి, తన చేతనైనంత చక్కగా విద్యాబుద్ధులు చెప్పాడు.

ఊళ్ళో నలుగురూ తన్ను యథాశక్తిన ఆదుకున్నారు. ఈ పల్లీయులు అందరూ రాగద్వేషాల మధ్య, సుఖదుఃఖాల మధ్య, కామక్రోధాల మధ్య పడి నలుగుతున్నప్పటికీ యీ నిరంతర జీవన సంగ్రామంలోవాళ్ళ మనస్సులు అంత మార్పు చెందలేదు. తామర తంపరలా నలుగురూ కలసికట్టుగానే

జీవిస్తూవచ్చారు. అటువంటిది యీనాడు—కొత్త పరిస్థితులలో 'డబ్బు' మానవ సంబంధాలను ఇంత కలుషితం చేయగలదన్న సందేహం రావడంతో అతని మనసు వికలమైపోయింది. ఏనుగులు త్రొక్కినట్టు విలయంగా వచ్చిన తుపానుకు ఆ కొలనులోని తామరలు మటుకు ఛిన్నాభిన్నం కాక తప్పుతుందా? ఇంతకుముందు ఎన్నడూ అతను ఇంత నిస్పృహను అనుభవించలేదు. కాలం క్రీడలా గడచిపోతుందనుకున్నాడు. తను మరో ప్రమేయం లేకుండా బ్రతుకు రథం యీడ్చుకొస్తున్నాడు. ఇంతకాలం తామరాకు మీది నీటి బొట్టులా రోజులు గడుపుకొచ్చారు.

మళ్ళీ పడమటివీథి మలుపు తిరిగి, కండువా చెరుగు నెత్తిమీదిది సవరించుకొని రెండడుగులు ముందుకు వేసాడో లేదో... "ఏమండీ రవణయ్యగారూ, రండి...రండి...లోపలికి దయచెయ్యండి..." అని అకస్మాత్తుగా ఒక పిలుపు వినిపించింది. ఇంతలో అవధానే వచ్చి కేలుపట్టుకొని ఇంట్లోకి తీసుకెళ్లాడు.

"ఏం ఇంత ఎండలో ఎక్కడనుంచి రాక... ఏదైనా పనిమీద వెళ్ళుతున్నారా?" అన్నాడు. 'లేదండీ ఇంటికే' నన్నాడు రవణయ్య. ఏది చెబితే బాగా అతుకుతుందో నన్న ఆలోచనమీదికి పోయింది అతని మనసు. అతన్నీ అడిగి వెధవ రూపాయి డబ్బులకు మర్యాద పోగొట్టుకోవడం ఏమాత్రం హిత వనిపించలేదు పంతులికి. అవధాని ఆదరంగా పలకరించాడు. అంతకంటె ఏం కావాలి?

'రవణయ్యగారూ మంది జాస్తి అయినకొద్దీ మజ్జిగ పలచనైనట్టు, బడిలో చదువులు పలచబారుతున్నాయి. పిల్లలకు సరిగా ఒక్క ముక్కన్నా చెప్పిన పాపాన పోవడంలేదు. మీరు కాస్త మా పిల్లలకు రోజుకో గంట ప్రైవేటు చెప్పగలరేమోనని ఇన్నాళ్ళబట్టి అడగాలనుకుంటుంటే ఇంతవరకూ తటస్థపడింది కాదు...' అన్నాడు అవధాని.

"పిల్లల్ని నలుగుర్నీ చేరదీసి పాఠం చెప్పడం కంటే సుఖం మరోటి ఎక్కడ ఉంది? అదొక్కటే అక్కరకొచ్చే పని. తప్పకుండా చెబుతా" నన్నాడు పంతులు.

"శుభస్య శీఘ్రం ఇవ్వాళే ప్రారంభించండి" అన్నాడు అవధాని.

అంతప్పుడు తనదగ్గర అక్షరాలు నేర్చుకున్న వాళ్ళు పచ్చటి చెట్లల్లే పైకి ఎక్కివచ్చి నలుగురిలోనూ అవును అనిపించుకోవడం తనకు అదే మహానందంగా వుంది. ఇప్పుడు తనకి వాళ్ళు అడిగితే ఇవ్వలేదన్నా చింతా లేదు. ఆ డబ్బులు రాకపోతే రాగల ముప్పూ లేదు. అవతలిగట్టున నిల్చొని ఎత్తుమీదనుంచి చూస్తున్నాడు ప్రతిదాన్నీ. మంచి చెడ్డల్ని నీరక్షీర న్యాయంగా విడమరచి చూడాలి. అట్లాంటి పక్షిచూపుతో చూస్తే కాల ప్రవాహంలో కొట్టుకపోకుండా కాలు నిలత్రొక్కుకోవచ్చు.

ఇంటికి వచ్చేసరికి తనకి జ్ఞాపకం వచ్చింది షష్టిపూర్తి మాట. తనలో తనే నవ్వుకొన్నాడు.

ఆ సాయంత్రం అవధానిగారి అరుగుమీదబాసిపట్టు వేసుక కూచొని, డిక్టేషన్ వ్రాయిస్తున్నాడు పిల్లలచేత మంథర రాముడికి ఎట్లా చందమామను నిలువు టద్దంలో పట్టి తెచ్చి యిచ్చిందీ.

చిన్ననాడు ఆయన విసిరేస్తే దిగిరాని బంతిలా పైన వెలుగుతున్నది చందమామ. ఆ వెలుగులోనే పిల్లలు వ్రాస్తున్న పంక్తి పంక్తీ ముత్యాలకోవలా మిల మిల మంటున్నది.

# బిల్హణ ప్రశస్తి

దిగుమర్తి సీతారామస్వామి

'జబ్బలొరపెట్టగా ననుక్షణము నుబ్బు
గుబ్బలు పిగుల్చు కంచెలన్ గొమిరె వయసె
యెమ్మెకాంద్రకుఁ దగు నమియింపఁ – గాని
చాలు నజ రుద్ర విష్ణు పూజాప్రసక్తి !'

అనుచుఁ దిమిరంపు వయసు పాయమున కెసగు
ఋక్కు వించిన శృంగార ఋషివి నీవు –
పాతపాటల పల్లవి రోత గొనని
యెంతమందికి గల్గు నీ వింత చొరవ !

★ ★ ★

స్త్రీని ప్రేమింపలేని నిర్జీవ విగ్ర
హములు బ్రహ్మసూత్రముల వ్యాఖ్యలు పఠించు ;
రాగనీరస శుష్క జరాపరీత
జాతి కేనాటికోయి మోక్షంబు సుకవి !

సుందరంబైన కాశ్మీర నందనంబు
విడిచివచ్చిన గంధర్వవిభుఁడ వీవు –
రొమ్ముపైఁ దూలు·రతిచేతి తమ్మితేనె
పదనుదేరిన కొనగోట వ్రాసితేమొ
అక్షరాక్షరమున తావి యవఘళింప
కామినీకైశిక స్వాపకళ చెలంగ
మొగలిరేకుల కస్తురి బురదనంటి
వ్రాయదగినది నీ చరిత్ర ప్రశస్తి.

★ ★ ★

వనితాసంగతి నిందసేయగల దౌర్భాగ్యమ్మె సంస్కార ధా
వనఁ గాషాయము లంటగట్టుకొని విశ్వంబెల్ల వంచింప న
మ్మిన సిద్ధాంతము శ్లోకసంచిత మధూన్మేషంబుగా భవ్య యౌ
వన సందేశ మయాత యామముగ శ్రావ్యంబయ్యె నీ సూక్తులన్.

— 'బిల్హణ యామిని' నుండి.

# రమణారెడ్డి | ఊర్వశి

అచ్చరలందరు అందాలు చిందేవారే కాని ఊర్వశి అచ్చరలకు గూడ అందగత్తెగా కనిపించి వుంటుంది. రూపము ధరించిన సింగారాన్ని నవ్వుల పాలొనర్చి, అచ్చరల పూలతలను వంచి, వారి చేరెడేసి కన్నులను బారెడేసి గావించింది ఊర్వశి. తపోవిఘ్నకారిణులైన ఇంద్రుని కోమలాయుధాలను త్రిప్పికొట్టడానికి, నారాయణ మహర్షికి అంతకంటె నున్నని సన్నని ఆయుధం వేరొకటి లభించలేదు. అహంకరించి కన్నుమిన్నెరుగక మిడిసిపడుతున్న యథార్థాలు యీ ఆదర్శ సౌందర్య రాశి ప్రక్క నిలిచినప్పుడు, ముఖాలు వెలవెలబోయి, ఎత్తూ ఒత్తూ కుదించుకొని పోయి వుంటాయి. కలల కడసీమల పొలిమేరలలో నీడల నడుమ కామనల నడుమ తళుకు తళుకుమని మెరసే కాంతుల వెంటబడి, కవులు దానికొక రూపు కల్పించారు. నీడలనుండి నిజాన్ని, ఊహాలనుండి ఉనికిని, క్షణప్రభలనుండి చాంద్రీ మృదుకాంతిని పిండి, తలగలిపి, దానినే ఊర్వశి అన్నారేమో! మోహాన్ని కల్పించే లావణ్యానికి ఊర్వశి పరమ ప్రమాణం అయింది. ఇది ఊర్వశి ఆదర్శ స్వరూప దర్శనం.

కాగా, ఆదర్శాల వెంటబడే చలచిత్తులైన కవులు ఒక్కొక్కసారి వానిని పట్టుకొని, పిడికిట బిగించి, విజయగర్వాతిశయాన, లోకానికి చూపుదామని పిడికిలి విప్పినప్పుడు, ఆ ఆదర్శానికి కన్నో, ముక్కో వంకరబోయి వుంటుంది. పరిపూర్ణత, అంగాంగ సంయోగిత, కొరవడక తప్పదు. యథార్థమనేది ఆదర్శానికి వికృతి. ఆదర్శమనేది యథార్థాల శుద్ధాకృతి. నారాయణ ఋషి పెంచి బుద్ధినేర్పించి ఎవడో ఒక క్షత్రియ వీరునికి దానము చేసివుంటే, ఊర్వశి యింతవన్నె కెక్కేదికాదు. ఆయన అపాత్రదానం చేశాడని చెప్పాలి. మహేంద్రునికి యిచ్చివేసినందువల్ల, ఊర్వశి త్రిలోకాలకు ప్రేయసిగా పరిణమించింది. ఇంద్రుని పేరోలగాన ఆడి, వీరశయ్యాగతులను సోమపీథులను ఇంద్రసఖులను కూడి బ్రతుకు వెళ్ళబుచ్చే రూపాజీవగా మారింది. అంటే, ఆమె మహేంద్రుని సొత్తు కావచ్చునేమోగాని, గుత్త మాత్రము కాదు. ఘోరదంభోళిని ప్రయోగించవలసిన సురాసుర సమరసన్నాహాలకు ముందు, మహామహీపతుల సఖ్యాన్ని సాహాయ్యాన్ని కోరినవాడై, వారిని మత్యపెట్టి మచ్చు జల్లేందుకు యీ వెచ్చటి పచ్చటి మహాస్త్రాలను ప్రయోగించేవాడు. ఊడిగము, ఉంపుడులతో బాటు వారికి ఉన్నతమైన రాజ్యప్రయోజనం కూడ కలదన్నమాట. ఇది ఊర్వశి సామాన్య స్వరూపదర్శనం.

ఊహాలనుండి ఊర్వశీ మనోహరమూర్తి తాళపత్రాలమీదికి తెల్లకాగితాలమీదికి ఎక్కినప్పుడు, పై జెప్పిన ఆదర్శమూ యథార్థమూ విడివడని బిగికౌగిలిలో నలిగి, కొంతయిదీ కొంత అదీ మెదిగి అచ్చమైన అందాన్ని కొన్నివేళల తుచ్ఛమైన యింద్రియానందముతో రంగరించి, కలవరింతను పలవరింతగా, ఆలాపనను ప్రేలాపనగా, కామనను కామముగా, మోహాన్ని దాహంగా మార్చి, ఒక కొత్తరూపు దర్శనమిస్తుంది. కాళ్ళముందు కన్నీళ్ళ జాళ్ళు, కర్పూరనీరాజనాలు; ఎదుట పగిలి బీటలు వారిన యెదలు, ఎడతెగని ఏడుపురొదలు; చుట్టూ ప్రేమలేఖల గుట్టలు, ప్రణయాహ్వానాల తిప్పలు,

వైఫల్యాల బూదికుప్పలు, క్షణికానందాల గడ్డి పూల కరగోడలు—సంక్షుభిత మానవ మహా హృదయ సాగరాన చిక్కుబడిన అందీఅందని అందపు అచ్చపురూపే యీ ఊర్వశి! సాధారణంగా మన కావ్యాలలో ఊర్వశి ప్రసక్తి వచ్చినప్పుడు, యీ సామాన్య స్వరూపమే సాక్షాత్కరిస్తుంది. కాని మాన్యమైన ఆదర్శస్వరూపం గోచరించదు. అంటే, మన కవులు అప్సరోవర్ణనాది సందర్భాలలో ఒక భావానికి మూర్తి మలచేవేళల, మంచిచెడు గుల కలయికయైన మానవగుణాన్ని ప్రసాదించారు. పేరుకుమట్టుకే దివ్యస్త్రీలైన యీఅచ్చరలు నడతలలో నుడులలో, వలపులో వగపులో, సామాన్య మానవకాంతలే. ఆదర్శాలకు రూపు కల్పించినప్పుడు, అవి కొంతకుకొంత వికృతాలైన విందుకే.

వీరువారని వేర్పరచలేని యీ సుందరులు స్త్రీ సహజమైన హావభావ విలాసాది చేష్టలకు, వివిధ ప్రణయావస్థలకు, అనేక మనోగతులకు ప్రత్యక్ష నిదర్శనాలుగా కవులచేత నాటకకర్తలచేత సంభావింపబడినారు. వైయక్తిక వైలక్షణ్యాలను మించినఐక్యము వారందరికీ కద్దు. కాళిదాస కృతమైన విక్రమోర్వశీయములోని ఊర్వశిలో అధిరత ప్రణయాధీనత, అనురాగతీవ్రత, కొంచెం యించుమించుగా మహాభారతారణ్యపర్వములో అర్జునుని వలచిన ఊర్వశియందుకూడ కనిపించకపోదు. కాళిదాసు దృష్టిలో ఊర్వశి "మానుషీవృత్తము" కలది; కాని ఆమె భూషణములకెల్ల మేలి విభూషణము, ప్రసాధనవిధికి మహా ప్రసాధనము; ఉపమానములకెల్ల ప్రత్యుపమానము. అంటే లావణ్య పరసీమ అయిన ఊర్వశి లౌకిక సౌందర్యానికెల్ల పరమ ప్రమాణము. ఊర్వశి చక్కదనాన్ని మరొక వస్తువుతో పోల్చి చెప్పడంకంటె, ఏదో ఒక ఉత్కృష్టమైన వస్తువును ఊర్వశితో పోల్చిచూచి దాని తారతమ్యాన్ని నిర్ణయించడం బాగు. ఆరణ్య పర్వములో ఊర్వశిని తత్కర్త యింత దొడ్డగా భావించకపోయినప్పటికీ, ఊర్వశి యొక్క దివ్యస్వభావాన్ని దర్శించినాడు. సురవేశ్యలకు మానవుల "తగవులు" నడువవు కనుక అక్కడి అమరావతిలోని అనిందితమైన ఆచారాన్ని నిర్వర్తించమని అడిగే ఊర్వశిలో వేశ్యాగుణంకంటె గాటపు వలపుబలిమి కనిపిస్తుంది. ఇక, నాచన సోముడు కల్పించిన ఊర్వశీ నరకాసుర సన్నివేశములో, ఊర్వశిలోని ఆత్మగౌరవ పరత్వము మానాభిమాన ప్రియత్వం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఇంద్రుని ఓడించి, నిండోలగముండి, దుర్నిరీక్ష్య ప్రతాపాతిశయుడైన నరకుని యెదుట స్తంభానికి తనువాన్ని నిలిచిన "గండారపుబొమ్మ" లో భయ సంకోచాలతోబాటు జాణతనము నిండారింది. తాను "సంత నెన్నడో౯ జవ్వన మమ్ముకొన్న గడసాని"నని, "లంజియనౌదు"నని చెప్పనైతే చెప్పింది గాని, లంజియవని ఎదుటివాడు లొసగుమాట నోట బెట్టినప్పుడు మట్టుకు, ములికి గుచ్చుకొన్నట్లు బాధ పడింది. ఎంత మాటనేర్పు, ఎంత దిట్టతనపు పెంపు వున్నా, నాచనసోముని ఊర్వశిలో ఉన్నతభావన నెలవుచేసికోలేదు. దిగ్భ్రమ గొల్పే సౌందర్యం వున్నా, అది భోగము దాని తళుకే. కాని కాళిదాసు సంభావించిన ఊర్వశి"శృంగారమంగళాంగ" "పర్వసన్నత", తనువు దాల్చిన "పుష్యమాసము", "రూపగర్వితయైన శ్రీకి గుండెతల్లడము", శ్రీదేవి రూపాన్ని సమీపింపగల ఊర్వశీ రూపములో పావిత్ర్యము దీపిస్తుంది.

ఈ వర్ణనలన్నీ ఒక యెత్తు - రవీంద్రుని ఊర్వశీ వర్ణన మొక్కటి వేరొక యెత్తు. ఈవిడ దేవవేశ్య కాదు; నారాయణోరు సంభవ కాదు. సముద్ర మథనవేళ, కుడిచేత సుధాకలశమును, ఎడమచేత హాలాహల భాండమునుదాల్చి, నురువుల సుడుల నుండి మీదికెగసింది. కనుకనే "కాండ హీన పుష్పము" అని కవిచేత సంభావింపబడింది. కాళిదాసు వూహించినట్లు, ఆమె "స్థిరయౌవన". తనకు కోరకదశలేదు; ముగ్ధత్వములేదు. జన్మతః పూరా

విప్పారిన పూవు. కళంకంలేని సొంపుగలది. "కుంద సుమధవళ నిర్వసన తనూ శోభిని"; "అకళంకిణి". సద్దుమణగిన అర్ధమరాత్రివేళ చిరునగవులు సింగారించుకొని ఏ ప్రియుని శయ్యాతలానికో వెడలి పోయే వెకిలిపను లెరుగదు. యుగాలనుండి జగాలను మోహింపజేసే సౌందర్యావధి. సకల దేవతా సమక్షాన కాలికిగజ్జెగట్టి ఆడదొడగినప్పుడు, "హఠాత్తుగ మానవుని హృదంతరము వివశమై, రక్తము వికలమై విహ్వలముగా నర్తిస్తుంది". లోకాలు జార్చిన కన్నీళ్ళజాలు యీ క్రూరకర్కశ స్వభావిని పాదప్రక్షాళనకైన నీరు; ముల్లోకాల యెదనెత్తురు కాలిపారాణి; కడలన్నిట పెల్లుబేగిన ఊర్పులను యేడ్పులను చెవినిడని కటువు గుండె గలది. ఈ యూర్వశి "అనంత నృత్యసంరంభాన పరిక్రమించే విశ్వానికి ప్రాణశక్తి; మానవ సంబంధాలనుండి విడివడిన సౌందర్యము; సూర్యాది నక్షత్రచయగతికి హేతుభూతమైన మహాప్రణయం; అచ్చవు అందవు కొనగాళ్ళ వ్రేళ్ళను తాకేటట్లు రవీంద్రుడు విసిరివేసిన చుక్కలు మెలిచిన పూల మాల," అని ఈ ఊర్వశీ కావ్యాన్ని ఎడ్వర్డ్ థామ్సన్ ప్రస్తుతించాడు.

రవీంద్రుని యొక్క ఊర్వశీ ఆదర్శమూ, పూర్వ మహాకవుల ఊర్వశీ యథార్థ చిత్రమూ, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'ఊర్వశి' లో సంగమించాయి. దివికీ భువికీ సంధింపు సంభవించింది. దివ్యాచారమూ మానుషీవృత్తమూ సమసించాయి, రవీంద్రుడెగిరినంత యెత్తుకు యెగురలేకపోయాడు. కాని నాచన సోముడు దిగినంత కిందికి గూడ దిగలేదు కృష్ణశాస్త్రిగారు. కాళిదాసు చూపించినంత నిండు రూపు చూపలేదు కాని, భారతకర్త యిమిడించినంత యిరుకున గూడ పెట్టలేదు ఊర్వశీ రూపాన్ని. సంకేతాలలో, సందేహాల సీమలలో చాలవరకు సంచరించిన ఊర్వశి నందనవనం నుండి, సంజెచీకటి బందిఖానానుండి, మబ్బురక్కసి గట్టి కౌగిలినుండి యిట్టే అవలీలగా భూమికి అవతరిస్తుంది అప్పుడప్పుడు. ఒక్క రవీంద్రునిలోనే యీ సుందరి అంతుచిక్కలేదు; చుక్కలలో, సూర్యునిలో, పూవులో, నురుసులో, గాడ్పులో, ఏడ్పులో, అన్నిటిలో వ్యాపించింది. ఇంతకుముందు పేర్కొన్న రచనలలో ఒక్కొకప్పుడు భూమికి దిగి, లేదా దివిలోనే మానవ స్త్రీత్వానికి పర్యాయపదంగా వర్తించింది. కాని దేవులపల్లివారి కావ్యంలో, అవతరణముకంటె అధిరోహణము యెక్కువైనట్లు కనిపిస్తుంది. ఊర్వశి 'పతిత' కాజాలదు; నాయకుడు 'పక్షి' కాజాలడు. కాని ఒక్కొకసారి ఊర్వశికి పతనము, నాయకునికి ఉద్గమనము సంప్రాప్తిస్తాయి. కనుకనే ఈ కావ్యమంతా పెల్లువారిన విషాద హాలాహలములో అడపదడప సౌఖ్య సుధా రసధారలు, చీకటిలో వెల్గు రేకలవలె, ఎడారిలో నీటి చెలపలవలె, కనిపించడం జరిగింది.

పూర్వోక్త రచనలకు, దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'ఊర్వశి' కి మరొక గొప్ప యెడము వుంది. రవీంద్రు డొక్కడు తప్ప, తక్కినవారు ఊర్వశిని వర్ణించినప్పుడు, తొట్రుపాటు చూపలేదు. ఊర్వశి ఒకానొక పాత్రమాత్రమే. పాత్రకారుడు పాత్రల పట్ల ప్రత్యేకాభినివేశాలను ప్రీత్యప్రీతులను చూపితే ఒకదానితో వేరొకటి విభేదిస్తుంది. పాత్రధారులు రంగస్థలాననిలిచి నాటకము ప్రదర్శిస్తుంటే, పాత్రకారులు దూరాన ప్రేక్షక మండలిలో వున్నారు. వారు పక్షాతీతులు కావచ్చు— లేదా సకలపక్షాల పట్ల సమానాసక్తిని చూపెట్టవచ్చు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిలోనే కాకుండా, ఆత్మాశ్రయాలైన ప్రణయకావ్యాలను వ్రాసిన భావకవులందరిలోనూ లోపించినది యీ ప్రేక్షకభావమే; యీ తాటస్థ్యమే. నాయకులేతామైనప్పుడు, కవుల చూపులో ఆత్మీయభావము ప్రస్ఫుటిస్తుంది. స్వల్పవిరహమైనా యోజనాల మేర పరచుకొన్న అఖాతమనిపిస్తుంది. పాటలలో గాటపు బాధలు, గీతాలలో ఘోషలు ధ్వనిస్తాయి. సౌందర్యాన్ని అర్చించడం సౌందర్యాన్ని అనుభవించడానికా అనిపిస్తుంది. ఇంద్రి

యాలు ప్రగల్భించి, బుద్ధిమీద సవారిచేస్తాయి. కనుకనే గాఢవర్ణాలతోపాటు విపులవర్ణనలు బయల్వెడలుతాయి. చక్షుఃప్రీతి, శ్రవణ సుభగత్వము, శయ్యాప్రసాధనత్వము కొంతవరకు కలిగినా, అవి అతిశయించినందుచేత దృష్టిమాంద్యము, కించిత్ బధిరత్వము, కొద్ది వెగటు కలుగకపోవు. గుణాలు ముదిరితే అవగుణాలు కావా? సూక్ష్మంగా చెప్పవలెనంటే, యిలాంటి కావ్యాలలో లోపించినది సకలగుణ విశిష్టమైన సంయమనమే. అణువును అజాండ మొనర్చడం, అచ్చపు అందపురూపులో అహంకారపు అనుభవ దాహాగ్ని చొప్పించడం, కవియే నాయకుడై అలుపునిలుపు లేక ఆక్రోశించడం, స్వగతాలుగా వుండదగిన భావాలను బహిర్గత మొనర్చడం, పదాల పొందికకోసం పదార్థాన్ని యిరుకున బెట్టడం, సంకేతాలలో సంఘటనలను కుదించడం, చెవినీ కంటినీ సంతోషపెట్టినంతగా మనస్సును తృప్తిపెట్టకపోవడం, శృంగార రసాన్ని కిందిమెట్టుకు దించడం వంటి లక్షణాలకు భావకావ్యాలు లక్ష్యాలయ్యాయి.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "ఊర్వశి" లోని నాయకుడు "నిరాశా వేదనానగ్నజీవి." "సుఖస్వప్నాలు కూడ దరిద్రమైన యితని బ్రతుకు చీకటి కోనలు చెల్లాచెదరయ్యేటట్లు. ఒకనాటి రేయి ఊర్వశి వెలుగుచూపు "పాతాళ భువనాంతర తమస్సుల" వరకు మెరసి కురిసింది. కాని యింతలో "మొయిలు కాటుక నీడ" ముసురుకొన్నది. వెన్నెల కారుమబ్బు నల్లపెదిమల పాలబడి ముక్కలు ముక్కలైపోయింది. ఊర్వశి విషాదార్ద్రమూర్తిని చూచి నాయకుడు తపించాడు. సౌందర్యమును హత్యగావించేవరకు హింసించే నిష్కరుణులయెడ కోపించాడు. కాని ఊర్వశి కరుణారాశి. కనుక అతనిని యెట్లో దరిసింది, దరిసెనమిచ్చింది, దాహము తీర్చింది. ఊర్వశి "చరణ కరుణా మధుకణము" లభించింది. "చరణ మసృణారుణోదయ కాంతి" సోకింది. ఓరగా ఓరగా నొరుగు ఇంద్రుని శిరసు విడిన వజ్రాలతురాయి తనముందువ్రాలింది. ఆమె పాటల సెలయేళ్ళతో బీటలు వడిన తన బ్రతుకు నిండిపోయి కోటిగొంతులతో "నూతనగీత సుధావథాలలో" సోనలై పొరలిపోయింది. ప్రపంచానికి వెలియై యుండిన వాని యెదలో విశ్వవీణా గళము మ్రోత పెట్టింది. నిదురలో కలల చెలి ఊర్వశి నందనవీథులకు లేవనెత్తింది. "నిదుర పొదిగిళ్ళ మెయి మెయి నొదిగి యొదిగి" విహరించారు. కాని ఈ యున్మత్త భావశాలికి తిరుగ ఊర్వశి వియోగము ప్రాప్తించింది. దరసినట్లే దరిసి, ఒక్క వెలుగు వెలిగి, తిరిగి చీకటి చెరలో చిక్కువడిపోయింది.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి ఊర్వశి కూడ "మానుషీ వృత్తము" కలది. అనిమేషనయన కాదు- నిదురిస్తుంది, కలవరిస్తుంది. కర్కశాత్మ కాదు-కరుణిస్తుంది, సుఖమిస్తుంది. ఆమె కన్నులలో ఆయన కన్నదృశ్యాలు మరెవ్వరును చూడలేనివి. ఆమె కురులకు గూడ కవి చక్కదనాన్ని సమకూర్చినారు. పాదసీమలో తేనెతెట్టెను చూచినారు. ఒక మధుకణము గూడ ఆస్వాదించినారు. సూర్యోదయము కూడ ఆమె చరణతలాన జరుగుతుంది—యిక ఆమె పొడవుయెంతో వూహించవచ్చును. కనుకనే ఆ మందార పుష్పాన్ని ముట్టుకొనేందుకే నాయకుడు వెనుకాడినాడు.

"ఇట వడకుకేల దీని స్పృశింపలేను,
వెరగు కనురెప్ప రేకుల విరియలేను,
ఎటు లదిమికొందు న్రామోడుటెడద, ఎటులు
చెరగి నెరసిన చింపిరి కురుల దాల్తు?"

తాను భారతములోని అర్జునునివలె ధర్మాధర్మ సంశయముతో వెనుదగ్గలేదు; కాని పురూరవుని వలె సొంతపరచుకోలేదు. రవీంద్రునివలె అందని ఆశయాలకు చేయిజాపలేదు. అందినంతవరకు పొంది, అనంతరం కుందినాడు. కాని అందని ఆదర్శాలలోగల అందం, తదన్వేషణలోగల ఆనందం, అందినవానిలో కొంత వెలితిబడుతుంది. ఊహాసీమాంచలాలకు ఊర్వశి మరలిపోయింది కనుకనే కృష్ణశాస్త్రిగారి కావ్యముగూడ రాణించింది.

## మునిమాణిక్యం నరసింహారావు | నన్నయభట్టు

మావూళ్ళో ఒక పెద్దమనిషికి నన్నయభట్టు అంటే కోపం. ఎందుకూ అంటే ఆయన వ్రాసిన వ్యాకరణము అంతా తప్పుట!

ఆయనసంగతి తరువాత మాట్లాడుతాను. నన్నయభట్టు అంటే చాలామందికి కోపం ఉన్న మాట మాత్రం నిజము.

ఆయన తాను వ్రాసిన భారతంలో సంస్కృతం ఎక్కువగా వాడినాడని కొందరికి కోపం!

భట్టు అని పేరు పెట్టుకొని కూడా, ఇంకా బ్రాహ్మణుడుగా ఉండటము ఏమిటి అని కొంత మందికి కోపం!

ఆయన బ్రాహ్మణులు వాడే భాషనే ప్రధానంగా తీసుకొన్నాడు. బ్రాహ్మణేతరులు, అప్పటినుండి ఇప్పటిదాకా వాడుతున్న కొన్ని మాటలను ఆయన తీసుకోక తమకు తీరని అపకారం చేశాడని కొందరికి కోపం.

"నన్నయభట్టును చంపినా పాపంలేదు" అని ఒకరన్నారు.

"చంపడము ఎందుకు ఈ చాయలకు మాత్రం రానీయబోకండి" అని మరొకరన్నారు.

మొత్తంమీద నన్నయభట్టుకు మాఊళ్ళో చాలా మంది విరోధులేర్పడ్డారు. ఇందులో చాలామందికి ఆయన ఎవరో తెలియదు.

తెలియకపోయినా వాళ్ళువాళ్ళు అంతా ఆయ నమగూర్చి అల్లాగ మాట్లాడుకోవడం వల్ల ఆయన తమకు ఎవరో ప్రబల విరోధిఅని మాత్రం ఊహించు కొన్నారు.

అసలు ఈ వాదనను లేవదీసిన పండితుడే ఒక సారి నాతో అన్నాడు. మనభాషకు నన్నయ చేసినంత అపకారం ఇంకెవ్వరూ చేయలేదనీ, ఆయన తనకు విరోధి అనీ.

మా ఇద్దరికి సంభాషణ ఇల్లా జరిగింది.

"చూడండి, ఆ నన్నయభట్టు నాకు విరోధి అన బోకండి మీరు."

"ఏం అంటే, అని తీరుతాను."

"నేను ఎందుకు చెప్పానో వినండి. ఆయనతో విరోధము వద్దు మనకు."

"ఎందుకు మీరు అల్లా అంటున్నారో చెప్పండి ముందు."

"నేను చెప్పేది వినండి. ఆ చచ్చినాడితో మనకు విరోధంవద్దు. అదీకాక ఆయన మంచివాడూ కాదు. ఆయన దగ్గర అనేక సమాసాలు ఉన్నవి. ఇంకో విషయం ఏమిటీ అంటే ఆయనకు బలగం ఎక్కువ! మనకు దగ్గరలోనే బెజవాడలో ఆయన విశ్వనాథ సత్యనారాయణగారింట్లో కాపరం బెట్టాడు. ఎందు కొచ్చిన బెడద చెప్పండి, ఊరుకోండి" అన్నాను.

"పోనీ! తిక్కనమీదికెడితే?" అన్నాడు ఆయన కళ్ళు ఎగరేస్తూ.

"వద్దువద్దు. ఆయనా బెజవాడలో పింగళి లక్ష్మీ కాంతంగారింట్లో పక్క భాగంలోఉన్నాడు. ఆయన కున్న బలగం ఆయనకూ ఉన్నది."

"దేవుణ్ణి చూశావా?" గర్జించాడు.

"చూశాను" అన్నాను. ఆయనకు ఉద్రేకం వచ్చి "ఎక్కడున్నాడు? ఎక్కడున్నాడో చెప్పు?" అని అరిచాడు.

"చస్తే చెప్పను" అన్నాను.

"ఎందుకు చెప్పాలె! దేవుడు నాకు కనపడ్డాడు. ఇంకా ఎందరికో కనపడ్డాడు. అందరికీ కనపడ్డవాడు నీకు కనపడకుండా ఉండడానికి ఏదో కారణం ఉండి ఉండాలె. నీకు కనపడకుండా ఉండాలని ఆయన ప్రయత్నిస్తూఉంటే, నేను నిన్నుతీసుకెళ్ళి ఆయన్ను పట్టియ్యమంటావా? నేను ఆ పని చేసి ఆయన ఆగ్రహానికి గురికావడము ఇష్టములేదు. దేవుడు మటుకు ఉన్నాడు. ఆయన ఎక్కడున్నదిమటుకూ నీకు చెప్పను" అన్నాను.

మళ్ళీ మాట్లాడలేదు ఆయన.

ఆయన ఎంత వెదకినా కనుక్కోలేడు. అని నా నమ్మకం. కనుక్కున్నా ఆయన్నే కనుక్కోనీ, నేను మటుకు నా నోటితో ఆయన ఎక్కడుంది చెప్పను.

'జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదం తవ. పుత్రమేవం గుణోపేతం చక్రవర్తినమాప్నుహి' అని వైఖానసు డాశీర్వదించగా రాజు 'పరిగృహీతం బ్రాహ్మణవచనం' అన్నాడు. నే ననుగ్రహింప బడినాననిగాని, మరి యే మాటనైన యన వచ్చును. బ్రాహ్మణవచనము పరిగ్రహింపబడినది అనుటచేత రాజు అనపత్యుడు. బహుభార్యాకుడు. కొంతవయసు దాటినవాడు. ఈ వైఖానసుని యాశీర్వచన మట్లున్నది. ఆ రాజునకు తన యభిలాష యెదురుగా వచ్చినట్లున్నది.

తరువాత వైఖానసుడు 'కణ్వుడు తన దుహితయైన శకుంతలను అతిథిసత్కారముకొఱకు నియోగించి యామె కననుకూలమైన దైవము నుపశమింపఁజేయుటకు సోమతీర్థము వెళ్ళినా' డని చెప్పెను. ఇచ్చట శకుంతలకు 'దైవము ప్రతికూలముగా నున్నాడు' అన్నమాటలో కథ సూచింపబడుచున్నది. తత్ప్రశమనము కణ్వుడు చేసెను. అచ్చట చేయుచుండెను. ఇచ్చట నామె కనుకూలించెను. ఆమె రాజునకే భార్య యయ్యెను. ఆ దైవముయొక్క ప్రాతికూల్యము మిక్కిలి పెద్దది. శమింపఁజేయ బడియు మరల దుర్వాసశ్శాపమున విజృంభించినది. ఈ మాటచేత, ఆ శాపముచేత, దైవముయొక్క యపరిహార్యత్వము వ్యజ్యమాన మగుచున్నది. ఇచ్చట వ్యంగ్యము చెప్పుట యెందులకని ప్రశ్నింప వచ్చును. దైవముయొక్క ప్రాతికూల్యము కాళిదాసు సృష్టించినది. ఊరకే సృష్టించడుగదా ఆ మహాప్రభువు. ప్రతిదియు మహాకవు లర్థవంతముగనే కల్పింతురు.

అపుడు రాజేమనవలయును ? సరే, ఋషిలేనిచో దిరిగిపోయెద ననవలయును. అతిథి సత్కారమునకు నియోగింపబడిన బాలిక యుక్తవయస్సు కలదియే కావలయును. ఇంతకుముందు 'పరిగృహీతం బ్రాహ్మణవచనం' అన్నమాటలో సంతానాపేక్ష కలదు. ఇప్పుడు రాజు : '(ఆత్మగతం) భవతు తాం ద్రక్ష్యామి' (ప్రకాశం) సైవ విదితభక్తిం మాం మహర్షేః కరిష్యతి'. కానీ ఆమెను చూతుము - ఇవి మనసులో ననుకొన్నమాటలు. ఈ మాటలు పైకెందు కనలేదు ? ఇది యాత్మగత మెందులకు ? ఇంతకు ముందు కలిగిన సంతానాపేక్ష ఆమెను చూడగలనన్న యీమాట దగ్గరపెట్టి చూచినచో రాజుమనస్సు విదిత మగును. ఇప్పుడు కథనంతయు జూచినచో పంచమాంకమున పురోహితుడు చెప్పినాడు, తొలుత నీకు చక్రవర్తి లక్షణోపహితుడైన కొడుకుఁ గలుగునని సాధువులుచెప్పిరని. అట్టి పుత్రాపేక్ష రాజుమనస్సులో నున్నది. భార్యలయందు అంతవరకును సంతానము లేదు. ఈ సంతానమెప్పుడు గలుగును ? ఎచ్చట గల్గునన్న ప్రత్యాశ రాజు మనస్సులో నిత్యముగా నున్నది. బ్రాహ్మణవచనము పరిగృహీతమన్న మాటలో మేల్కొన్నది. 'భవతు, తాం ద్రక్ష్యామి' అన్నమాటలో తదభిముఖముగా ప్రవర్తించుచున్నది. ఇది అంతరాంతరమునందలి భావనాలక్షణము. లేనిచో 'ఆత్మగతము' అన్నమాట అక్కరలేదు.

'సైవ విదితభక్తి ర్మాం మహర్షేః కరిష్యతి' ఆమెయే మహర్షికి నన్ను విదితభక్తునిగా చేయగలదు. ఇచ్చట ప్రయోగించిన కృఙ్ధాతువులో రహస్యమున్నది. వైఖానసునకు సామాన్యపు మాటవలె

నున్నది. సంస్కృతభాషయొక్క సొగసుచేత వాక్య మిట్లు నుండవచ్చును. కాని విచారించినచో, తా నామెను వరించుట, కణ్వునియొక్క పరోక్షమం దట్లు చేయుట, ఈ యవినయమంతయు, ఋషి యందు తనకు భక్తి లేకపోవుటగాదని చెప్పి ఋషిని ప్రసన్నుని చేయదగినది శకుంతల. (చేయుట కృ) ఈ కృ ధాతువులోని రమ్యత యిది.

ఎవడైన నింత యూహ చేయునా యని ప్రశ్న. నిస్సందేహముగాఁ జేయును. గాథశిలు రిట్లే చేయు దురు. పరమభావనానిష్ఠు లిట్లే చేయుదురు. మహా కవు లిట్లే వ్రాయుదురు. రాజు మనస్సంతయు సంతా నాభిలాషయు, దానికి యోగ్యురాలైన స్త్రీకొఱకు ప్రతీక్ష జేయుటకుగానే యున్నది.

"ఇదమాశ్రమద్వారం, యావత్ప్రవిశామి" "శాంత మిద మాశ్రమపదం, స్ఫురతిచ బాహుః కుతః ఫలమి హాస్య, అథవా భవితవ్యానాం ద్వారాణి భవన్తి సర్వత్ర". ఆశ్రమ ద్వారములో నున్న ద్వార శబ్దమే శ్లోకములో గూడ ద్వారమని పెట్టినాడు. తనకు కుడి చేయి యదరినది. ఇది శాంతమైన యాశ్రమపదము. ఇక్కడ ఫలిత మెట్లు? ఇది యాశ్రమ ద్వారము. ఈ ద్వారమునం దీ ఫలితము పుట్టదు. భవితవ్యమున కన్నియు ద్వారములే. అనగా నీ యాశ్రమ ద్వారము గూడ నా భవితవ్యమునకు ద్వారము గావచ్చును. అది యే ఫలితము? అది యాశ్రమములో జరుగ రాని ఫలితమా? కుడిభుజ మదరినది. ఏదియో మంచి జరుగును. ఆ మంచి స్త్రీ లాభ మొక్కటియే యగునా? ధనము రాగూడదా? రాజ్యవిస్తృతి కాకూడదా? ఏ ఒక మహాక్రత్వారంభము కాకూడదా? కాని రాజు మనస్సులో చక్రవర్తి యగు కొడుకు సంభవించ దగిన నూతన స్త్రీని గురించియే కోరిక గలదు. తా నది భావించుచున్నాడు. ఆ సమయమున కుడిభుజ మదరినది. అందుచేత యీ నిమిత్తము తత్సంబంధి. మరియు నందుచేతనే ఈ యాశ్రమ పదము శాంత మనినాడు. ఈ సన్నివేశ మంతయు కలిపి రాజు మనస్సు పుత్రాకాంక్షిగా నున్నదని, ఈ నాటకముయొక్క పరమప్రయోజన మదియని చెప్పక చెప్పుచున్నది. "వహతి విధిహుతం యాహవి ర్యాచ హోత్రీ" అను నాందీ శ్లోకములో నిరూపింపబడు చున్న బహు ధ్వనులలో నీ యర్థమే యిమిడి యున్నది.

మరియు శాంతమన్న శబ్దముచేత నాశ్రమము నందలి జనులు శమవంతులు. రాగద్వేషాది రహి తత్వము సూచింపబడుచున్నది. తన కోరిక రాగాను బంధి. స్త్రీ యందలి కోరిక. దీనినే చెప్పుచున్నది శాంతమను శబ్దము.

ఈ కథా విషయము వదలి యీ శ్లోకము నందలి రచనా శిల్పమును సుంత ప్రసంగింతును. ఇది యార్యావృత్తము. చిన్న పద్యము. మొదటి సగ ములో పది మాటలు విడివిడిగా నున్నవి. రెండవ సగములో అయిదు మాట లున్నవి. మొదటి సగ ములో మూడు వాక్యము లున్నవి. రెండవ సగ మొక్కటియే వాక్యము. శాంతమీ యాశ్రమపదము. స్ఫురించుచున్నది బాహువు. ఎట్లు ఫల మిక్కడ దీనికి? మొదటి రెండు వాక్యములలో శాంత, స్ఫురతి శబ్దములు మొదటివి. తన కోరిక ఫలించు టకు రాగవంతమైన జన ముండవలయును, ఆ రాగముయొక్క సర్వరాహిత్యముకల స్థల మిది. తన వాంఛకు మిక్కిలి ప్రతీపమైనచోటు. అచ్చట తనకోర్కె ఫలించుట పరమాసంభవము. తదసంభ వతాప్రాధాన్యమే తొలుత బుద్ధికి తట్టును. అందు చేత శాంతమన్న శబ్దమే మొదట వచ్చినది. స్ఫురతిచ బాహుః- బాహువున కప్రాధాన్యము. స్ఫురణమునకు ప్రాధాన్యము. ఆ స్ఫురణముయొక్క విలక్షణత్వ మెట్టిదో; సత్పురుషుడైన దుష్యంతుని పూర్వానుభూతి సమయములలో నతడు గుర్తుపట్టినది కావలయును. లేనిచో తత్స్ఫురణ విశేషమున నది స్త్రీలాభ సంబంధి యని యెట్లు నిర్ణయించగలడు? 'కుతః ఫలమిహాస్య' ఎట్లు ఫలము ఇక్కడ దీనికి? గాథశీలురు విచార బావ్యగ్రులైనపుడు వారికి తోచు మొదటిమాట 'అస లెల్లా' ఎట్లు అన్నమాటయే వచ్చును. పైన అసంభ

వత్వము ప్రత్యక్షముగా కన్పించుచున్నపుడు, మొదటిమాట కుతః. 'ఫల'మన్న శబ్దము సహజా పతితమై అనుస్యూత మయ్యెడుమాట. తరువాత 'ఇహ', మరి తరువాత 'అన్య' ఇవి విచారణాదశ లోని క్రమస్థితులు. ఎట్లు ? అది సంభవించరాని స్థలమును తరువాత విచారించుము. చిట్టచివరకు ఫలము యొక్క లక్షణమును వివక్షించును. ఈ క్రమము భావుకుడైనవాడు తన మనస్సును అట్టి సందర్భములో తాను వాడెడి వాక్య విన్యాస లక్షణమును జాగ్రత్తగా పరిశీలించుకొన్నచో నీయర్థము సువ్యక్త మగును. 'అన్య' అన్న శబ్దముకూడ తన ప్రీ గతవాంఛను నిరూపించుచున్నది. ఈ పద్యములోని మొదటి సగము చెప్పునపుడు దుష్యంతుడు పరమాలోచనాపరుడై యున్నాడు. ఇచ్చటనున్న పది శబ్దములు, మూడు వాక్యముల విన్యాసము, తత్తచ్ఛబ్దములయొక్క తత్తత్ స్థానమందలి విక్షేపము, సర్వమును దుష్యంతుని పరమభావనా లక్షణమునకు వ్యంజకములుగానున్నవి. ఆ భావనను వదలిపెట్టినాడు. పద్యములోని రెండవ సగమొక్కటియే వాక్యము. రచనా శిల్పమున కీ పద్యము ప్రథమోదాహరణీయమగు చున్నది.

ఈ వ్యాసమునందు తక్కిన విషయములు వదలిపెట్టి సమాపతితమైన దుష్యంతుని పుత్రవాంఛాగత బుద్ధిని విస్తరించి చూపింతును.

ప్రియంవద శకుంతలతో, బిగిసిన వల్కలపు ముడి వదలించుమని యడిగినపుడు, పయోధర విస్తారయితృకమైన తన యౌవనమునే నిందించుకొనుమని యన్నది. అప్పుడు రాజు

ఇద ముపనత సూక్ష్మగ్రంథినా స్కంధదేశే
స్తనయుగ పరిణాహాచ్ఛాదినా వల్కలేన
వపురభితర మస్యాః పుష్యతి స్వాం నశోభామ్
కుసుమమివ పినద్ధం పాండుపత్రోదరేణ.

ఈ శ్లోకమును ప్రక్షిప్తముగాఁ జెప్పుదురు. ఒక శ్లోకము ప్రక్షిప్తమగుటకు కొన్ని కారణములుండును. కొన్ని ప్రతులలో లేకపోవచ్చును. బహుభాషలుకల భారతదేశములో, బహుభాషాదేశములయందు నెల్లెడ వందలువందలు ప్రతు లుండవచ్చును. అది నిర్ణయము కాజాలదు. ఇది ప్రక్షిప్తము కాదనుటకు శ్లోకరచన చేతగాని, తద్గత శిల్పదృష్టిచేతగాని వీలున్నది. వర్ణింపబడునది యామెయొక్క పయోధర విస్తృతి. ప్రియంవదగూడ దానికి ప్రాధాన్య మీయక తద్ధేతుకమయిన యౌవనమునకు ప్రాధాన్య మిచ్చినది. రాజు పయోధరవర్ణనమునకు దిగలేదు. ఆమె యౌవనమునే చూచుచున్నాడు. భుజమునందు సన్నని ముడివేయబడినది, వక్షస్థలమును గప్పుచున్నదియునైన వల్కలముచేత పండుటాకులో నున్న పూవువలె నామె శరీర మున్నదన్నాడు. ఆమె శరీరమును రాజు పుష్పముగాఁ జూచుచున్నాడు.

ఇదం కిలావ్యాజ మనోహరం వపుః
తపక్షమం సాధయితుం య ఇచ్ఛతి
ధ్రువం స నీలోత్పల పత్రధారయా
సమిల్లతాం ఛేత్తు మృషి ర్వ్యవస్యతి.

ఇచ్చటగూడ నామె శరీరమును నల్లకలువ రేకువలె చూచినాడు.

అధరః కిసలయరాగః
కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమ మివ లోభనీయం
యౌవన మంగేషు సన్నద్ధమ్.

ఆమె పెదవి చివురాకువలె నున్నది. బాహువులు కొమ్మలవలె నున్నవి. భారతదేశములో నున్న యే కవియైనను ఆమె పయోధరములు పుష్పగుచ్ఛము వలె నున్నవనును. కాళిదాసట్లనలేదు. కుసుమమువలె లోభనీయమైన యౌవన మామె యంగములయందు సన్నద్ధమైన దన్నాడు. అనగా దుష్యంతున కామె పూవువలెనే కన్పించుచున్నది. ఎన్నిచోట్ల చూచినను రాజామెను పుష్పముగనే వర్ణించుచున్నాడు. ద్వితీయాంకములో 'సురయువతి సంభవంకిల మునే రపత్యం తదుజ్ఝితాధిగతం అర్కస్యోపరిపతితం చ్యుత మివ నవమాలికాకుసుమమ్' జిల్లేడు చెట్టుమీద పడిన నవమాలికా పుష్పమువలె నున్నదట.

మరియు నామెను గూర్చిన తన యాలోచనా సంతతి విదూషకునితో జెప్పుచు తొలుదొల్తటి

భావము 'అనాఘ్రాతం పుష్ప' మనియే చెప్పినాడు. రాజు ఆమె యౌవనమును పుష్పముగానే చూచినాడు. ఆ పుష్పము ఫలించి తనకు చక్రవర్తియైన కొడుకు గలుగవలయును. దుష్యంతుడు బయలుదేరినప్పటి నుండియు నతని సర్వభావనయు పుత్రాకాంక్షాభరితముగ నున్నది. తద్యోగ్య క్షేత్రాన్వేషణా వ్యగ్రుడై సర్వథా యతడు ప్రవర్తించెను. తాదృక్‌క్షేత్రము శకుంతల. ఈ దేశమెవని పేర బరగినదో వాడు కలుగబోవు సంతానము.

ఇచట నొక చిన్న మీమాంస. స్త్రీ యనగా కాళిదాసుని భావమేమి? ఈ భావమునందు కామదుష్టత లేదు. ఇదియొక పవిత్రమైన భావన. వస్తువునందు వస్తుస్వరూప దిదృక్షయే కాని యితరార్థ కల్పన జేయుటలేదు. ఇతర దృష్టిలేదు. ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః—తల్లక్షణమైన భావన. ఇది కాళిదాసు. ఆయనకంటె పరమ రమణీయమైన యథార్థమైన భావన గలవాడు సృష్టిలో నుండుట కష్టము.

ఇప్పుడా ప్రక్షిప్త శ్లోకమునుగూర్చి విచారింతము. ఈ రీతిగా ప్రధానభూతమైన శకుంతలా వపుర్గత పుష్పసాదృశ్య లక్షణమును చెప్పుటయేకాక యా శ్లోకములో మరియొక యర్థమున్నది. అది ప్రక్షిప్తము కాదనుట కీ యర్థమే చాలును. శిల్పగత రహస్యమును స్పృశించు నర్థముగల యీ శ్లోకము ప్రక్షిప్తమెట్లగును? ఇంత శిల్పరహస్యమును చూచి యెవడో ఆ శ్లోకమును వ్రాసినచో నా శ్లోకమీ గ్రంథమునం దుండుటకు కవికుల గురువైన కాళిదాసునకైన యభ్యంతర ముండదనుకొందును.

ఇదియే కాక ఈ శ్లోకమున మరియొక చమత్కారమున్నది. చివరి యంకములో శకుంతల కనిపించినది. రాజామెను చూచి యిట్లన్నాడు.

"వసనే పరిధూసరే వసానా నియమక్షామవతీ ధృతై
కవేణీ అపి నిష్కరుణస్య దుఃఖశీలా మమదీర్ఘం
విరహవ్రతం బిభర్తి"

ఈ శ్లోకములో శకుంతల రెండు వసనములు ధరించి యున్నట్లు చెప్పబడినది. పరిధూసరములైన రెండు వసనములను ధరించినదై—ప్రక్షిప్త మన బడు శ్లోకములో, శకుంతల యొక్కదే వస్త్రమును దాల్చినట్లు చెప్పబడినది. అవివాహితలైన స్త్రీలు, వివాహితలైన స్త్రీలు, దరించెడి దుస్తులలోని తారతమ్యము సువ్యక్తముగా కనుపించుచున్నది. తత్తత్కాలాచార పర్యవేక్షణా ప్రధాన దృష్టియగు నాథునిక విమర్శకునకు నిట్టి యాచార నిరూపకమగు శ్లోకము పరిత్యాజ్య మగునా?

ఇట్టి యర్థమును చెప్పుటకు కాళిదాసు రచనయందు ఏతాదృగ్లక్షణములు పెరచోట్లకూడ భాసించినపుడు దీనికి బలము సేకూరును. అట్టి స్థలములున్నవని తరువాత చూపింపబడును. అందుచేత నిది కాళిదాసుని శిల్పమార్గ బహిర్విషయము గాదని మనవి చేయుచున్నాను.

ఈ రాజుయొక్క పుత్రవాంఛాసహిత యోగ్య క్షేత్రాన్వేషణము మరియు నొక విషయముచేత తెలియుచున్నది. మధుకర నివారణమునకు తాను ప్రవేశించుచు, కః కోత్రభోః అనబోయి, అర్ధోక్తి యందు విచారించి, 'రాజభావ స్త్వభిజ్ఞాతో భవేత్, భవతు. ఏవ మభిధాస్యే' అన్నాడు. నా రాజభావము తెలిసిపోవును. కాని, ఇట్లుచెప్పుదును, రాజభావ మభిజ్ఞాతమైనచో వచ్చెడి దోషమేమి? తాను రాజునని వారికి దెలిసినచో వారు కళవళపడుదురనియా? రాజుకాక తన యంతటి తేజశ్శాలియగు పురుషుడు కనిపించినపుడు మాత్రము కళవళపడరా? రాజైనచో నెక్కువ గౌరవింతురు. అది తన కనుకూలమే కదా. రాజగుట వలన తన కతడు లభించుట సాధ్యము కాదని శకుంతల యనుకొనునా? అడవిలోనున్న బ్రాహ్మణకన్యకు గొప్ప రాజోద్యోగి మాత్రము లభించునా? ఇవియేవియుకావు. రాజు తాను సామాన్య పురుషునివలె శకుంతలకు కనుపించవలయును. సామాన్యురాలైన యామె యౌవనమును తాను వాంఛించెను. రాజుకాని సామాన్య పురుషుడైన తన పురుషత్వ మామెకు నచ్చవలయును. తనయందున్న రాజత్వేతరములైన గుణములచేత నామె తన్ను ప్రేమించవలయును.

ఇది నాటకముయొక్క వస్తువు. దాని తీర్పు. దాని ప్రథమదశయు.

# వేదనా వాసుదేవము

నాయని సుబ్బారావు

కరములు పాదము లక్షులు
శిరములు వేయేసియైన నెలువము మదిలో
తిరపడదు, నీదు మాయా
నిరవధిక మహోద్వ్యమున అనిర్దేశ్యవపూ !

తాపించచ్ఛవి పౌటగావలయు నంతా చీకటే లోన నీ
రూపమ్మున్ పదిలించుకో నయన సంరోధమ్ము సేయన్ బహి
ర్వ్యాపారప్రవణేంద్రియమ్ములకు లేవా పట్టపగ్గమ్ము ల
ప్పా ! పాటింపక చూచుచుందువటె నా పాపమ్మిటుల్ పండగన్.

నామాటవినవు నాలో
నీ మార్గము నెపుడు చెఱుపనే లేచు వ్యధా
కామనము లింద్రియము లి
స్సీ! మర్దింపవు బలే హృషీకేశుడవే !

పరపగు వేయి బాహువుల పంచమహాయుధ లబ్ధ దుష్ట సం
హరణము చాలు భక్తవరదాభయదాయక శోభన ప్రభా
కరము కరమ్మునన్ తనువు గప్పి తదంతర రాగమూల ని
ర్హారణముగా భవమ్ము చరితార్థము సేయుదె సర్వవిజ్జయీ !

బలి యాయం గని మూడుపాదములు నీ భక్తుండు నీ పాదమున్
తలపై బూని నిమేషమాత్రమున పాతాళమ్ము ప్రాపించె కే
వల మొక్కంగుళమైన నీ గనని నిర్భాగ్యుండనేమౌదు నా
తలపై నీదు సహస్రపాదములతో త్రైవిక్రమ శ్రీనిధీ !

వేపాదమ్ములు మోయ నాకు వశమా విశ్వప్రదీపా ! భవ
చ్ఛ్రీపాదమ్మొకదేని చాలునని లో జింతింతు నేవేళ స
ర్వాపద్వారణ సౌఖ్యకారణ శుభప్రారంభ సంరంభ మా
నీ పాదమ్మ నఖాగ్రరేఖ నయినన్ నిండింతువే నా యెదన్.

కనులు జగత్త్రియీభువన కందళ సుస్థితి కారణమ్ములై,
కనులు గభస్తి చంద్రములుగా తపనమ్ములు శైశిరమ్ములై,
కనులవి సర్వభూతహిత కాంతి నిధానములై వెలుంగ, నా
కనులివి దైన్యపుంగనులు కాదగునయ్య, సహస్రలోచనా !

ఒక కారుణ్య కటాక్షలేశ మిటు రాదో ! తామసాపూర్ణ, కం
టక సంకీర్ణ పరంపదగ్రసవ లుంటాకావదీర్ణాస్మదా
స్తికతావీథి నిరంతరోజ్జ్వలముగా తేజఃప్రభల్ చిమ్మదో :
వికచాంభోజ మరంద సమ్మితదయావిస్ఫారనేత్రద్యుతీ !

నాదు వేదనకును వింతనవ్వు లొలుకు
పుష్పదరహాస ! నీ వేయి మోము లేను
గాలమున బట్టి విసరిన నేలమీది
మట్టగిడుసునై గిలగిల కొట్టుకొనగ !

# కొన్ని సామెతలగన్న చిన్నకథలు | శండిల

*"చిక్కావు మిడతంభొట్లూ!"*

అతగాడు ఆ త్తింటి క్రొత్తల్లుడు. అత్తవారింటికి మనుగుడుపులకై వచ్చాడు. మొదట్లో పిండివంటలతో షడ్రసోపేతంగా కొన్నాళ్ళు భోజనాదులతో గౌరవించడం జరిగింది. మర్యాదగా ఆయన వారింటినుంచి త్వరగా వెళ్ళవలసింది పోయి అక్కడే ఉన్నాడు. రోజులు గడుస్తున్నాయి కాని అల్లుడు అవతలికి నడిచేవాటం అవుపించలేదు అతని ఇల్లాలికి అత్తగారికీ—తుదకు పాతచింతకాయ పచ్చడి, చారు. చూరునీళ్ళ మజ్జిగదాకా వచ్చింది మర్యాద. అల్లుడున్నాడని ఆ తల్లీకూతుళ్ళు పాపం! పిండివంటలే మానుకున్నారు. ఆఖరికి అతనికీ కొంచెం కాలు గదపాలనిపించిందో ఏమో "అత్తయ్యగారు! సెలవిప్పిస్తే మా యింటికి వెళ్ళి వస్తా"నన్నాడు. ఆవిడగూడా "అప్పుడే వెడతావా నాయనా?" అని మాటవరసకన్నా లోలోపల సంతసించి ఎట్టకేలకు "సరే" అన్నది. అతడు బయలుదేరాడు స్వగృహానికి.

అల్లుణ్ణి అటు వెళ్ళనిచ్చి ఆ తల్లీకూతుళ్ళు ఆవేళే గారెలకని పప్పు నానబోసుకున్నారు. సాయంత్రానికల్లా రుబ్బడం పూర్తై పొయ్యి అంటించారో లేదో మూకుడు వెయ్యడానికి; జామాత గారు వీళ్ళకి తెలియకుండానే వెనక్కి వచ్చి కొంపవారనుంచే ఈ తంతంతా పసికట్టాడు. అసలు అతడు నిజంగా ఇంటికని బయలుదేరుతేగా- గారెల వంట పూర్తి గాకుండానే వస్తే బావుండదని పెరటిలోంచి సడిలేకుండా వచ్చి గారెల పొయ్యి వున్న గోడకు ఆవలిప్రక్క కూర్చున్నాడు. అత్తగారు గారెలు వేస్తోంది. అత్త వేసే ప్రతీ గారె చేసే 'చుయ్‌' మనే ధ్వనీ అల్లుడు సావధానంగా లెక్క పెడుతున్నాడు. వంట పూర్తి అయ్యేసరికి యాభై జోళ్ళు తేలాయి గారెలు. ఒక్క ముక్కైనా నోట వేసుకోకుండా దొంతరలుగా బుట్టలో పెట్టి ఆనక హాయిగా తినవచ్చునని అటకమీద భద్రపరచింది అత్తగారు.

ఇంతలో ఆఘాల మేఘాలమీద ఊడి పడట్లు వాలాడు అల్లుడు. "అత్తా-అత్తా-ఇవాళ ప్రయాణము సాగిందిగాదు. రేపు బయలుదేరవచ్చునని వచ్చేశాను" అన్నాడు. ఆమె వెలవెలబోయి పైకి సంతోషాన్నే ప్రకటించింది. భోజన సమయంలో పిండివంటల ప్రసక్తి వచ్చింది. "అత్తా, నాకంతా తెలిసింది. కర్ణపిశాచి నాతో చెప్పింది. నే వెళ్ళాక మీరు గారెలు వండారు. అవి యాభై జతలు. నాకు పెట్టవలసివస్తుందని దాచేశారు" అన్నాడు. తల్లీ, పిల్లా అటకమీద బుట్ట దింపి లెక్కపెడితే అతడు చెప్పినవన్నీ సరిగా ఉండడంతో "అరే—ఇన్నాళ్లూ మన యింట్లో వున్న జ్యోతిష్కుని ఘనత పసికట్టలేకపోయాం" అనుకొని గారెలు పెట్టి అతన్ని తృప్తి పరచారు.

మరునాటినుండి అమ్మలక్కల మధ్య ప్రచారం పెరిగిపోయింది "పుల్లమ్మగారి అల్లుడు జ్యోతిశ్శాస్త్ర పండితు"డని—ఎవరి వస్తువు లేవిపోయినా పద్మం వేసి చెప్పేయ గలడనే పుకారు ఊరు ఊరంతా గుప్పుమంది. ఒక చాకివాని గాడిద తప్పిపోయింది. "ఏదో తమకింత దక్షిణ సమర్పించుకుంటా"మంటూ వాళ్ళు పుల్లమ్మగారిని అల్లుడుగారికి సిఫారసు చేయమని ప్రాధేయపడ్డారు. ఆయన భేషజం ప్రకటించి "సరిగా రేపటి ఉదయానికి మీ గాడిద ఎక్క

డున్నదో చెప్పేస్తా" నన్నాడు. వాళ్ళు వెళ్ళి పోయారు గాని రాత్రి అతనికి నిద్రపట్టలేదు. గాడి దెలాగ దొరుకుతుందని చేసేదిలేక ఆ ఊరి పొలాన వెదకడానికి బయలుదేరాడు. రాత్రల్లా కష్టపడి తిరగ్గా తిరగ్గా ఎక్కడో దొరికింది గాడిద. ఆనవాలుగా ఒక చెరువువార చెట్టుకు జాగ్రత్తగా కట్టి వేసి ఏమీ యెరగనట్లు ఇంటికివచ్చాడు. తెల్లవారగానే చెప్పేశాడు మడేలుకు. వాడూ ఆ ప్రకారం గాడిదను కనుగొని పరమానందభరితు డయ్యాడు. ఇంకేముందీ? పుల్లమ్మగారి అల్లుని ప్రభావం తీవ్ర ప్రచారాన్ని పొంది రాజుగారి దాకా ప్రాకింది.

రాజుగారి ద్రవ్యం కొంత అపహరింపబడింది. చోరుల పత్తా తేలలేదు. పుల్లమ్మగారి అల్లునికి కబురు వచ్చింది దర్బారునుంచి. రాజుగారన్నారు "సొత్తుఎక్కడున్నదో చెప్పు"మని. అతగాడు ఆలోచించాడు లోలోపల "ఇదేమి దైవమా! ఇట్టి యాపద వచ్చిపడింది"అని. అయితే పైకిభేషజాన్నే ప్రకటించి "చిత్తం. వారంరోజులు గడువిప్పించండి" అని సెలవుతీసుకొని పోబోతుంటే రాజు వెనక్కు పిలిచి "నీవే గనక సరిగా ఆచూకీ తీయలేకుంటే నీ ముక్కూచెవులూ దక్కవ"న్నాడు గద్దిస్తూ- అతడు మరుక్షణంనుంచి ఒక ఉపజపం మనసులో "ముయ్యో, నయ్యోమన్న *గారెలదృష్టం కష్టపడి తిరిగిన గాడి* దదృష్టం - మరి ముక్కూ, చెవులూ వుంటాయో ఊడతాయో"—

రాజాంతఃపురంలో ఇద్దరు దాసీలున్నారు. వాళ్ళ తల్లిదండ్రులకు సంతానం నిలవక పుట్టా చావా అవడంచేత ఒకతెకు ముక్కూ, ఇంకొకతెకు చెవీ అని పేరుబెట్టారు. అసలు రాజద్రవ్యం కాజేసింది వాళ్ళే. పుల్లమ్మగారి అల్లుడు వెళ్ళినప్పటినుండి వాళ్ళిద్దరి ప్రాణాలు బిక్కుమంటున్నాయి ఎలాగైనా అతడు తమను బయట పెడతాడేమోనని. రాజుగారు పెట్టిన గడువు సమీపించింది. ముక్కూ, చెవులకు ఆరాటం ఆగక పండితులవారిని కలుసుకుందామని వచ్చారు. రోజులు గడిచిపోతుంటే అతనికి ఆరాటం హెచ్చి మనస్సులో మంత్రం బహిర్గతమై ఒంటరిగా గదిలో కూర్చొని బిగ్గరగా అరవడం మొదలుపెట్టాడు. దానిలో పదే పదే తమ పేరులు వినబడ్డంతో వాళ్ళిద్దరకు తాము ఆక్షణంలోనే పట్టుబడిపోయినంత దడబుట్టి ఆయన్ను సమీపించి నమస్కరించి "అయ్యా! తమ జపం ఆపండి. తమకు ఏమికావలిస్తే అదే ఇచ్చుకుంటాం మా పేర్లుమాత్రం బయటపెట్టకండి. పెడితే రాజుగారు రేపటి సాయంత్రానికల్లా మా తలలు కోట గుమ్మానికి వ్రేలాడగట్టిస్తా"రని జరిగినదంతా చెప్పేశారు. మీకేం భయంలేదని మాటయిచ్చి అతడు ఆ సొమ్ము తెప్పించి జాగ్రత్తగా ఒకచో దాచబెట్టి మరునాడు దానివైనం తెలియజేశాడు రాజుగారికి. ఇంక ఆ రాజ్యంలో ఇట్టి త్రికాలజ్ఞుడు లేడని తేలిపోయింది. దర్బారులో స్థానం ఇవ్వబడింది; రాజుగారి అంతరంగిక నేస్తంగూడా అయ్యాడు. పుల్లమ్మగారి, ఆమె కూతురి ఆనందానికి అంతే లేదు.

పుల్లమ్మగారి అల్లుడు, రాజుగారు ఒకనాటి సాయంత్రం వాహ్యాళికి బయలుదేరారు. చల్లగాలిలో పైరుచేలు చూస్తూ వెడుతుండగా రాజుగారు ఆ గాలిలో ఎగిరే మిడత నొకదాన్ని గుప్పెట బట్టి ఇదేమిటని ప్రశ్నించాడు. అతనికి గొప్పచిక్కే వచ్చిపడింది. రాజుగారు. చెప్పకపోతే ప్రమాదం; చెబుదామంటే తెలియదాయె. మళ్ళీ మంత్రం ప్రారంభించాడు—"ముయ్యోనయ్యోమన్న *గారె లదృష్టం- కష్టపడి తిరిగిన గాడి దదృష్టం- ముక్కుచెవుల ధర్మమాఅన్న మూలధనవుదృష్టం—అనువునందునా- మినువునందునా! చిక్కావు మిడతంభొట్లూ"* అనగా రాజు చేతిగుప్పెట విప్పాడు. మిడత రెక్క లల్లాడిస్తూ యెగిరిపోయింది. రాజు "శహాభాష్" అని అతని ప్రజ్ఞను పొగుడుతూంటే మిడతంభొట్లుగారు ఆశ్చర్యపడుతున్నాడు. అతని పేరు మిడతంభొట్లు కావడమూ, రాజుగారిచేత మిడత చిక్కువడడమూ దైవికంగానే జరిగిందాయె—అంతే మర్నాటినుంచి

పాండిత్యానికి స్వస్తిచెప్పి రాజుగారిచ్చినదానితోనే తృప్తిపడి గడపడం ప్రారంభించాడు బ్రతుకు.

దైవానుగ్రహం కారణంగా మన ఎత్తులు పారి యెన్నోసార్లు చిక్కులలోంచి చిత్రంగా తప్పించుకు పోవడం జరుగుతూంటుంది. కాని ఎల్లప్పుడూ కాలం ఒకేరీతి గడవక వికటిస్తే మన బండారం బయటపడ్డప్పుడు "చిక్కావు మిడతంభొట్లూ" అంటూంటారు ప్రతికక్షులు.

*"కాలు జారితేనేగాని గంగానమ్మ కూడా ఏమీ చెయ్యలేదు."*

ఆ వూరికి గ్రామదేవతపేరు గంగానమ్మ. రోజూ రాత్రివేళ ఒక నక్క అమ్మవారి ఆలయంలో ప్రవేశించి నైవేద్యంగావుంచబడ్డ మాంసాదుల్ని సాపడి పోతూండేది. అప్పుడప్పుడు గంగానమ్మ విగ్రహం ఎక్కి త్రొక్కేదికూడాను. "నక్క తొక్కుతోంది-దాని పని బడతావాలేదా?" అని ఆ గ్రామ మునసబుగారి కలలో గనబడి బెదరించేది శక్తి. మునసబు గారికి జంబుకం కనబడేదిగాదు. కర్తవ్యమేమిటని కరణంగారిని అడిగేడు *"కాలు జారితేనేగాని గంగానమ్మ కూడా ఏమీ చెయ్యలేదు*—గనుక నక్క కాలు జారే ఉపాయం ఆలోచించా"లని చెప్పాడు కరణం.

మునసబు మరునాడు ఒక మాంసఖండం గంగానమ్మ నాలుకకు అంటించి విగ్రహం ముందు ఉసిరికాయలను కొన్నిటిని రాసిగా ప్రోగుపెట్టించాడు. ఎప్పటియట్లే గోమాయువు వచ్చి గంగానమ్మ నాలుకన వ్రేలాడే మాంసఖండం కోసమని ఒక కాలు ఉసిరికాయల పోగుపై మోపి రెండవకాలు ఎత్తుతుంటే ఉసిరికాయలు కదిలి క్రిందబడింది. దాని కాలు జారిజారడంతోనే గంగానమ్మ లటుక్కున పట్టుకొంది.

ఈ కథ మాట ఎలాగున్నా దీనివల్ల బుట్టిన సామెత చెప్పే నీతి గొప్పది. ఏల ననగా మన నడవడిలో మనం తిన్నగా వెళ్లినంతవరకు, ఏ దోషమూ మనవల్ల రానంతవరకు— కాలుజారితేనేగాని— మనను ఎంతటివారైవాసరే— తుదకు దేవుడైవాసరే ఏమీ చేయలేడు.

*"రోజుకు రెండు పులి గుండెకాయలు కావాలంటే నేనెక్కడ దెత్తునే కూతురా?"*

ఒక గృహస్థు తన కుమార్తెను అత్తవారింటి నుండి తీసుకువస్తున్నాడు. వాళ్ళ ఊరికి ఒక మహారణ్యంగుండా దారి. కచ్చడం యేర్పాటుచేసుకొని వస్తున్నారు. బండిలో అతడు, ఆతని కుమార్తె, ఆమె చంటిబిడ్డ మాత్రం వున్నారు. సగందూరం ప్రయాణమయ్యింది. ఎద్దులకు దాహమై ఇటుఅటు లాగడం మొదలుపెట్టాయి. బండివాడు వాటిని విప్పి దాపున ఉన్న ఏటియొద్దుకు వెళ్ళాడు. యజమాని కూడా వాణ్ణి అనుసరించాడు. బండిలో మిగిలిందల్లా కుమార్తె, ఆమెపాప. కొంతసేపయ్యేసరికి బెబ్బులి ఒకటి దూరంనుండి నరవాసన తగులగా ఆమెను కబళించడానికి అడే వస్తోంది. ఆ లేతయిల్లాలికి ప్రాణాలు అమాంతం మీదికెగసినట్లైంది. ఏమీ తోచడంలేదు. పులి దాపుకు వచ్చేస్తోంది. దైవానుగ్రహంవల్ల ఆమెకొక ఊహ తట్టింది. చటుక్కున పిల్లను గిల్లింది. అది కెవ్వున కేకపెట్టి ఏడవడం ప్రారంభించింది. ఆమె దరికి వచ్చే పులికి వినబడేటట్లు బిగ్గరగా "ఒసే-ఒసే-ఇవాళ ప్రొద్దుటి నుంచి ఇప్పటిదాకా చూశాను. ఒక్కపులేవచ్చింది. *రోజూ రెండు పులి గుండెకాయలు కావాలంటే నేనెక్కడ దెత్తునే కూతురా!"* అని అరచింది. ఆ మాటలు పులి విని ఇదెవరో నన్ను చంపేసే దానివలె వున్నదని వెనక్కు తిరిగి పలాయనం చిత్తగిస్తూంది.

దానికి ఒక నక్క ఎదురై దానివల్ల జరిగినదంతా విని నవ్వి "శార్దూలరాజా! ఎంత వెర్రివాడవు? నరులేమిటి-నిన్ను చంపడమేమిటి. ఇందేదో మోసం జరిగింది" అనగా "పోనీ-మనకెందుకు పోదాం" అని పులి అంటే "నీకు నిజంగా మతి పోయింది-రా-నిశ్చేవంలాగ ఆ నరుల్ని భోజనం చేసి నీ ఆకలి తీర్చుకుందువు-నీకేమీ భయంలేదు"

అని ధైర్యం చెప్పి తన కాలికి ఒక త్రాడు గట్టుకొని దాని ఆవలికొన పులికాలికి కట్టి యిద్దరూ బండి వద్దకు వస్తున్నారు. ఆయమ ఈ దృశ్యంచూసి "హారీ! ఇపుడేదిదారి? ఏదో నీదయవల్ల ఇందాకటి ఆపద తప్పింది" అని చింతించి మరొక ఊహాస్ఫురించి "ఓనక్కా-రోజుకు రెండు పులుల్ని తీసుకువస్తానని మాటయిచ్చి ఇపు డొక్క తెనే తెస్తున్నావే" అని గద్దిస్తున్నట్లు అడిగింది. పులి అనుకొంది "అరే-ఈ దుర్మార్గపునక్క ఎంతపని జేసింది? నన్ను ఆమెకు వప్పగిస్తోంది తన లాభానికని" ఇలాగనుకొని ఒక్క గెంతువేసి డొంకలు, కంచెలు దాటడం ప్రారంభించింది. పులి బాగానేవుంది; కాని నక్కబావగారికే శరీరమంతా ముళ్ళవల్ల గీరుకుపోయి నెత్తురెగచిమ్మి చచ్చిపోయింది.

*"చూచేవారు చెప్పరు, చెప్పేవారు చూడరు"*

ఒక వేటకాడు లేడిని తరుముకొస్తున్నాడు; అదీ ప్రాణరక్షణకై కాలుకొద్దీ పరుగుపెడుతోంది. ఇద్దరికీ మధ్యదవ్వు హెచ్చైంది. లేడి ఒక మునీశ్వరుడున్న తావు ముందునుంచి చెంగున దుముకుతూ పోయింది. ఆయతి దాన్ని చూచాడు. మరి కాస్సేపటికి వేటకాడు అటేవచ్చి ఆ మౌనిని ప్రశ్నించాడు "లేడిని చూశారా" అని. ముని అబద్ధం ఆడగూడదు. గనుక అన్నాడు "అయ్యా! చూచేవారు చెప్పలేరు, చెప్పేవారు చూడలేరు"—అనగా కళ్ళు చూడగలవు గాని మాట్లాడలేవనీ, నోరు మాట్లాడగలదు గాని చూడలేదనీ-తన సత్యవ్రతానికి భంగంరాకుండా లేడి ప్రాణానికి ప్రమాదం రాకుండావుందీసమాధానం.

*"ముండాముల్లు ముగ్గురను చంపింది"*

ముందు భర్త, మధ్య భార్య, వెనుక మరది నడుస్తూ ప్రయాణం చేస్తున్నారు. భార్యచీరకు అంటుకున్న పూతికముల్లు అప్పుడప్పుడు ఆమె దేహాన్ని గ్రుచ్చుతోంది. ఆమె అది కానుకోలేక మరదిగారు దురూహతో ముల్లుపెట్టి గ్రుచ్చుతున్నట్లు అనుమానపడి భర్తచెవిలో ఊదింది. వివేకహీనుడగు ఆ భర్త మరేమీ ఆలోచించకుండా తమ్ముని తెగవేశాడు. ఇద్దరు ప్రయాణం సాగిస్తున్నారు. ముల్లు మాత్రం దాని పని మానడంలేదు. "ఏఁవిటో! ఇంకా గ్రుచ్చుకొంటోంది" అంది ఆమె. భర్తకు తెలివివచ్చి "ఎంతపని చేస్తివే మూర్ఖురాలా! నీమాట బట్టుకొని నిష్కారణంగా తమ్ముని చంపుకొన్నా"ననుకొని కత్తితో భార్యను చంపేశాడు- మరికొంత దూరంనడిచి భార్య, తమ్ముడు- వీరినిద్దరను జంపుకొన్న తన బ్రతుకు వృథాయని దుఃఖించి తన కత్తితో తన్నే పొడిచేసుకున్నాడు. గనుకనే *"ముండాముల్లు ముగ్గురను చంపింది"* అంటారు.

*"ఆతీసే ఉరేదో త్వరగా తీసెయ్యండి నా మేకల కాపుకు వేళదాటిపోతోంది"* అన్నాడట.

వెర్రి గొల్లవాడు నేరంచేశాడు. అదికానిది. దానికై ఉరిశిక్ష విధించబడింది. అది వింటూ వాడన్నాడు "బాబయ్యా! ఆ తీసే ఉరేదో త్వరగా తీసెయ్యండి- నా మేకల కాపుకు వేళ దాటిపోతోంది"- వాడికి ఉరిశిక్ష అంటే ఏమిటో తెలియదు. అప్పుడప్పుడు అనలు విషయం ఏమిటో తెలియక మాట్లాడడంలో వ్యక్తమయ్యే తెలివి లేమినీ, వ్యవహారజ్ఞాన శూన్యతనీ యీ సామెత ఎత్తిపొడుస్తుంది.

*"నా మాట బద్ధమైతే డొంకలో షరాబు నడగమన్నాడట"*

ఈ సామెత సుప్రసిద్ధ హాస్యరస స్రష్టలైన శ్రీ శ్రీ పరమానందయ్యగారికి సంబంధించినది. ఒకనాటి సాయంత్రం పరమానందయ్యగారి శిష్యులు కొందరు కొంత ధనంతో పొరుగూరికి ప్రయాణమయ్యారు. "దూరం. అమావాస్య చీకటి. దారిలో దొంగల భయం" అని ఎవరో హెచ్చరిస్తే "మాకేం భయంలేదు; ఎవరొచ్చినాసరే మమ్మతేన్నం చెయ్యలేర"ని ఉత్తరకుమార ప్రజ్ఞలు పలికి రాత్రి ప్రయాణం ప్రారంభించారు. పాపం! వీరివి వట్టి బింకాలని తెలుసుకోలేని షరాబు ఒకడు తనదగ్గర

డబ్బు వున్నదే అనేనా సంకోచించక వీరితో బయలుదేరాడు. సరిగా అర్ధరాత్రి అయ్యేసరికి దొంగల గుంపొకటి వీరికి అడ్డు తగిలింది. చోరుల్ని కొంత పసికట్టిన పరాబు ఎందుకేనా మంచిదని దాపునవున్న ఒక డొంకలో దాగొని అరచేత ప్రాణాలుంచుకొని బిక్కు బిక్కు మంటూ జరిగేది పరకాయిస్తున్నాడు.

ముందు సరసంగా మాటలకు గురువుగారి శిష్యులు దారికి రావకపోవడంతో దొంగలు దరువు లంకించుకున్నారు. రెండు వరుసలు వీపుపై పడ్డాయో లేదో చప్పగా లొంగి మూట ముచ్చుల కప్పగించి దణ్ణంపెట్టారు. వాళ్ళూ ఆరొక్కవు మూటవిప్పి దానిలోని నాణాలు మంచివో కాదో అని ఆ చీకటిలో ప్రయోగించుకుంటున్నారు. మంచివి గాకపోతే మళ్ళీ తంతారేమో అని శిష్యులలో ఒకడు "బాబూ! అవన్నీ మంచివే. ఒక్కటి పూటా లేదు. *నా మాట అబద్ధమైతే ఆ డొంకలో పరాబునడుగు"* అని పరాబు నక్కివున్న డొంక చూపాడు ఆ శిష్యుని భావం పరాబుకి నాణెం బాగా తెలుస్తుంది గదా అని.

ఇంకేముందీ? వెంటనే దొంగలు డొంకమీదబడి పరాబును ఈవలకి లాగి నాలుగు తగిలించి వాడి దగ్గర డబ్బుకూడా లాక్కున్నారు. పరమానం దయ్యగారి పరివారం దగ్గిర సొమ్ము తక్కువేగాని పరాబువద్ద దానికి రెండింతలుంది.

*"తాటాకుల బణివిక్రింద మాబాబు లేడన్నాడు."*

ఒక తండ్రికొడుకుల కథ యిది. తండ్రి అప్పుల్పాలై ఋణం తీర్చలేక బాకీదారులకు ముఖం చాటేస్తున్నాడు. ఇలా కాదని వాళ్ళందరు ఒక నాడు వీళ్ళయింటిపైకి దాడి వెడలారు. కొంచెం ముందే దీన్ని పసికట్టిన బాబు వాళ్ళ పెరటిలో వున్న తాటాకుల బణిపిక్రింద దాక్కొని "ఎవరికి చెప్పకు"అని కొడుకుని హెచ్చరించాడు. కాస్సేపటికి అప్పులాళ్లు వాళ్ల యింటిపైకిఎగబడి నానాకూతలు కూస్తూ గాలించడం మొదలుపెట్టారు. ఇల్లు పూర్తి చేసుకుని"లేడర్రా. వీ డెక్కడికో దాటిపోయా"డను కొని అయినా భ్రమ దీర్చుకుందాం దొడ్డికూడా చూసేసిఅని పెరట్లోకి వచ్చారు. ఇంత సేపు"మీనాన్న ఏడిరా? అని కొడుకుని వాళ్ళు గద్దిస్తూనేవున్నారు. "నే నెరగ"నని వాడు చెబుతూనే వున్నాడు. దొడ్డికూడా వెతికి ఇంక నిరాశతో వాళ్లు బాబు నక్కిన తాటాకుల బణిపి ప్రక్కనుంచి వచ్చేస్తుంటే ఆ గుంటడు తిన్నగా వుండక "మీరు ఆ బణిపి దగ్గర కెడుతున్నారెందుకు?" "*తాటాకుల బణివి క్రింద మా బాబు లే*"డన్నాడు. దానితో వాళ్ళ కను మానం గలిగి నలుగురూ ఆకులు పైకిలాగి బాబును పట్టుకున్నారు.

*"అది మా పని గాదు"*

పూర్వం ఒక రాజుగారి ఆవు దూడ తప్పి పోయింది. తన పల్లకి మోసే బోయీలకు కబురంపి దూడను వెదకితీసుకురండని ఆజ్ఞాపించారు. వాళ్ళన్నారు "అయ్యా! '*అది మా పని గాదు*'—దూడల్ని వెదకడం వంటి పనులు పాలేళ్ళుచేయాలి"—"మరి మీ పనేమిట్రా?" అన్నారు రాజు. "పల్లకి మోయడం బాబూ!" అని తడుముకోకుండా జవా బిచ్చారు మడేళ్ళు. "ఐతే-సవారీ తీసుకురండి" ఆజ్ఞాపించాడు రాజు. వెంటనే వాళ్ళు పల్లకి తెచ్చారు. రాజు పల్లకి నెక్కాడు. సాయంత్రం దాకా పల్లకి మోస్తూనే వున్నారు. దూడ కనబడ లేదు. రాజు ఎక్కడా పల్లకి దింపమనడం లేదు. భుజాలు నొప్పిపెట్టి ఆయాసంపట్టుకుంది బోయీలకు. "ఇం కెంత సేపు బాబూ!" అన్నారు వాళ్ళు. "అది మీ పనిగాదు (అనగా అలాగ అడగడం)—పల్లకీ మోయడమే గదా మీ పని—నా దూడ అవుపించేవరకు పల్లకి మోయవలసిందే" రాజు అన్నాడు. వాళ్ళు తమ తెలివి లేమిని తెలుసుకొని సిగ్గుపడి రాజుకు నమస్కరించి ఆయన్ను అంతః పురంలో దిగబెట్టి ఒకరో యిద్దరో పోయి దూడను వెదకి తెచ్చియిచ్చారు.

*"ఎండమూరి పంట వెన్ను శారెడు, దూస్తే దోసెడు, ఊదితే ఉట్టిదే"*

లౌక్య వ్యవహారంలో దిట్టలందు గ్రామ కరణాలు సుప్రసిద్ధులు - అందునా *'నకార గుళ్ళ'* మరీనీ - ఈ సామెత ఒక కరణం ప్రయోగించిన తెలివితేటల్ని బట్టి పుట్టింది. ఎండమూరు అనే గ్రామం తూర్పుగోదావరి జిల్లాలో వుంది. ఒక యేడాది కాటకం వచ్చి పైరు దెబ్బతిన్నది. శిస్తు ముజరా యిప్పించబడాలి. రైతుల్ని సమావేశపరచి శిస్తు మాఫీ గురించి ముజరాలో తనకు రావలసిన వాటాను గురించీ చెప్పాడు కరణం. రైతు లెంత మాత్రం మెత్తబడలేదు. తహశీల్దారుగారికి రిపోర్టు చేయడంలో కరణం "ఎండమూరి పంట వెన్ను మూరెడు, దూస్తే దోసెడు." అన్నాడు. తహశీల్దారు అయితే రిమిషను యివ్వనక్కరలేదు అనుకున్నాడు. ఈ సంగతి రైతులకు తెలిసి ఇంక ఎలాగా వ్యవహారం చెడిసి పోతోందని కరణంతో ఒప్పందానికి వచ్చేశారు. మరైతే కరణం తన మాటమీద నిలబడాలిగా! తాశీల్దారువారు అజమాయిషీకి విచ్చేశారు. రెండు మూడు కళ్ళాలు చూశారు. ఎక్కడకెళ్ళినాపొల్లే. కరణాన్ని పిలిచి "ఏమయ్యా! వెన్ను శారెడు, దూస్తే దోసెడు" అన్నట్లు వ్రాశావే? అనడిగాడు. కరణం తడుముకోకుండా సమయస్ఫూర్తి ప్రకటించి "చిత్తం. *వెన్ను శారెడు దూస్తే దోసెడు అయితేనేమండీ ఊదితే ఉట్టిదే"* అన్నాడు. అధికారి వెంటనే ఊరంతటికి శిస్తు ముజరా యిప్పించాడు.

*"దోమాడ కరణంలాగ చచ్చీ సాధించాడు"*

దోమాడలో హిందువులు, మహమ్మదీయులు ఎప్పుడు పెద్ద పార్టీగా వుండేవారు. ఆ గ్రామకరణం వారిమధ్య విభేదాలవల్ల నిరాటంకంగా తన అధికారం చెలాయించుకుంటూ ఇటు హిందువుల్నీ అటు ముసల్మానుల్నీ గూడా వేచుకతినేవాడు. ఆతనికి అంత్యకాలం ఆసన్నమయ్యింది. అన్నీ ఉడిగిపోయాయి. ఇంక కరణానికి ఛలంగూడా తగ్గివుంటుందనుకొన్నారు రైతులు. కరణం ఇంక కొంతసేపటికి చనిపోతాననగా హిందువులకు కబురంపాడు. వాళ్ళూ జాలిపడి "నీ కడసారి కోరిక ఏమిటి" అని అడిగారు. "ఏమీలేదు-నా మృత దేహాన్ని సాయెబుల గోరీదొడ్డిలో పూడ్చండి. నాకంతేచాలు" అని కన్నుమూశాడు కరణం. ఆయనకోరిక ప్రకారం ఆయన శవాన్ని గోరీల దొడ్డికి తీసుకెళ్ళి పాతిపెడుతున్నారు హిందువులు. ఇంక చూసుకోండి - కత్తులు దూసుకువచ్చారు తురకలు. కటారులు, బళ్ళేలు, కర్రలతో వీరభద్రుడి సంబరానికివలె రౌద్రాకారులై శేచారు హిందువులు. వాళ్ళవీ వీళ్ళవీ తలలు కొబ్బరికాయలవలె గాలిలో ఎగిరాయి అంతా అయిపోయాక వుభయపార్టీలు అనుకున్నారు *"చచ్చీ కూడా సాధించాడురా కరణం"* అని. ఇప్పటికిమనల్ని ఎవరైనా పట్టుకొని అదేపనిగా పీడించుకు తింటూంటే "ఏఁవిట్రా *దోమాడ కరణం*లాగ పట్టుకున్నావు" అనడం అలవాటైపోయింది.

# అంధుల ఆలోచనలు | తసూజో ఇషికావా

ఆమెకు ఎదురుగా స్తంభాన్ని ఆనుకొని కూర్చొని వున్నాడు అతను. వసంతకాలం. సూర్యకిరణాలు కిటికీలో నుంచి అతని బుజాలమీద పడుతున్నవి. అతని కళ్ళకు తెల్లని కట్టు కట్టబడివుంది. చాలా బాధాకరమైన దృశ్యం. అంధుడైన ఓ డిటెక్టివ్ రచయితగా అతనిని ఊహించుకోవడానికి ప్రయత్నం చేసింది ఆమె. పనిపాటలు లేకపోవడంవల్ల ఊరిపోయి, సూర్యరశ్మి తగలకపోవడంవల్ల పాలిపోయి, ఆ మూతలు పడిన కళ్ళు అంధకారంలోకి, నిరంతరమైన, అవధులు లేని అంధకారంలోకి చూస్తూ, ఆ అంధకారంలో తాను వ్రాయబోయే భయంకరమైన కథలను దర్శిస్తారు ఆయన. హత్య, రక్తం, ఒక బాకు, డిటెక్టివ్‌తో కలబడి హోరాహోరి, ముష్టాముష్టి యుద్ధం. ఇవే, యీ దృశ్యాలే ఆయన చూస్తారు తన అంధకారంలో అంతకన్న అంధకారబంధురమైన సంఘాన్ని సృష్టిస్తున్నారాయన.

ఆమె ఒక్కసారి కంపించిపోయి, తల అడ్డంగా తిప్పింది. "వద్దు, వద్దు.... నాకు ఇష్టంలేదు. అంతకన్న చనిపోవడమే మంచిది." కంటికివున్న ఆ కట్టులోనుంచి అతను మృదువుగా ఓ చిరునవ్వునవ్వాడు.

అతడు గ్రుడ్డివాడవుతాడని ఇంకా నిర్ధారణగా తెలియదు. అకస్మాత్తుగా అతని చూపు బాగా తప్పిపోయింది. కంటిగుడ్డుమీద కురుపులు కనిపించాయి. అవి కంటిపాపకు కూడా ప్రాకడంతో చాలా

"మీరు నిజంగా గుడ్డివాళ్ళయి, అసహాయంగా ప్రతిదానికీ తడబడుతూవుంటే నేను చూడలేను. ముందు ముందు ఇంత హాయిగా వుండలేముకదూ! ఇంతకంటే చనిపోవడమేమంచిది." అంటూవుండేది అతని భార్య అప్పుడప్పుడూ. ఆమె ఎంతో వుద్వేగంతో యీ మాటలు చెప్పడంతో ఆమె నవ్వులాటకు అంటున్నదని అతను నమ్మలేకపోయేవాడు.

"నిజంగానండీ! మనకు మనం ప్రాణాలు తీసుకుందాం కాని, ఇలా రోజురోజుకు మరింత పెరిగే ఈ దుఃఖాన్ని మాత్రం భరించలేము" అని కూడా ఆమె అనేది.

ఒక్కొక్కసారి అతను కూడా ఆమె మాటలకు ఆమోదం తెలిపేవాడు— కాని మనస్ఫూర్తిగా మాత్రం కాదు. కొన్నిసార్లు మాత్రం ఇలా అనేవాడు : "నాకు రాత్రి పడుకొన్నప్పుడు ఒక ఆలోచన వచ్చింది. నేను నిజంగా గుడ్డివాడనయిపోతే ఏ పని చేయగలనా అని ఆలోచిస్తున్నాను. ఏ పనీ పెద్దగా చేయలేను. చివరకు సంగీతంకూడా చెప్పలేను. సంగీతం పాఠాలు బాగా చెప్పడానికి కావలసినంతగా 'కోటో' నేర్చుకొనే అవకాశం ఇప్పుడు లేదు... కాని డిటెక్టివ్ కథలు వ్రాస్తే? ఒక కథను ఆలోచించి ప్రయత్నం చేద్దామనివుంది. నేను నీకు చెబుతూపోతాను... చివరకు డిటెక్టివ్ కథలైనా వ్రాయకలగాలి నేను."

---

**తసూజో ఇషికావా (1905) ప్రసిద్ధ జపాను రచయిత. ఇతని 'సోబో' నవల మొదటి అకుటాగావా బహుమతిని పొందింది. ప్రసిద్ధములైన ఇతని ఇతర రచనలు "నాట్ దట్ దేర్ ఈజ్ నో హోప్", "బ్లూరివల్యూషన్" మొదలైనవి. ఇవికాక వందవరకు కథానికలు కూడా వ్రాశారు ఇషికావా.**

అపాయకరంగా పరిణమించింది. ఈ కురుపులు నయం అయినా, ఇంకా అక్కడక్కడా మచ్చలు వుండవచ్చు. ఆ మచ్చలు నయం కాకపోతే, అతనికి ఎన్నటికీ దృష్టిరాదు.

అతడు రోజంతా రేడియో విన్నాడు. ఉదయం, సాయంకాలం అతని భార్య వార్తాపత్రికలు చదివి వినిపించింది. రేడియోలో వినడానికి ఏమీ లేనప్పుడు తాను గ్రుడ్డివాడయితే ఏమి చెయ్యాలా అని ఆలోచించేవాడు.

ఒకటి రెండుసార్లు భార్య చెప్పినట్లు ఆత్మహత్య చేసుకుందామని తలపోశాడు. చివరకు డిటెక్టివ్ కథలను గురించి కూడా నిశితంగా ఆలోచించాడు. మొదట మొదట భయపడి, బ్రతుకు తెరువును సాధించడానికి విలక్షణమైన ఎన్నో పద్ధతులను ఆలోచించాడు. కాని కాలంగడిచినికొద్దీ ఆ ఆలోచనలను విరమించుకొన్నాడు. ఆ విరమణలో ఎక్కడో అతనికి చలనంలేని ప్రశాంతత కనిపించింది. ఇప్పుడు ఏ పథకాలను వెయ్యడానికీ అతడు ప్రయత్నం చెయ్యడంలేదు. తాను గ్రుడ్డివాడు కాకతప్పదని తనకు తెలిస్తే, అప్పుడు ఏదో ఒకటి జరుగుతుంది, దానిని గురించి ముందుగానే ఆలోచించడం మంచిదికాదు. ముందేం జరుగుతుందో ఊహించే ప్రయత్నములో అతడు మతిభ్రమణ కలిగేప్రమాదంలో పడ్డాడు.

అతడు చిన్నపిల్లవాడిలా భోజనం చేశాడు. కంచం చుట్టూ మెతుకులు పోసుకోవడం ఆమె చూస్తూనేవుంది. ఆమె వంగి ఆ మెతుకులను పోగు చేసి, కంచంలో వేసింది. ఆమెకు కోపంవచ్చింది.

"ఇంకా అన్నం ఎలా తినాలో తెలియదా ?"

అతడు సమాధానం చెప్పలేదు. అంధుడుగా వుండడానికి అతడు యింకా అలవాటు పడలేదు... తన భార్య తనకు చాలా దూరమైన దనిపించింది అతనికి. ఆ భావం అతనిని భరించలేని ఏకాంతంలోకి త్రోసింది. తన దౌర్భాగ్యం ఎక్కువ అయిన కొద్దీ, ఆమెకు దగ్గరగా వెళ్ళాలన్న ఆకాంక్ష ఎక్కువ అయింది అతనికి. అందువల్ల ఆమెకు ఎక్కడ కోపంవస్తుందోనని అతి జాగ్రత్తగా వుండే వాడు. వారిద్దరిమధ్య ఒక అగాధం ఏర్పడ్డది. తాను కులాసాగా వుండి, చెయ్యదలుచుకొన్న పనులను చేసే సమయంలో, యీ సంగతి అతనికి తెలియకుండా ఎంత అజ్ఞాతంగా వుంది. ఆరోగ్యం ఇంద్రియాలను స్తబ్ధంగా వుంచుతుంది.

చేపకు వున్న ముళ్ళన్నీ తీసివేసి ఆ చేపను అతని కంచంలో వేసింది ఆమె. నాలుగేళ్ళ కుర్రవాడిలా ఆయన గురించి జాగ్రత్త తీసుకోవడం ఎంత విచారకరమైన సంగతి!

తృప్తిలేక, యాంత్రికంగా, భావరహితంగా ఆ చేపను అతడు తిన్నాడు. అతని నోరు ఒక్కటి మాత్రం కదులుతూ వున్నది. చేపను అంతాతిన్నా, ఇంకా ఛాప్‌స్టిక్స్‌ను కంచంలో కదిలిస్తూనే వున్నాడు. కంచంలో తనకు తెల్లగా కనిపించిన చోట్ల ఆ ఛాప్‌స్టిక్స్ రెంటినీ కలపాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఒక్క తెల్లని వస్తువులను మాత్రమే అతడు అస్పష్టంగా గుర్తించకలడు.

ఆమె తన ఛాప్‌స్టిక్స్‌ను క్రింద వుంచి, అతని వ్యర్థప్రయత్నాలను కనిపెడుతూ కూర్చుంది.

ఆమె దుఃఖం ఆపుకోలేకపోయింది.

"అక్కడ ఏమీ లేదండీ."

"ఏమీ లేదా ?"

"అంతా తిన్నారుకదా !"

అతడు సమాధానం చెప్పలేదు. అన్నం మాత్రం తిని, పళ్ళెంలో తన ఛాప్‌స్టిక్స్‌ను అడ్డదిడ్డంగా వుంచాడు. అతనికి విపరీతమైన ఆగ్రహం కలిగింది.

ప్రతిరోజూ అతనిని పట్టుకొని, బజారులోకి తీసుకొని వెళ్ళి, బండి ఎక్కించి డాక్టరు దగ్గరకు ఆమె తీసుకువెళ్ళాలి. రోజు రోజుకు డాక్టరు మరీఅధైర్యంగా మాట్లాడుతున్నాడు.

"శస్త్రవైద్యం కొన్నిసార్లే సఫలం అవుతుంది. మేము ఎంత ప్రయత్నం చేసినా, అది

ఏ విధంగా పరిణమిస్తుందో, మాకే తెలియదు. అందువల్ల......"

ఆమె ఏకాకి అయిపోయింది. చెప్పుకోవడానికి ఎవ్వరూ మిగలలేదు.

ప్రతిరోజూ డాక్టరు దగ్గరకు పోతూ అందంగా తయారై వెళ్ళాలా అని ఆలోచిస్తుంది. తన భర్తే తనను చూడలేకపోతున్నప్పుడు యిలా అందంగా తయారుకావడం ఆమెకు బాగుండేదికాదు. కాని ఆమె తయారయ్యే వెళ్లేది. ఈ అందం ఇతరుల కోసమా? ఇలా వెళ్ళడం తప్పు అని ఆమెకూ తెలుసు. కాని భర్త అశక్తతకు కోపం తెచ్చుకోకుండా ఉండకలిగేది కాదు.

అతనిముందు కూర్చొని, ఒక్కసారిగా తన కుడి చేతిని అతనిముఖానికి మూడు అడుగుల దూరంగా వుంచి "దీనిని చూడగలరా?" అని అడిగేది.

"అక్కడ ఏదో వున్నదని మాత్రం చెప్పగలను."

"ఎన్ని వేళ్లు?" ఆమె మూడు వేళ్లు చూపింది. అతడు మాట్లాడలేదు. నిన్నటికన్నా తగ్గిపోయింది అనుకొన్నది ఆమె కోపంగా.

"నాకు తెలియదు."

"ఇప్పుడు చూడు" ఆమె గొంతు కర్కశంగా వినిపించింది.

ఆమె చేతిని రెండడుగుల దూరంలో వుంచింది. అప్పటికీ అతడు చూడలేకపోయాడు.

"రెండు వేళ్లేనా?"

ఆమె చేయి దాదాపు అతని ముక్కుకు తగిలేటంత దూరంలో వుంచితేకాని అతనికి కనిపించలేదు. అతడు ఓడిపోయాడు. ఆమె కోపాన్ని, పట్టుదలను ఎదుర్కొనలేకపోయాడు. గోడకు ఒరిగిపోయాడు.

"నాకు పక్క వేయి"

"ఏం? నిద్ర వస్తోందా?"

"కూర్చొని ఏంలాభం?"

ఆమె ఒత్తుగా వున్న అతని చెంపలు, గడ్డం జాగ్రత్తగా చూసింది. అతని గడ్డం విపరీతంగా పెరిగింది. ఆమె నీళ్ళు వెచ్చబెట్టి, అతనికి వెనుకగా నిలబడి, అడ్డదిడ్డంగా గడ్డం చేసింది.

"ఒక్కసారి ఇలారా". అతడు పిలిచాడు. ఆమె అతనికి దగ్గరగా వచ్చి నిలబడ్డది. అతడు తన చేతులతో ఆమె అరికాళ్ళను స్పృశించాడు.

"ఏంకావాలి?"

అతడు నవ్వి. "నీ నడకను వింటున్నాను. చాలా అసాధారణమైన ధ్వని వినవస్తోంది. ఎన్నో రకాల ధ్వనులు. దానినిబట్టి నీ అరికాళ్లు చదునుగా వుంటాయని అనుకొన్నాను. ఇదిగో! నిజంగానే వున్నాయి." తనకు దృష్టి తగ్గిపోయినప్పటినుంచీ ఆమె పాదాలరూపాన్ని చూడడం ఇదిమొదటిసారి

చాలా గిన్నెలను, పళ్ళాలను ప్రక్కప్రక్కనే పేర్చి. వానిని కప్పివుంచి, అన్నింటినీ ఒక్కసారిగా చూస్తే మామూలు పియానో మాదిరిగా వుంటుంది చూడమన్నాడు.

ఆపరిస్థితుల్లో ఆ మనిషికి కూడా అన్ని కోరికలూ వుండడం ఆశ్చర్యకరం. అతని ప్రేమకు తాను లొంగిపోతున్నప్పుడు అతడు మరియొక మనిషి అన్నా తాను భావించిన అభిప్రాయాన్ని మార్చుకోలేకపోయింది ఆమె.

అతని ప్రతి పనిలో విచారమూ, నిరాశా కూడిన ఆవేగం హెచ్చుగా వుంది. ఆ అంధకారంలో అతనికి తన అస్తిత్వమే ఒక కలలా గోచరించవచ్చు. అయినా హఠాత్తుగా ఆమె ఒక విషయం తెలుసుకొన్నది. తన విషయంలో అతడు ఏవిధంగా భావించినా తాను నిరాశపడవలసినదిగా కనిపించలేదు. తాను కూడా అంధురాలు కాగలిగితే - క్రొత్త అనుభవాలతో, ప్రశాంతమైన ప్రకృతిలో, ప్రక్షాళింపబడ్డ నూతనజీవితాన్ని తాను ప్రారంభించవచ్చు. రంగునుంచి, రూపంనుంచి విడిపోయిన ప్రపంచంలో అప్పుడు స్పర్శ. రుచి, ధ్వనిమాత్రమే వుంటాయి. ఆమె కన్నులు మూసుకొని చూచింది. పూర్వము ఏరాత్రి అనుభవించని ఒకవింత ప్రపంచం తనముందు కనిపించినట్లు అనిపించింది ఆమెకు.

ఒకనాటి ఉదయం అతడు ఆమెను దగ్గరికి తీసుకుంటూ "నాకు ఇప్పుడు బొత్తిగా కనిపించడం లేదు" అన్నాడు. ఆమె ఒక్క క్షణంపాటు బిగుసుకుపోయి, అతనివంక చూసింది.

"వెలుగుకూ, చీకటికీ భేదం లేదు."

"ఒక్క క్షణం నీ కళ్ళు తెరిచిచూడు."

ఆమె రెండు కళ్ళూ పొరలు కమ్మాయి. అవి కూడా మనం నిత్యం చూచే గ్రుడ్డివాళ్ళ కళ్ళ వలెనే వున్నాయి. అతడు ఇదివర కెన్నడూ లేనంతగా ఆమెను భయపెట్టాడు.

అతడు తన కౌగిలిని ఇంకా గాఢంగా బిగించి, ప్రశాంతంగా మాట్లాడాడు.

"సరే. బావుంది. దీనికి మనం అలవాటు పడిపోవాలి. గ్రుడ్డివాళ్ళు ఏ పని చెయ్యగలరో మనం ఆలోచిద్దాం. మన పరిస్థితి మరీ అంత హీనంగా లేదు కదా! ఇంకా ఎంతో ఆనందం మనకోసం వేచివుంది."

అతని భుజంమీద తలను దాచుకొని ఆమె నిశ్శబ్దంగా దుఃఖించింది. కాని చనిపోదామని మాత్రం అనుకోలేదు. తాను భయపడ్డంత భయంకరమైన విషయం కాదు గుడ్డితనం. తాను ఇదంతా జరుగక పూర్వం చేస్తూవున్నట్లుగానే—అతని మెడ చుట్టూ ఆప్యాయంగా తన రెండు చేతులూ చుట్టివేసింది.

అనువాదం - నాగభూషణ్.

# గురజాడ అప్పారావుగారు

పొట్లపల్లి సీతారామరావు

లోకములో రచయిత పేరుప్రతిష్ఠలు పొందుటకు కారణము లనేకములుగా నుండును. కొందఱు రచయితలు కాల పరిస్థితులకు సంఘ విపరిణామములకు నెదురు త్రొక్కుకొని నిల్చి మహాకవు లనిపించుకొందురు. ఈ రకపు రచయితల ప్రతిష్ఠకు కేవలము వారి కవితాశక్తియే హేతువుగా నుండును. కవితాశక్తి యెంతయో పుష్కలముగా నున్ననే గాని లోక మాయనను కవిగా శిరసావహింపదు. ఆ యభిప్రాయములతో తా నేకీభవించకపోయినను, ఆ కవితాశక్తి బాలకుని తల వంపించి కవియని యంగీకరింప జేయును. మఱికొందఱు రచయిత లుందురు. వారి ప్రతిష్ఠకు అప్పటి కాలమాన పరిస్థితులే హేతువులు. ఈ రకపు రచయితలకు కవితాశక్తి కంటె హంగుదారు లవసరము. ఈ కవుల దృష్టి కవితా సృష్టియందు కంటె అప్పటి లోకస్థితి కనువుగా వస్తువు నేర్చుకొనుటయందే మొగ్గుగలిగి యుండును. వీరి కవిత్వము అప్పటి లోకము మారనంతవఱకు చలామణి యగును. ఆ పరిస్థితిలో నేకొంచెము మార్పువచ్చినను ఇది కవిత్వము కాకపోవలసి వచ్చును. వీరి రచనలో ప్రధానముగా భాసించునది కవితాశక్తి కాదు. అప్పటి రాజకీయములు—సాంఘిక పరిస్థితులు. వాస్తవిక దృష్ట్యా పరిశీలించినచో వీరు కవులుగారు—అకవులు—కవులుగా చలామణిగా ప్రయత్నించెడి కీర్తికాములు.

మొదట చెప్పిన కవు లిట్టివారు కారు. "కవయః క్రాంత దర్శినః"— "నా నృషిః కురుతే కావ్యమ్"— ఈ సిద్ధాంతములచేత పరామర్శింపబడి నిలువగల్గినవారు. భావములు మారవచ్చును — సంఘము విపరిణామము పొందవచ్చును — కాలము తలక్రిందులు గావచ్చును—వారు కవులుగానే నిల్చి యుందురు. నన్నయ తిక్కనాది కవులీ శ్రేణివారు. వీరికి కవితాశక్తి జీవగఱ్ఱ. వీరిలో అప్పటి కాలపరిస్థితులు కూడ అక్కడక్కడ చెదరుగా నుండవచ్చును. కాని యవి అప్రధానములు. పాల్కురికి సోమన మొదలైనవారి ప్రధాన వస్తువు మత ప్రచారమే. అయినను వారు ప్రతిష్ఠపొంది నిల్చియుండుటకు కారణము కథావస్తువునకు తీసిపోని కవితాశక్తియే.

తనకావించిన సృష్టి తక్కొరుల
చేతంగాదు నా, నా ముఖం
బున దాఁబల్కిన పల్కు లాగమములై
పొల్పొందు నా వాణి భ
ర్తను నీతండొకరుండ నాఁ జను
మహత్త్వ ప్తిన్ గవిబ్రహ్మగా
వినుతింతుం గవి తిక్కయజ్వ నభి
లోర్వీ దేవతాభ్యర్చితున్.

ఈ పద్య మెఱ్ఱాప్రగ్గడది. తిక్కనను కవిగా స్తుతించిన పద్య మిది. ఎఱ్ఱాప్రెగ్గడ తిక్కనను ధర్మాద్వైతము వ్రాసినాడు కావున కవి యనలేదు— మనుమసిద్ధి రాజ్యాంగ తంత్రము నడపినవాడు గావున కవియనలేదు. అన్యదుర్లభమైన కవితాసృష్టి కలవాడు గావున కవి యన్నాడు. సహజమైన విమర్శనతీ రిట్లుండవలెను. కవిని విమర్శించునపుడు విమర్శకుడు ప్రధానముగా పేర్కొన వలసినది ఆయన కవితాశక్తి. అంతేకాని ఆయనలోని రాజకీయ తంత్రము—తాత్త్విక దార్శనికత్వము—మఱేవో ఇతర విషయములు కావు. ఇవియున్నవి కావున కవియనుట విమర్శయగునా? ఆధునిక విమర్శలో ఎక్కువభాగ మీదోషముచే దూషితమై యున్నది. కవిని కవితాశక్తిని బట్టియే కవిగా నంగీకరింపవలయును. గురజాడ అప్పారావుగారు కవితాదృష్ట్యా పరిశీలించినచో నిలువరు. ఆయన యభిప్రాయములు బాగుండవని నేను విమర్శించను. ఆయన సంఘసంస్కార ప్రియుడని నేను నిందింపను. ఆయన అకవియని మాత్రము వివరింతును. ఆంగ్లప్రభుత్వమువలన ఆంగ్లభాషవలన దేశములో నేర్పడిన కృతక సమాజముయొక్క అభిప్రాయములను కప్పుకొని కవియనిపించుకొనుటకు ప్రయత్నించిన యొక వ్యక్తి-అంతే. అంతకంటె మించి ఆయననుగూర్చి చెప్పరాదు.

ఈకాలమున వీరినిగూర్చిన పొగడ్తలుమిన్నుముట్టుచున్నవి. గురజాడ వాల్మీకి యనియు ఆధునిక కవిత్వమునకు యుగకర్త అనియు సభావేదికలనుండి వివిధ పత్రికలనుండి విపరీత సిద్ధాంతములు బయలుదేరినవి. లోకములో నతనిపై మనకున్న విశ్వాసముమబట్టి అతనికి మనకు మున్న పః

చయమునుబట్టి - అతని భావములలో గల మన యభిప్రాయ సామ్యమునుబట్టి అతనిని ఆకాశముమీది కెత్తుకొన వచ్చును. కాని సారస్వతముయొక్క ఉచ్ఛస్థితి దిగలాగనంతవఱకు చేసికొనవలెను. అట్లు చేయనిచో మన సారస్వతము అవ ప్రథల పాలగును. - అపమార్గములబడి పోవును. - అనర్థుల కర్హత కలిగించును.

ఈయనను వాల్మీకితో పోలికకు తీసికొనివచ్చుట చాల యపచారము. వాల్మీకి కవిలోకమునకు చూపినత్రోవ గొప్పది. అలంకారము - పలుకుబడి - రచనా శిల్పము - భావముల యెత్తుగడలు - వీని యన్నింటికి ఆయన మార్గదర్శకుడు. గురజాడ అప్పారావుగారు రచనా శైథిల్యమునకు, అస్ఫుటమైన భావవ్యక్తీకరణమునకు పథిప్రదర్శకుడు. ఈయనకు నాయనకు సామ్యమెందులో? ఆయన కొన్ని సాహిత్య ప్రక్రియలకు దారి జూపినాడు. ఈయన కొంత సాహిత్యమునకు బిగువు త్రెంచుటకు ప్రయత్నించినాడు. ఆయన దానికి ప్రారంభకుడు - ఈయన దీనికి; ఇంతమాత్రమే సామ్యము.

ఇక ఈయన ఆధునిక కవిత్వమునకు యుగకర్త-అను వంశమును బరిశీలింతము. ఆధునిక కవిత్వమునకు కావలసిన హంగులు బాణీలు, భావములు - దీని పాళ్ళెక్కువగా నున్న కవు లిద్దఱు. ఒకాయన కృష్ణశాస్త్రి. రెండవయాయన శ్రీశ్రీ. వీరిద్దఱు ప్రతిభావంతులు. ఒకరి ప్రతిభ మాధుర్య గుణము నాశ్రయించి శబ్దములు పోహళించుటలో నున్నది. రెండవ యాయన ప్రతిభ శబ్దవిన్యాస తీవ్రతపై నాధారపడి యున్నది. కృష్ణశాస్త్రి మధురముగా మెత్తగా వ్రాయగలడు. అనంతమైన రచనా శిల్పములో దాని స్థాన మెంతదైనను దానితో మనకు ప్రమేయము లేదు. ఒక విధముగా మెత్తని మాటలలో భావమును కూర్చు శక్తి భగవంతుడాయన కిచ్చినాడు. అది యాయన ప్రత్యేకత. అది గురజాడ అప్పారావుగారిలో లేదు. ఈయనలో సూచనా మాత్రముగా కనిపించిన ఆ మెత్తదనమే కృష్ణశాస్త్రిలో పరిపూర్ణత చెంది యుండకూడదా? అని పల్కువా రుండవచ్చును. అసలు గురజాడ అప్పారావుగారి రచనలో మెత్తదన మున్నదా యని ప్రశ్న. ఆయనలో కనిపించునది రచయితకు రచనా ప్రథమావస్థలో, భావములు శబ్దముల కందనిస్థితిలో, ఏర్పడెడి రచనా శైథిల్యము. అది మెత్తదనము కాదు.

ఇక శ్రీశ్రీ రచనాపద్ధతికి గురజాడ అప్పారావుగారి రచనా పద్ధతికి సంబంధమే లేదు. శ్రీశ్రీ లోని అతివాస్తవిక ధోరణులకు - విలక్షణభావ విన్యాసములకు అప్పారావుగారి రచనలు మూలములే కావు. అప్పారావుగారు ఛందస్సు మార్చిరి. శ్రీ శ్రీ కృష్ణశాస్త్రిలు కూడ ఛందస్సును మార్చిరి. కావున ఈ విషయమున అప్పారావుగారు ఆధునిక సాహిత్యమునకు యుగకర్తయనువా రుందురేమో? ఆ లెక్కకు వచ్చినచో ఆధునిక కవులకు ఒక గురజాడ అప్పారావుగారేమిటి నన్నయభట్టే మార్గదర్శి యని చెప్ప వచ్చును. మొట్టమొదట ఆయనేకదా మనకు ఛందోభిక్ష పెట్టినది. యుగకర్త యనవానిలో తరువాతి కవులలో పరిపూర్ణత నొందిన అంశములకు పునాదులుండవలెను. ఆధునిక కవిత్వమునకు పునాదులు అప్పారావుగారి రచనలలో లేవు. ఈయనను ఆధునిక కవిత్వమునకు యుగకర్త యనుట ఆలోచించని మాట.

ఇక ఈయన ఖండకావ్యము "ముత్యాల సరములు" అను దానిని పరిశీలింతము. ఎక్కడి కక్కడకు భావము మూర్తి కట్టి చమత్కార మగుట వేఱు. భావముల కూర్పులో వస్తువు నున్మీలనము చేయుట వేఱు. కవి నిజాయితీ బైటపడునది ఈ రెండవ రచనలోనే. మొదటి రచన చేయుటకు ప్రతిభ యేకొంచెమైనను చాలును. రచయిత చేయితిరిగినవా డగుట ప్రధానము. ఈ రెండవ రచనకు నెంతయేని ప్రతిభ కావలయును.

గురజాడ అప్పారావుగారి ముత్యాలసరము లన్న శీర్షికను చూడుడు—

లోకమందలి మంచిచెడుగులు లోకమెఱుగుదురా

అన్న సత్యమును వివరించుటకు వ్రాయబడినదీ శీర్షిక. దానికి రచయిత చేసిన భావముల కూర్పు చూడుడు. ఒక నాయకుడు కార్యార్థమై పట్టణమున కేగినాడు. అక్కడ సంఘసంస్కరణ ప్రవీణుల సంగతిని మెలగి ఒకనాటి వేకువకు నిల్లు చేరినాడు. అప్పటికి ఆకాశమున ధూమకేతు వుదయించి యున్నది. అదిగో కాము బాణమని, అమాయకమైన పూర్వాచార పరాయణురాలైన ప్రేయసిని నిద్దుర లేపినాడు. ప్రేయసి నిద్దుర లేచినది. ఆకాశమునుగాని నాయకునిగాని చూడక కురులు సరులు కుదురుచేయుచు నోర మోము పెట్టినది. అనగా కోపగించుకొన్నదని రచయిత తాత్పర్యము. ఆ కోపమెందుకు వచ్చినది? ప్రియుడు సంఘ సంస్కరణ ప్రవీణుల సంగతిని మెలగినాడని కోపమా? లేక ప్రవాసమునుండి వచ్చిన ప్రియుడు తెల్లవారుఝామున కాముబాణం బున్నదని చూపి యుల్లసమాడినందుకు పొలయలుకయా? రెండును కావచ్చును. సంఘసంస్కర్తలలో తిరిగినాడన్న కోపము ప్రణయకోపముగా మారినది. అట్లు మారుటలో ప్రయోజనమేమి? తాను చెప్పదలచుకొన్న పరమార్థమునకు ఇది యేమి ఉపయోగకారి? ప్రయోజన దృష్ట్యా

రచయిత చేసినచో దానిని శిల్పమందురు. అదిలేనిచో గ్రుడ్డివాని చేతి రాయి.

అసలు ఇక్కడ పాఠకునికి శృంగార భావ భ్రాంతి కలుగకుండుటయే మంచిది. అట్లైననే రచయిత యను కొన్న యర్థము కొంతవఱకైన స్ఫుటముగా వ్యక్తమగుటకు వీలున్నది. అక్కడ సంభాషణము నట్లు చేసినట్లు కూర్చనే కూడదు. నాయకుడు మరల ప్రారంభించినాడు.

ధూమకేతువు కేతువనియా
మోము చందురు దలిగి చూడదు
కేతువాయిది వేల్పు లలనల
కేలి వెలి తొగ ప్రేయసీ!

అసలా నాయికకు ధూమకేతు వుదయించినట్లు ఎట్లు తెలిసినది. నాయకుడు కాముబాణం బదిగో చూడుమన్నప్పుడు ఈమె ఆకాశమువైపునకు చూడనేలేదు. ఐనచో ఈమె కెట్లు తెలిసినది? తెలియలేదు. తెలియనపుడు నాయకు డట్లనుటలో చమత్కారము పుట్టునా? అదికాక ధూమకేతువునకు కాము బాణముతోడను వెలితొగతోడను ఔపమ్యము కుదురునా? శ్రీనాథు డెక్కడో "తోక చుక్కల బోలు దృక్కోయజములు" అని యన్నట్లు గుర్తు. అక్కడ యౌపమ్యము పద్ధతి వేఱు. తరువాత నాయకుడు తోక చుక్క వచ్చిన చెఱుపు చేయుననుట మూఢవిశ్వాసమని సుదీర్ఘముగా చెప్పి మధ్యలో వర్షములెల్ల నొకటి యనెడి యభిప్రాయమును వెల్లడించి తెల్లవార్చినాడు. తోకచుక్క యదృశ్యమైనది. లోకములో మంచిగాని చెడుగాని లోకుల కెట్లు తెలియునని పర్యవసానార్థము. నాయికా నాయకుల ప్రణయ కోప కోలాహలము పెట్టకుండ నాయిక ధూమకేతువుల వలన చెఱుపువచ్చునని చెప్పుట నాయకుడు దానికి ప్రతి సమాధానముగా నీ యుపన్యాసము నిచ్చినచో కొంతవఱకు అనుకొన్న యర్థము వ్యక్తమగును. నాయిక అడగనులేదు పెట్టనూలేదు. అనవసరముగ ఈ నాయకుని దీర్ఘోపన్యాసమేమిటి?

ధూమకేతువులు చెడును గల్గించునని భార్య యెప్పుడైనను పూర్వము ప్రసంగవశాత్తు అన్నదియో అనుకొందము. అప్పుడు చెడురాక మనకేమి తెలియునని నాయకు డనుట బాగుగనేయున్నది. ఆ నాయకుడు ధూమకేతువును దూర బంధువని డెబ్బది యెనుబది యేండ్ల కొకసారి వచ్చునని సంఘసంస్కరణ ప్రయాణ పతాకయని ఒక వైపున చెప్పుచు మంచిరాకడ కూడ లోక మెఱుగుదురా? అని ప్రశ్నించవచ్చునా? ఐనచో తాను దూర బంధువని వేల్పు లలనల కేలి వెలి తొగయని సంఘసంస్కరణ పతాకయని చెప్పుకొన్న మంచి తనకెట్లు తెలిసినదని ప్రశ్నించరా? దీనితోపాటు వేఱొకబాధ వచ్చినది. ధూమకేతువుల వలన నష్టములు జరుగుననునది లోకరూఢమైన విషయము. రచయిత ఆధూమకేతువునే "తలతునేనిది సంఘసంస్కరణ ప్రయాణ పతాకగాన్" అని చెప్పినాడు. దీనివలన సంఘ సంస్కరణమే అనర్థదాయకమను భావము లోకమునకు స్ఫురింపదా? ఏ యభిప్రాయము చెప్పుకొనదలచినను రచయిత చెప్పుకొనవచ్చును లోకరూఢి వలన తాను చెప్పబోయెడి భావమునకు బాధకలుగునేమోయని ఒకసారి ఆలోచించుకొనవలదా? లేనిచో లోకమునకు దానినుండి విపరీతార్థములు స్ఫురించును గదా!

ఈ శీర్షికను చదువునరికి పాఠకునకు మంచి చెడుగుల రాకడ దేవునికి తెలియును గాని మానవులమైన మనకు తెలియదు — అన్న భావము కొంచెము స్ఫురించునేమో నాకు తెలియదు గాని ప్రధానముగా స్ఫురించునది ఆంగ్లభాష చదువుకొని నాగరికులమనుకొను విద్యావేత్తల పటాటోపము - అమాయకురాండ్రై సంప్రదాయమును పట్టుకొని వ్రేలాడు స్త్రీల పూర్వాచార పరాయణత్వము - వీరిరువురిమధ్య నడచిన లోతులేని లంగరు కుదురని సరస సల్లాపకలాపము. ఈ సంఘటనమును, నీవిషయమును వ్యక్తము చేయుటకు వ్రాయవలెనుగాని "లోకమందలి మంచి చెడుగులు లోకు లెఱుగ"రని చెప్పుట కొఱకుకాదు. ఈరచయిత భావములు కూర్చినచో ఆయన భావించిన అభిప్రాయముకాక వేఱొక భావము స్ఫురించుచున్నది. ఇది రచయిత అశక్తతయే.

ఈ రచయిత ఆంగ్లప్రభుత్వము మన దేశములో బాగుగ నధికారము చలాయించుకాలములో నున్నారు. పరతంత్ర భావములే గాని స్వతంత్రభావములు - జాతీయ సంప్రదాయములు - ఈయనలో నంతగా కనిపించవు. కొన్ని యెడల సంప్రదాయములను వెక్కిరించుటకూడ కలదు. "ఆంగిలేయుల ధర్మరాజ్యం" - "కన్నుగానని వస్తు తత్త్వం గాంచ నేర్పరు లింగిలీజులు" - "చన్నకాలపు చిన్నబుద్ధులు" - "వెఱ్ఱిమొఱ్ఱి పురాణగాథలు" - వీనిని చదివినకొలది జాతీయ భావము కలిగిన మనదేశీయులు చెప్పుచున్నట్లు కనిపించదు. స్వమతప్రచారార్థము మిషనరీలు చెప్పు మాటలవలె కనిపించుచున్నవి. మనలో మూఢ విశ్వాసములు లేవని నేననను. వానిని నాశనము చేయవలసినదే. కాని మార్గమిది కాదు. మూఢ విశ్వాసములను తొలగించుటకు సంప్రదాయములను తిట్ట నవసరములేదు. ఆ మాటకు వచ్చినచో పాశ్చాత్య దేశములలోని మూఢ విశ్వాసములకు పరిమితి

కలదా? రచయిత ఇంగిలీజులను కన్నుగానని వస్తుతత్త్వం గాంచనేర్పరులని యేల స్తుతించినారు? వారిలో మూఢ విశ్వాసములు కొల్లలు.

రచన బాగుండుట వేఱు. కొందఱిలో నుక్తివైచిత్ర్య ముండి రమ్యముగా నుండవచ్చును—కొందఱిలో మాధుర్య గుణ ముండి బాగుండవచ్చును—కొందఱిలో పద్యరచనలో ఎత్తుగడ, కదియనొక్కుట, సరియైన పాళ్ళలో కలిసి హాయి యనిపించవచ్చును—కొందఱిలోని యభిప్రాయములు మన అభిప్రాయములకు సరిపోయి భేష్ అనిపించవచ్చును—ఒకొక్కప్పుడు రచయిత, మనకు నాత్మీయుడై బాగున్న దనిపించవచ్చును—ఈ బాగుండుట వేఱు. ఇది రచయితను గూర్చిన సమగ్రమైన పర్యాలోచన కాదు. రచన యావత్తును భావనామయము చేయగల్గెడి కవితాముద్ర సర్వత్ర భాసించ వలెను. ఈ రచన నూటికి నూరుపాళ్ళు కవిత్వము. ఈ రకపు రచయితలు ఎంత నీరసమైన వస్తువు నందుకొన్నను భావనామయము చేసి రసోన్ముఖము చేయగలరు. పై చెప్పిన రచయితలు అట్లు చేయలేరు. ఎందుకనగా రచనలో కవిత్వపు పాళ్ళు ఎంత పరిమితములో వస్తువులో కూడ అంతే. కొన్ని వస్తువులే—కొన్ని బాణీలే—కొన్ని భావ విన్యాస వైఖరులే—వారి సొత్తులు. ఇట్టి కవులు పదరచనలు చేయవల యును. అట్లు చేసిననే రాణింతురు. పూర్వము మనదేశము లోని పద రచయిత లందఱు ఈ రహస్యము తెలిసినవారే! ఒక్కొకడు ఒక వస్తువునో—ఒక భావమునో తీసికొని తనలో నున్న పరిమితమైన కవితా స్పర్శతోనే ఒక ప్రత్యేకత సంపాదించుకొన్నవాడు. ఈ శ్రేణిలోనివారు మధుర కవులు. వారికి మహాకవిత్వపు లాభముండదు. జంగాల కథలు వ్రాసినవారు—స్త్రీల పాటలు వ్రాసినవారు ఈ శ్రేణి లోనివారు. వీరి రచనలకు ప్రజలలో వ్యాప్తి యెక్కువ. ఎడ్ల రామదాసు కీర్తనలు ఈ విధముగా కీర్తి నొందినవి. వీరి నెవ్వరును మహాకవులని పిలువలేదు. కవు లనుటకు గూడ సందేహించుచున్నారు. గురజాడ అప్పారావుగారు మహాకవి యని పిలువబడుట ఆశ్చర్యము. ఎడ్ల రామదాసు మహాకవి యనిపించుకొన్నప్పుడు గురజాడ అప్పారావుగారు కవిగావచ్చునేమో. వారికిరాని స్థానము గురజాడ అప్పారావుగారికి వచ్చుట ఆంధ్రదేశములో సాహిత్య గౌరవము దిగజారిపోవుట.

కవియైనవాని రచనకును అకవియైన వాని రచనకును ఒకభేద మున్నది. కవియైనవానికి వస్తువు ముందు భావనామయమై గాని రచనగా పరిణమించదు. అకవియైన వానిలో వస్తువు భావనాస్పర్శ లేకుండనే యున్నది యున్నపాళముగా రచన యగుటకు ప్రయత్నించును. గురజాడ అప్పారావుగారి రచన ఈ శ్రేణిలోనిది.

"పట్నమున పదినాళ్లు లుంటిని కార్యవశమున బోయి"—"సంఘ సంస్కరణ ప్రవీణుల సంగతుల మెలగి"—"ఇలుజేరితి నాటి వేకువ చేరి ప్రేయసి నిదుర లేపితి"—"మొన్న పట్టమునందు ప్రాజ్ఞులు మొట్టమొదటిది మెటు ఇది యని పెట్టినారొక విందు జాతుల జేర్చి"—ఈయనలో నీ బాపతు రచన యెక్కువగా నుండి ఇది కవిత్వ మనుటకు ఛందస్సే కారణముగా కనిపించుచున్నది. ఛందస్సుచేత కవిత్వమునకు మెఱుగు రావచ్చును. కాని ప్రధానమైనది ఛందస్సే కాదు. వస్తువును భావనామయము చేసుకొనెడిశక్తి రచయిత కున్నచో ఛందస్సు తీసివేసినను దాని బింకము చెడగూడదు.

> "వడవుల పాలవెల్లి, తెలినవ్వుల వెన్నెలవాక, తేనెలూ
> రెడి మనులేత తేనెపెర, రెమ్మలువైచు విలాసవల్లి."

ఈ పద్యము సౌందరనంద కావ్యములోనిదని గుర్తు. ఉత్తమశ్రేణి కవితా శిల్పమిందు లేకపోవచ్చును. కాని కవితాశక్తి పుష్కలముగా నున్నది. పద్యములోని ఛందస్సును తొలగించినను బింకము చెడిపోదు. రచన భావనామయ మగుటలోనే దీనికి బిగువు వచ్చినది.

ఈయన వ్రాసిన వేఱొక శీర్షికను పర్యాలోకింతము. ఆ శీర్షికపేరు "లవణరాజు కల" ఇది జ్ఞాన వాశిష్ఠములోని లవణోపాఖ్యానము. అక్కడ లవణుడను ఒక మహారాజు గలడు. అతడు హరిశ్చంద్రుని వంశములోనివాడు. చాల ఉత్తముడు. ఒకనా డాయన కొలువులోనికి ఒక యైంద్రజాలికుడు వచ్చెను. ఆయన రాజుగారికి తన విద్య చూపనెంచెను. అందులకు రాజంగీకరించెను. ఆ యింద్రజాలముచే రాజునకొక విచిత్ర స్వప్న సాక్షాత్కృతి జరిగెను. అందులో నారాజు ఒక చండాలాంగనను వివాహమాడి సాంసారిక బాధలు పడెను. చివరి కది యింద్రజాలమని తెలిసికొనెను. చివరకు తాను మోక్షపదవి నందుకొనుటకు వెళ్ళగా మోక్షమున కర్హుడుగాడను నాక్షేపణ వచ్చెను. దానికిది హేతు వాయెను. "భ్రాంతి బొందుటకు—సంసార బంధములలో తగుల్కొనుటకు—మనస్సు కారణము" అను ప్రధాన సత్యమునకు వ్యంజకముగా వ్రాయబడిన దీ కథ. ఆ సత్యము రుచిరీతిగా భాసించుటకు కావలసిన బిగువుబిగువు లీ రచనలో నున్నవి. ఈ రాజు చండాల స్త్రీని పెండ్లాడుట గురజాడ అప్పారావుగారి రచనకు బీజమైనది. దానిని తన సంఘ సంస్కారమున కనువుగా మార్చుటకు ప్రయత్నించిరి. అట్లు చేయుట తగునా? ప్రసిద్ధమైన కథను తన యిష్టము

వచ్చినట్లు మార్చకూడదు. "శేషు మార్గేషు స్వేచ్ఛా వ యోజ్యా". ఒకవేళ రసదృష్ట్యా కొంచెము మార్పు చేయ వచ్చునేమో కాని మన యభిప్రాయముల కనువుగా అసలే మార్చకూడదు. అట్లుచేసినచో ననౌచిత్యము వచ్చును. విభావౌచిత్యము కవి జాగ్రత్తగా పాటించవలయును. రాముడు—ధర్మరాజు—మొదలైన ప్రసిద్ధ నాయకులను తీసికొనివచ్చి ఈ యుగములోని ఆధునిక భావములకు ఆలంబన విభావములుగా చేయుటకంటె అనౌచిత్యము వేఱొకటి యుండదు. లవణ మహారాజు శాంతరసమునకు తగిన ఆలంబన విభావము, అతని నిట్లు మార్చకూడదు.

ఒకవేళ మార్చినను తాననుకొన్న భావములకు పోషకముగా రచన సాగించెనాయని పరిశీలింతము. లవణునివంటి మహారాజు ఒక అందమైన మాలపిల్లనుచూచి వ్యామోహితుడై వర్ణాంతర వివాహములు జరుగవలెనని నిశ్చయించుకొన్నాడని చెప్పుటకంటె మాలలనుభవించెడి హీనస్థితినిచూచి జాలిపడి అది వర్ణాంతర వివాహములవలన తొలగించవచ్చునని నిశ్చయించుకొన్నాడని చెప్పుట రచయిత అనుకొన్న సిద్ధాంతమున కెక్కువ బలము గలిగించును. లవణుడు మాలపిల్లను పెండ్లాడుటలో ఇక్కడ సంఘసంస్కార బీజముకంటె ఇంద్రియ వ్యామోహత్వ మెక్కువ భాసించుచున్నది. అది తా నూహించిన యభిప్రాయమునకే మోసము.

ఈ రచయిత తానొక యర్థమునుంచి రచన చేయును. ఆ రచన వేఱొక విరుద్ధార్థమును తెచ్చిపెట్టును. ఇది అకవియైనవానికి ప్రధాన లక్షణము. ఈయనలో తా ననుకొన్న అర్థమునకు విరుద్ధార్థమును తెప్పించుట యొక కళగా కనిపించుచున్నది. లవణుడు మాలపిల్లనుజూచి వ్యామోహపడి ఆమె దగ్గరనున్న కూటి కడవలోని భోజనమును పెట్టుమని యడిగినాడు, ఆమె పెండ్లియాడినగాని పెట్టనన్నది. లవణుడామెకు నడ్డము పెళ్ళి "యురము నురము గదియ ముద్దుగొనినాడు" అతః పూర్వము చంద్రుడు తాటితోపులలో నున్నాడు. ఈ సంఘటనను చూచి "తాటితోపులు దాటి చంద్రుడు పక్కునను నవ్వెన్" రచయిత ఉద్దేశ్య మీ వర్ణాంతర సంబంధమునకు ప్రకృతికూడ తల యూచినదని చెప్పుట. ఇక్కడ పక్కున నవ్వుటలో అవహేళన భాసించి రచయిత అనుకొన్న యర్థమునకు విరుద్ధార్థమువచ్చుచున్నది. ఈ దోషమునే ఆలంకారికులు విపరీత ధీప్రదమని పేర్కొనిరి. కొన్ని అపసిద్ధాంతములు - కొన్ని విశ్లథములైన రచనలు - కొన్ని స్పష్టముగా వ్యక్తముగాని భావములు - ఇవి, ఈయన రచనా విశిష్టతను వ్యక్తముచేయు సామగ్రి.

"క్రొత్తపాతల మేలి కలయిక క్రొమ్మెఱుంగులు చిమ్మగా" తాను ముత్యాల సరములు వ్రాయుదునని చెప్పుకొనెను. రచనకు క్రొమ్మెఱుంగులు కూర్చునది యాతని ప్రతిభావిశేషముకాని క్రొత్తపాతల మేలి కలయిక కాదు. కావ్యార్థము అనంతమైనది. వేయిమంది బృహస్పతులు ప్రయత్నించినను కావ్యార్థమునకు విరామము కలుగదు. రచయిత రసమునో ధ్వనినో ఆశ్రయించి దానికి నవీనత్వమును దెచ్చునని లాక్షణికులు నుడివినారు· "దృష్టపూర్వా అపిహ్యర్థా కావ్యే రసపరిగ్రహాత్ । సర్వే నవా ఇవా భాంతి మధు మాస ఇవ ద్రుమాః" అంతేకాని రచనకు క్రొత్తపాతలుకలిపి వ్రాసిన నవ్యత రాదు. మీదుమిక్కిలి క్రొత్తపాతల మేళవింపులో రచయిత జాగ్రత్త తీసికొననిచో కృత్రిమత్వమును జిమ్ము ప్రమాదమున్నది. ఆ ప్రమాదము చాలవఱకు నీయన రచనకు పట్టినదనియే నా యభిప్రాయము.

"దండినృప ఒక గండుగారడి కలదు వినుమనియెన్" అసలు ప్రాసనొక విలక్షణముగా పొదుగుటలోనే ఈ బాపతు రచనలు చమత్కారమునకు తిరుగును. తెలుగు కవిత్వములో రచయిత ఎంతశక్తి గలవాడైనది అతడు యతిప్రాసలను పొదిగిన పద్ధతిని బట్టియే తెలిసికొనవచ్చును. దండి యని నృపునకు విశేషణము. గండు అని గారడికి విశేషణము. ఈ విశేషణములు సహజముగా లేవు. ప్రాసకొఱకు రచయిత ప్రయాసపడి కూర్చినట్లు కనిపించుచున్నవి. అవి భావమును రుచితిగా స్ఫురించనీయుటలేదు. భావవిన్యాసములో నొక్కొక్క రచయితలో నొకొక్క విశిష్టత యుండును. ఆవిశిష్టత వెంటనే స్ఫురించుటకు యతి ప్రాసలే ప్రథమ సోపానములు. తెలుగు కవులలో యతి ప్రాసల దగ్గర నొక విలక్షణముగా విఱిగి అందము వచ్చును. అది పద్య రచనలోని రహస్యము.

"పైవడి పోయెగాక ధృత
　　రాష్ట్రుడు గన్నదియేమి? యాసభన్
దావలదన్న కిడగుగదా?
　　పతిలేదన బద్ధ కాంత నే
డీవిధి నీవు జూడ పతి యే దైఱ
　　నొప్పె పతుల్విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు
　　లేర్పడిరిట్ల పతిత్వ దీనతన్."

ఈ పద్యము తిక్కన సోమయాజిది. ప్రతి యతి స్థానము ఒక విశిష్టమైన అర్థచ్ఛాయనో—అర్థాంతరమునో స్ఫురించు

చనే యున్నది. అదేగాదు. అక్షరముల కూర్పునుండి గణములు విఱుగుటవఱకు కవి చేసిన శిల్పము భాసించుచున్నది. గురజాడ అప్పారావుగారి రచనలోని దండి—గండు అను విశేషణములు మాత్రము భావమును కదలనీయకుండ పట్టుకొని పీకె నులిమివేయుచున్నవి. ఆ భావమును పైకి పొక్కనీయుటలేదు.

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"
"తిండి గలిగితె కండ గలదోయ్
కండగలవాడేను మనిషోయ్"

ఈ రచనలో కవిత్వపు జీర యున్నదా? లేదు. మానవత్వమలవరచుకొనవలెననియు, బలము గూర్చుకొని యాత్మసంరక్షణము చేసికొనవలెననియు దేశమును ప్రబోధించు ప్రయత్న మిందు కొంతవఱకు గోచరించుచున్నది. దానికి కవితాముద్ర పడలేదు. అభ్యుదయకరమైన భావములలో దీనికి స్థానమున్నదేమో నాకు తెలియదుకాని కవిత్వములో లేదు. ఈ సూత్రములకు కవితాముద్ర కొట్టుట అంతంత మాత్రపు కవులచేతకాదు. ఎంతో ప్రతిభావైభవ మున్ననేకాని అది సాధ్యముకాదు. ఇది కవిత్వము క్రిందికి రాదు. "ఆరోగ్యమే మహాభాగ్యము" "పక్షి యెగురును." "దేహపరిశ్రమ చేయుము. "ఈ వాక్యములలో గవితాముద్ర యున్నచో ఆ రచనలలోను కలదని చెప్పవచ్చును. పదిమంది నోళ్ళలో నలుగవచ్చును. దానికేమి? అది వేఱు. కవితాలక్షణము పట్టుట వేఱు.

"ఆకులందున నణగి మణగి,
కవిత కోయిల పల్కవలెనోయ్"

ఇక్కడ కవిత యనెడి కోయిలయని రూపకమా? లేక కవితను కోయిల పల్కవలె ననెడి అతిశయోక్తియా? రూపకము కానప్పుడు ఖండబిందు వుండవలెను. లేనిచో నర్థము చేసుకొనుటలో సందేహము గల్గుచున్నది. గురజాడ అప్పారావుగారు అరసున్నలు పెట్టలేదని నేను విమర్శించుటలేదు. ఇట్టి సందిగ్ధములైన ప్రదేశములయం దైనను పాఠకుల భ్రాంతి దొలగించుటకైనను వాడవలసినది. ఇక్కడ రచయిత అభిప్రాయము కోయిల ఆకులలో నణగి మణగి కూసినటుల కవిగూడ సంఘములో నొకడై వ్రాయవలయునని. కోయిల ఆకులలో నణగి మణగి యుండదు. ఒకవేళ యణగిమణగి యుండు ననుకొన్నను కవిని సంఘములో నణగిమణగి యుండు మనగూడదు. అప్పుడు భావస్వాతంత్ర్య ముండదు. సంఘములో నొకడై యని రచయిత అభిప్రాయ మైనపుడు "కలిసి మెలిసి" యనియో, మఱేదో యుండవలయును గాని యణగిమణగి యనరాదు. ఇట్లన్నచో వేఱొక యర్థము వచ్చుచున్నది.

"వలుకులన్ విని దేశమం దభిమానములు
మొలకెత్తవలెనోయ్"

ఇందులో కవితా ప్రయోజనము నిర్దేశింపబడినది. కవిత్వానికి ముఖ్యప్రయోజనము సద్యః పరనిర్వృతి. అభిమానములు మొలకెత్తుట సామాన్య విషయము. ఈ మాత్రమునకే యుపన్యాసమైనను జాలును. కవిత్వమువఱకు పోనక్కరలేదు. ప్రజల నుద్రేకపఱచెడి భావములు-దేశభక్తిని ప్రేరేచెడి యూహలు - అందఱకు సులభముగా నర్థమగు భాష - ఇవి కలిగినది కవిత్వమనియు, మిగిలినది కవిత్వము కాదనియు నాధునికులలో నొక యపసిద్ధాంతము ప్రబలియున్నది. ఈ సిద్ధాంతము లున్నంతవఱకు నుత్తమరచనలు తెలుగుదేశమున రావు.

"తలతు నేనిది సంఘసంస్కరణ ప్రయాణ పతాకగన్"

ఇది యుత్ప్రేక్ష-రచయిత భావనా బలమునకు గీటురాయి యుత్ప్రేక్షాలంకారమే. స్వభావోక్తిలో రచయిత పరిశీలనా పాటవము గోచరించునట్లు ఉత్ప్రేక్షలో రచయిత భావనా వైభవము గోచరించును. ఆయుత్ప్రేక్ష వాడుటలోనే రచయిత శక్తి తెలియును. ఉత్ప్రేక్షాలంకారమున సంభావన యుండును. ఇందు సంభావన యున్నది. కాని అలంకారత్వమే లేదు. ఉత్ప్రేక్ష ముఖ్యముగా బుద్ధిని చమత్కరించును. ఏ అలంకారమైనను చమత్కారమున్నప్పుడే యలంకారత్వమును పొందును. కాని లక్షణము పట్టించినంతమాత్రమున గాదు. ఇక్కడ ఉపమేయము ధూమకేతువు. ఉపమానము సంఘసంస్కరణ ప్రయాణ పతాక. ఇట్లు సంభావించుటలో లోకప్రసిద్ధిగాని కవిసమయప్రసిద్ధిగాని లేదు. చమత్కారమంతకంటె లేదు. ఉన్నది రచయిత దానిని తన యుద్యమములో పతాకగా నూహించుట. ఇం దుపమానము రచయిత స్వార్థపరత్వమును వ్యక్తము జేయుచు నలంకారత్వమును వీడుచున్నది.

"మేలిమి బంగరు మెలతల్లారా
కలువలకన్నుల కన్నెల్లారా
తల్లులుగన్నా పిల్లల్లారా
వినరమ్మా మీ రీ కథను."

ఇట్టివి రమ్యముగా నున్నట్లు కనిపించుటకు కారణము పూర్వపు బాణీ ననుసరించుటయే. ఒక్కొక్కచో ననుప్రాసము వాని చమత్కరించుటయు గలదు. ఈయనలో గవిత్వపు జీర యున్నదన్నచో నీ క్రింది పాదములవంటి రెండుమూడు పాదములలో నున్నదనవచ్చును.

"అంతపట్టం రాజా ఎదురై
        కన్నెసొగసుకు కిన్నుచెదరై
మరునివాడికి గుండె బెదరై
        ఇట్లు తలపోసెన్."
"అంత చెవులకు దవ్వుదవ్వుల
        వింతగానం బొకటి సోకెను
సోకినంతనె పూర్వవాసన
        పిలచినట్లాయెన్."

అక్కడక్కడ ఇట్టి రచనా చమత్కారములు కనుపించు చున్నవి. అంతమాత్రముచేత నిది కవిత్వమనుటకు వీలు లేదు. ఒక గ్రంథమును వ్రాసినవు డెంత స్వల్పమైన రచయితకైనను కొన్ని చమత్కారములు దొరలకపోవు. ఆ కొన్ని చమత్కారములు చూపి యిది యుత్తమ కవితయని నిర్ణయించకూడదు. రచన సర్వత్ర కవితాముద్ర భాసించు చున్నదా యని వివేచన జేయవలెను.

అధునిక భావుకులలో వేతొక తెగవారున్నారు. వారు అప్పారావుగారి నిట్లు విమర్శించనే కూడదందురు. ఆయన యభిప్రాయముల కనువుగా విమర్శించవలె నందురు. ఆధునిక సాహిత్యములో జరుగు భాషావ్యభిచారమును కప్పుకొనుట కిది యొక సాకు. నేనాయనను యథాముఖీనముగనే విమర్శించితిని. పూర్వము పురాణములు ప్రబంధము లున్నవి. నే డవి లేవు. పాశ్చాత్యభావ విలసితములైన లఘు కావ్యము లున్నవి. పురాణప్రబంధలక్షణము లిందు లేవని నేను విమర్శించినచో గొంతవఱకు వారి యభిప్రాయమునకు గుఱియగుదును. ఇందులో నేను విమర్శించినది రచయిత శక్తిని. ప్రతిభాశక్తి యేయుగమునందైనను కవియైనవాని కుండవలసినదే. ఆ ప్రతిభయున్నచో మిగిలిన దోషము లన్నియు గణనకురావు. అది లేనిచో నెన్ని గుణము లున్నను భాసించవు.

ఈ రచయితయొక్క కన్యాశుల్క నాటకమునుగూర్చి మరొకప్పుడు వ్రాయుదును. ఈయనను నాధునిక సాహిత్యమునకు యుగపురుషుడని— మహాకవియని జనులు విశ్వసించు చున్నారు. ఈయన రచనలు చూచినపుడు నాకా విశ్వాసము మూఢ విశ్వాస మనిపించినది. రచయిత యభిప్రాయములలోని మంచి చెడుగులతో నాకు ప్రమేయములేదు. ఈ రచయితలో కవికి కావలసిన ప్రతిభయేలేదు. ఆధునికులకు మరెందులోనైన యుగపురుషుడు కావచ్చునేమోకాని నాకు తెలిసినంతవరకు సాహిత్యమునకుకాదు. ఆధునిక సాహిత్యమున బది రచనా ప్రక్రియలు పుట్టినవనుకొన్నచో నందు నిలువదగినవి మూడో-నాల్గో, ఆ మూడు నాల్గింట వీయనకు స్థానములేదు. ఆధునిక సాహిత్యమున కొంత గుణమున్నది. కొంత దోషమును గలదు.

ఎట్లు చూచినను వీయనను ఆధునిక సాహిత్యమునకు యుగపురుషుడనరాదు.

## కుందుర్తి | వీథిమానిసీ

నిను వేగించును నిత్యదుఃఖమను వహ్నిజ్వాల, తత్తాపసం
జనితంబైన మహానుభూతి యొక దాచ్ఛాదంబుగా నీవు సా
గిన త్రోవల్ జగతీ చరిత్రగతి సాగెన్ క్రొత్త యధ్యాయమై
మును లేకున్నది, నేడు రాని దొక డొప్పున్ నీ మహాలక్ష్యమై.

అపుడే నేననుకొంటి నీ యెడదలో నన్యాయపుం జిచ్చు, లో
కపు జిచ్చై దహియించు నంచు, కడుపుం గాలంగ నెన్నాళ్లు ముం
డ్ల పథంబందున నీవు పోదు మరి యెన్నాళ్ళీమహాయాత్ర, అ
గ్ని పరీక్షంబలె నిల్చి గుండియల మండించున్ నినున్ లోకమున్.

ఎటు నీవాడనువాడు లేడనుచుగానీ, నిత్యదారిద్ర్య దు
ర్ఘటమౌ జీవిక మోయలేని బరువై గానీ, నిరుత్సాహ మం
దుట నీజాతికి చేతకానితనమందున్ ; వర్తమానంపు జీ
కటిలో నేగుము వెన్నెలై పరచు నాగామిస్ఫురన్మూర్తివై.

సకలమ్మొక్క కుటుంబమైన జగతీ సామ్రాజ్య చైతన్య దీ
పిక కేలంగొని యున్న నీ చనిన త్రోవే మాకునుంద్రోవ ; ముం
దుకు పోసాచిన నీ పురోగమన భానుస్వచ్ఛ దీర్ఘాంశు మా
లిక లూతం గొని చీకటిం గడతు మోలిన్ మేము మార్గంబునన్.

నీవు సామాన్య వీథిమానిసివి ; తెన్ను
కవిత చూచిన క్రొత్త వెల్గువు......

# అరుణ | మంజుశ్రీ

నేను పరీక్ష కాలేదు. నా ఆశలు కూలిపోయాయి. క్షుభిత మైన నా మనస్సుకి ఊరట కలిగించుకునేందుకు అసంగతాలైన ఆలోచనలతో రోడ్డంట నడుస్తున్నాను. ఈ పరీక్ష నేను తప్పటానికి కారణం పై అధికారులకి నామీద సదభిప్రాయం లేకపోవడం. సదభిప్రాయమంటే ఇక్కడర్థం, వీళ్ళకు నామీద యేమిటో పగ ఉన్నదనీ, నేను బాగుపడటం చూడ లేకనే అవిన్నీ చెప్పుకున్నాను. ఆఫీసులో మధ్యాహ్నం తెలిసింది ఈ విషయం. చాలామంది పరామర్శించిపోయారు. కాని ఇంతమందిలో నిజమైన సానుభూతి యెవరికో, యెవరికి లేదో కనుక్కోలేను కదా. ఏదియెలా నైతేనేం నాకు ప్రమోషన్ రావడం మళ్ళీ ఇంకొక్క సంవత్సరం వాయిదా పడిపోయింది. అంటే కొద్దిరోజులుగా నేను కన్న కలలన్నీ కరగిపోయినట్లే కదా—ఇంకొక బాధాకరమైన విషయ మేమిటంటే ఆఫీసులో అందరూ నావేపు వింతగా చూస్తున్నారు. వింత అంటే కొత్తగా అని నా అర్థం. ఇద్దరు ఆడ గుమాస్తాలని మధ్యపెట్టుకుని ఆనందంగా నవ్వుతూ పేలుతూ ఉన్నారు. చాలా ఖుషీగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ ఆడ పిల్లలిద్దరూ కొత్తగా చేరారు ఆఫీసులో. ఉద్యోగం ఇంకా కొత్త. అవును మరి రోజూ వొక కొత్త అనుభూతి కలగ వచ్చు వాళ్ళకు. పని లేకపోయినా నవ్వుకుంటూ, కళ్ళు తిప్పుకుంటూ, దొంగవేషాలతో కాలక్షేపాలు చేస్తున్నారు.

నాకు వాళ్ళకు చెపుదామని వుంది.

ఇలానే ఆఫీసుల్లో కొన్నాళ్ళు ఉద్యోగాలు చేశారా, మీకు సరైన కాలం రాకముందే కళ్ళు లోతుకు పోతాయి. బుగ్గలు పీక్కుపోతాయి, అక్కడక్కడ తల నెరుస్తుంది అని.

కాని నే నెలా చెబుతాను. అందుకే చెప్పలేదు.

ఏమి వాళ్ళు విరుచుకుంటారో - ఏమి చిరునవ్వులు చిందిస్తారో - రోడ్డంట నడుస్తున్న నాకు అమిత విసుగ్గా వుంది.

చలికాలపు సాయంకాలం నా మనసుకి వూరట కలిగించటం లేదు.

ఇంటికి చేరుకున్నాను.

వీధి చావడిలో అరుణ చామంతిపూలు లెక్కపెట్టిస్తున్నది. హాలులో కుర్చీలో కూర్చున్నాను. ఆవిడ వచ్చి 'చిల్లర' అన్నది. నాకు చిరాకెత్తుకొచ్చింది.

"నేను వస్తానని తీసుకుంటున్నావా. నన్నడుగుతావేం" అన్నాను విసుగ్గా.

ఆమె సమాధానం చెప్పకుండా వాడికి డబ్బులిచ్చి పంపి వేసింది. అలకవచ్చింది కాబోలు ఆమెకు. కాఫీ కప్పు తెచ్చి ముందు బెట్టింది వొక్కమాటా పలుకూ లేక. నాకూ అంత గానే వుంది అలానే వొక అరగంట కూచున్నాను.

తరువాత లేచి నా ఆఫీసురూములోకి పోయినాను.

క్షణంలో నాకు పట్టలేనంత కోపం వచ్చింది.

ఆఫీసులో పనితెమలక అప్పుడప్పుడు ఫైళ్ళు నేను ఇంటికి పట్టుకొచ్చుకుంటుంటాను. రాత్రిళ్ళుకూడా పని చేస్తుంటాను అప్పుడప్పుడు. నా టేబిలుమీద విప్పివుంచి నేను వ్రాసుకున్న తెల్లకాగితాలనిండా ఎఱ్ఱసిరా, నల్లసిరా కిలగాపులగంగా చిన్న కాలవల్లా వున్నాయి.

క్రిందికి చూశాను. చాలాభాగం నేలమీదకూడా బండల నిండా మరకల మరకల రూపంలో సిరా ప్రత్యక్షమైంది. ఒక్క చుక్కకూడా సిరాబుడ్లలో సిరా మిగలలేదు. ఆ బీభత్సం చూచేసరికే పట్టలేని కోపం వచ్చింది.

ఇంకా చూద్దునుగదా వొక బారెడు పొడుగు నవారుపట్ట వొక చివర కుర్చీ కోడుకి కట్టివున్నది. ఆ నవారుపట్ట రెండో చివర వొక తెల్లటి చిన్న కుక్కపిల్ల మెడకు కట్టబడి వుంది. అది బుద్ధిమంతురాలిలాగా అరమూతల కళ్ళతో ఆనందాన్ని అనుభవిస్తూ వున్నది. దాని వొంటిమీద ఎఱ్ఱటి నల్లటి సిరాగుర్తులు కప్పించాయి.

దాన్ని గొంతు పిసుకుదామన్నంత కోపం వచ్చింది.

అయితే అది టేబిలుమీదికి ఎవరైనా తీసుకొనివస్తేనే తప్ప రాలేదుకదా అని సరిపెట్టుకున్నాను.

ఒక్క అంగలో వంటింటి గడపకూడా దాటేశాను.

ఆవిడ ముందు పెద్ద అద్దం పెట్టుకుని తలలో తురుము కున్న చామంతి పూవుల్ని తనివితీరా చూసుకుంటున్నది. కొద్దిదూరంలో కాఫీ కప్పునిండా కాఫీవుండి పొగలు పొగలతో యెవరికోసమో యెదురు చూస్తున్నది.

"ఇదిగో" అన్నాను.

ఆవిడ వొక్కసారిగా వులిక్కిపడినట్లు తలెత్తి నాకేసి చూసి చిరాకుతో "యేం?" అన్నది.

నాకు అరికాలిమంట నెత్తికెక్కింది.

"నా టేబిలుమీద..." అంటూవుండగానే రామూ కాళ్ళు చేతులూ కడుక్కొని వస్తున్నాడులావుంది, వంటింట్లోకి వచ్చేశాడు. కాఫీకప్పు అందుకోబోతుండగా చప్పున నాదృష్టి వాడి మీద పడింది.

ఆ ఎఱ్ఱటి, నల్లటి సిరామరకలు వాడి చొక్కాపైనా, లాగుపైనా ఇక్కడకూడా నాకు ప్రత్యక్షమైనాయి.

చేతులు కడుక్కున్నప్పటికీ ఇంకా ఆ మరకలు పోలేదు.

'రామూ'— అన్నాను యెంతో కోపంతో.

వాడు పెదవులవద్ద పెట్టుకోబోతున్న కాఫీకప్పు నేలమీదకు జారవిడిచి వణికిపోయినాడు.

ఒక్కసారిగా నాలోవున్న హితాహిత జ్ఞానం యావత్తూ నశించి పోయింది. వాడి దగ్గరగా వెళ్ళి చెవి పట్టుకొని ముఖం పైకెత్తి చెంప పగిలిపోయేట్లుగా, ఐదువేళ్లూ అంటుకునేట్లుగా, వెంటనే బురబుర పొంగిపోయేట్టుగా బలంకొద్దీ కొట్టాను. అరుణ ఇంతలా వూహించి వుండదు.

లేకపోతే యెప్పుడో అడ్డుపడి ఉండేది.

కత్తి విసరులా వచ్చి వాడిమధ్యా నా మధ్యా నిలబడ్డది. నావేపు తీక్షణంగా చూస్తూ "మతిగాని పోయిందా" అన్నది కర్కశంగా. నాకు మరీకోపం తెప్పించాయి ఆ మాటలు.

ఇద్దరూ కూచుని యేడుస్తుంటే అనవలసిన నాలుగు మాటలూ అని చరచరా గదిలోకిపోయాను. దాని మెడ వొరుసుకుని పోయేట్లుగా అది కుయ్యోమని మొత్తుకుంటుంటే తాడు పట్టుకుని బరబరా లాక్కుపోయి వీధిలో వదిలేసి వచ్చాను ఆ కుక్కపిల్లని. తర్వాత నేనూ ఏమీ ఆలోచన లేకుండా వీధిలోకి నడచిపోయాను. ఎటుపోవటానికీ తోచ లేదు. చిట్టచివరకు పార్కుకిపోయి, ఎవరూ మాటాడకుండా వొక మూలన కూచున్నాను. ఎప్పుడూ లేంది వరసగా ఐదారు సిగరెట్లుదాకా తగలేశాను. నోరు చేదెక్కిపోయింది. కండ్లు మంటలు పుడుతున్నాయి. గుండెల్లో పీరసం వచ్చేసింది.

దూరంగా ఆకాశంమీద ఎఱుపురంగు కనపడ్డది.... క్రమంగా నలుపు రంగుగా మారింది....నా తెల్లటి కాగితాల పైన ఎఱ్ఱ సిరా, నల్ల సిరా మరకలు నాకు గుర్తు వచ్చాయి.

ఆ పార్కు ఊరికి కాస్త దూరంగా వుంటుంది. దాని పక్కనే రైలుకట్ట వుంది.

దూరంగా సిగ్నల్ స్తంభంపైన ఎఱ్ఱదీపం కన్పించింది. ఎఱ్ఱదీపమూ - పచ్చదీపమూ....పచ్చదీపమూ - ఎఱ్ఱదీపమూ.

చీకటి పడిపోయింది. రైలుకూడా వచ్చేస్తుంది. ఆ రైలు యేడున్నరకికాని రాదు.

లేచాను. ఆఫీసులో ఆఫీసరూ, ఇంట్లో అరుణ గుర్తొస్తున్నారు నాకు....నడిచాను.

ఇల్లు చేరుకునేసరికి ఎనిమిదైంది. ఇల్లంతా మూగబోయి వెలవెల బోయినట్లనిపించింది. ఏంలేదు. నా మనసే అలా గుంది. అని సర్ది చెప్పుకున్నాను.

చావడిలోనే వీరయ్య కన్పించాడు. గదిలోకిపోయి లైటు వేసుకుని గుడ్డలు మార్చుకున్నాను. 'అరుణా' అని పిల్చాను బిగ్గరగా. నాపిలుపుకి సమాధానం రాలేదు. పోనీ సమాధానంగా ఆమేనా రాలేదు.

నాకు మళ్ళీ కోప మొచ్చింది. నా టేబిలుమీద బీభత్సం అలానే వుంది. నా గదంతా వికృతంగావుంది. మాసిపోయిన బట్టలూ - కుప్పగా పడివున్న పత్రికలూ, అన్నిటికన్నా ముఖ్యం. టేబిలుమీదా, క్రిందా, సిరామరకలూ, నాకు వుక్రోషం కల్గింప చేశాయి.

నా గది నన్ను వెక్కిరించినట్లుగా అన్పించింది.

వీరయ్యా అని కేక పెట్టాను. వీరయ్య చప్పున వచ్చాడు. "ఈ వాలుకుర్చీ తీసుకెళ్ళి పంచలో వాల్చు" అన్నాను. వీరయ్య దాన్ని మోసుకెళ్ళాడు. కుర్చీలో కూర్చున్నతర్వాత వీరయ్య మెల్లిగా "క్యారియర్ తీసుకొస్తానయ్యా" అన్నాడు డబ్బు లుద్దేశించి.

ఇప్పటికిగాని నాగుండె క్రిందికి జారలేదు.

ఇప్పటికి నాకు వొకవిధమైన భయమూ, తరువాత యేవగింపూ, సంకోచం, వొక్కొక్కటే తమతమ స్థానాలు మార్చుకుంటుంటే యేమనటానికీ పాలుపోలేదు.

నా అవస్థ వాడు కనిపెట్టి "అమ్మగారికి తల నొప్పిగా వుందట. ఒంట్లో యేమీ బాగోలేదు" అన్నాడు.

నాకు జాలి కలగకపోగా యెంతకోపం వచ్చిందంటే ఆ క్యారియర్ వాడు తీసుకొనివస్తే వొక్క మెతుకుకూడా మిగలకుండా మొత్తం తినేయాలన్పించింది. వెంటనే లోపలకు వెళ్ళాను. క్యారియర్ తీసుకొచ్చి వాడికిచ్చాను. డబ్బుకూడా ఇచ్చాను.

ఒక సిగరెట్ ప్యాకెట్టూ, మంచి కిళ్ళీ తీసుకురిరా అని కూడా చెప్పాను. వాడు వెళ్ళిపోయాడు.

నేను పార్కులో కూచుని ఇంతసేపూ ఆలోచించిం దేమిటి? నాక్కనపడుతున్న దృశ్యాలేమిటి? ఒళ్ళు మండుతుందంటే మండదూ మరి!

ఆ టేబిలంతా శుభ్రంచేసి వుంచుతారు. రాగానే అమ్మా, కొడుకూ తప్పుచేసినట్లుగా వొప్పుకుని తీరుతారు అని ఆలో చించుకున్నాను. ఆ లక్షణాలు కనపడకపోగా సత్యాగ్రహానికి పూనుకుంటారేం ?

చచ్చీచెడీ రాసుకున్నదానినిండా సిరా దొర్లిస్తే, రేపు ఆఫీసరు అడిగితే ఎంత సిల్లీగా వుంటుంది ; సిరామరకలను గురించి సంజాయిషీ. నాబాధ వాళ్ళ కర్థంకాదా— అర్థం చేసుకోరా. ప్రయత్నించరా. తలనొప్పిగా వున్నదేం. మరచి పోయాను. పోనీలే వీరయ్య వచ్చిన తర్వాత మళ్ళీ బజారుకు పంపించి అమృతాంజనమో, ఆస్ప్రో బిళ్ళలో తెప్పిస్తాను. చూస్తున్నాను కొద్దిరోజులనుంచి అరుణ ధోరణి నాకు బాగు లేదు.

వీరయ్య వచ్చాడు.

సిగరెట్‌ప్యాకెట్టూ, కిళ్ళీ తీసుకవెళ్ళి టేబిలుమీద పెట్టి వచ్చాను. కారియర్ లోపలకు తీసుకవెళ్ళాను. మధ్యాహ్నం టిఫిన్‌కూడా తీసుకోలేదు. ఆకలిగా వుంది. వీరయ్యని కూర్చునివుండమని చెప్పాను. పీట వాల్చుకుని కంచం పెట్టుకుని కూర్చున్నాను. మళ్ళీ మంచినీళ్ళు పెట్టుకోవటాని కని లేచాను. ఒకసారి కూచోటం, మళ్ళీ యేదో గుర్తువచ్చి లేవటం, చాలాసార్లు లేవాల్సి వచ్చింది. అరుణ వచ్చి చూసి పోయింది.

ఓహో యీమాత్రం చాతకాదనుకుంటున్నది కామోసు!

భోజనాని కుపక్రమించాను.

ఆకలంతా యెటుమాయమైందో మాయమైంది.

ఒకసారి కలుపుకుని తిన్నాను. తిన్నది లెక్కకే రాదన్న ట్లుగా కంచం నిండా యెంతో మిగిలివుంది. ఇంత యెందుకు వడ్డించుకున్నానా అనిపించింది. అయినా పంతానికి రెండు ముద్దలు యెక్కువే తిన్నాను. తిన్నట్లు అనిపించింది. కంచంలో మిగిలిపోయిన వస్తువులే కాకుండా, క్యారియర్ నిండా అన్నీ అలానే వున్నాయి.

క్యారియర్ గిన్నెలకు మాత్రం మూతపెట్టి లేచాను. చావడిలోకి వచ్చి కుర్చీలో కూర్చున్నాను.

ఆశ్వయుజ మాసపు వెన్నెల ఆకాశాన్ని తళతళ లాడి స్తోంది. నిండైన వెన్నెల. పండువెన్నెల కాస్తున్నది. చాళ్ళు చాళ్ళుగా కురుస్తున్నది.

వంటింట్లో ఏదో చప్పుడవుతే వెన్నుతిప్పి చూశాను.

అరుణ లైటు తీసేసి వంటింటి తలుపు గడియవేస్తున్నది.

వీరయ్యని టేబిలుమీద వున్న సిగరెట్ ప్యాకెట్టూ, కిళ్ళీ తెచ్చిపెట్టమన్నాను. వాడు తెచ్చియిచ్చాడు.

అరుణ వచ్చి పంచలో నిలుచుంది.

"వీరయ్యా, బజారుకెళ్ళి వో ఆస్ప్రోబిళ్ళల ప్యాకెట్టూ వో అమృతాంజనం డబ్బీ పట్టుకురా" అన్నాను.

"వద్దులే వీరయ్యా. ఇంటికి వెళ్ళు" అన్నది అరుణ.

వీరయ్య కాసేపు తటపటాయించి "అయ్యా ఒకటడుగు తాను కోపంరాదుకదా ?" అన్నాడు.

"ఎందుకూ" అన్నాను.

"మీ వయస్సెంత ?"

"ముప్పయ్యయిదూ"

వీరయ్య వెళ్ళిపోయాడు. ఎందుకడిగాడో చెప్పలేదు. వీరయ్య ప్రశ్నలోని అంతరార్థాన్ని నేను వూహించలేకుండా వున్నాను. కాసేపు ఆలోచించాను. కాని నాకేమీ తెలిలేదు.

అరుణ ఎప్పుడో వెళ్ళిపోయింది. కిళ్ళీ నములుతూ సిగ రెట్ ముట్టించుకున్నాను. ప్రాణానికి హాయిగావుంది. కొద్దిగా చలి ప్రారంభమైంది. ఎక్కడినుంచో పూలవాసన తేలి వస్తున్నది.

అరుణా అని పిలిచాను. సమాధానం రాలేదు. కాని అరుణవచ్చి పక్కగా నిల్చుంది. మామూలుగానే నాపక్క యెక్కడ ? అని అడిగాను. అరుణ మాటాడకుండా వెళ్ళి పోయింది. పోయేముందు అరుణ ముఖంకేసి వొక్కసారి చూశాను. పీక్కుపోయివుంది. ఈసారికూడా నాతో మాటా డకపోవటం నన్ను కదిల్చిందనే చెప్పాలి. వెనకనే వెళదా మనిపించింది. అయినా అలానే ఆ కుర్చీలో చాలాసేపు కూర్చుండిపోయాను. నా మనసు చల్లబడిపోయింది. పూర్తిగా చల్లబడిపోయింది. ఎందుకో పాపంఅనిపించింది. ఇంతవరకూ రామూని గురించి అనుకోకపోవటం నాకు వింతగానే అనిపిం చింది. ఎలానైనా నేను కాస్త కటికగుండెవాణ్ణి అనిపించింది.

వెన్నెల నా ముఖం మీదకు వచ్చేసింది.

సాయంకాలం దృశ్యాలు వొక్కొక్కటి నా కనులముందర తిరుగుతున్నాయి. నేను ఇంటికి వచ్చేసరికి ఆమె పువ్వులు కొనుక్కుంటుండటం, తిరువాత పువ్వులు పెట్టుకుని అద్దంలో చూసుకోవటం అన్నీ గుర్తువచ్చాయి. నేను అప్పుడు గమ నించలేదు. ఆమె అప్పుడు ఎంతో సంతోషంగానూ వుంది. పాపం, ఇలా అన్నం నీళ్ళూ మానేసి యెందుకు పడుకోవటం?

మా అమ్మ నన్ను అప్పుడప్పుడు కోపంవచ్చినప్పుడు చిన్నతనంలో "ఒరే కోతీ" అని పిలిచేది. దానికి తగ్గట్టుగా నేను కోతిచేష్టలూ చేస్తూనే వుండేవాణ్ణి. నా పేరుకూడా హనుమంతరావే మరి.

ఇవాళ నేను కోతిచేష్టలు చేసినట్లుగా అనిపించింది.

నిజమే నాకు కోపం రావాలసినమాటే. అయితే బాగానే వుంది. కోపం వచ్చింది. అందువల్ల వొరిగిందేమిటి ? జరిగి

పోయిన చెడుపనివలని ఫలితాలు అనుభవించవలసిందేకదా. కోపం దిగమింగుకోగలవాడే నిజమైన మనిషి. కోపం చూపించి చిందులు తొక్కేవాడు నిజంగా కోతే. వాళ్ళిద్దరూ అలా అశోజనం పడుకుంటే నేను సుష్టుగా భోంచేశాను. నాకు ఏ కోశానా వివేకమన్నది లేదు.

పదిగంటలైపోయింది. చలి బాగావుంది బయట. పోయి పక్కమీద పడుకున్నాను. అటూ ఇటూ దొర్లాను. దుప్పటి ముసుగుపెట్టుకున్నాను. కాని నిద్రవచ్చే సూచన కనపడ లేదు. అరుణ యెక్కడ పడుకుందో చూడాలనిపించింది. లేచి కూచున్నాను. నేలమీద జీరాడుతూ చామంతి పువ్వొకటి కన్పించింది. అది నావేపు జాలిగా చూసింది. బయట రోడ్డు మీద వెన్నెల కురుస్తున్నది మంచుతోకలసి.

అరుణ హాలుపక్క గదిలో పడుకున్నది చాప పరచు కొని. మామూలుగా అక్కడ చాపపరచుకుని పడుకోవాలసిన అవసరం యెప్పుడూ కలుగదు. సామాన్లు పడేసుకుందుకు వుపయోగించుకుంటుంటాం ఆ గదిని.

అలా పడుకున్న ఆమెను చూసేసరికి నాకు జాలైంది. ఆమె సందిట్లో 'రామూ' కరుచుకుని పడుకునివున్నాడు. నేను రావటం చూసి ఆమె చప్పున కళ్ళు మూసుకుంది. అది నేను కనిపెట్టగలిగాను. ఆమె తలవద్ద కూచుని నుదురుమీద చెయ్యివేసి చూశాను. ఆమె కళ్ళుతెరచి చూసింది. నా చెయ్యి తీసివేసింది. ఆమె నుదురు మామూలు గానే వుంది. కాని ఆమె కంట్లోమాత్రం నీళ్ళు నిలిచాయి.

"బాగానేవున్నాం. వెళ్ళిపొండి" అన్నది. ఆమె స్వరంలో యేమాత్రమూ మార్దవం లేదు.

"తలనొప్పి తగ్గిందా?" అన్నాను.

"నాకు తలనొప్పి లేదు".

"కొద్దిగా అన్నం తిను లే. నేను కలిపిపెడతానులే...."

"మీకేం శ్రమ అవసరం లేదు" వెటకారం.

"కోపమా—"

మాటాడలేదు. రామూ వొంటిమీద చెయ్యి వెయ్య బోయాను. ఆమె నా చెయ్యిని బలవంతంగా అవతలకు నెట్టి వేసింది.

"కోపంలో యేదో అంటే...."

ఆమె మాటాడలేదు. ఆమె ముఖాన్ని నావేపుకి తిప్పుకో బోయాను.

అసహ్యమైన స్వరంతో "దయయుంచి ఇక్కడినుంచి వెళ్ళిపొండి."

"రామూకి కూడా అన్నం పెట్టలేదా?"

"చాలా తిన్నాడుగా...."

"నాకు వొళ్ళు తెలీనికోపం వచ్చింది. ఇంకెప్పుడూ... "

"మనుషులకే జ్ఞానమనేది అవసరం"

"నాకు తెలుసు. నాముఖంచూడు. చూసిచెప్పు. నామీద కోపమా."

"ముఖం చూడాలంటే అసహ్యం పుడుతోంది."

"ఎందుకూ...."

"కన్నవాళ్ళకి తెలుస్తుంది."

"పీ వొక్కదానివే కన్నావా. " నా కంఠంలోనూ వెట కారం ధ్వనించి వుంటుంది.

రామూని మరీ దగ్గరగా తీసుకుంది. సన్నగా యేడుపు గూడా.

"లే కొద్దిగా అన్నంతిను. తరువాత నన్ను యేమైనా అను...."

"ఎంత ప్రేమ!" ఎంత వెటకారమో ఆ మాటల్లో.

"మీరు వెళ్ళండి." అన్నది. మళ్ళీ "పీడివొళ్ళు వోసారి చూడండి!" అన్నది. చొక్కాయెత్తి పొట్ట చూశాను. మామూలుగానేవుంది. అయితే ఆ మాటమాత్రం నేననలేదు. వాడు మూలిగాడు. ఆమె లేచికూచుని తలవేపునుంచి ఏదో పొట్లంతీసి వాడినోట్లో మందువేసింది. పైన బెడ్‌లైట్ వెలుగు తున్నది. ఆవేశంతో ఆమె రెండుచేతులూ పట్టుకోబోయాను. కాని ఆమె విదిల్చివేసింది. నాకు తెలుసు. ఇక ఆమెను బ్రతిమాలలేను. ఇవాళనుంచికాదు. పదిహేనేళ్ళనుంచీ తెలుసు. నేను లేచి నిలుచున్నాను. రామూ కలవరిస్తున్నాడు. నా కుక్కపిల్లయేదీ....అంటూ. వాణ్ణి జోకొడుతూ ఆమె అలానే కూచున్నది. నేను వచ్చేశాను.

వాణ్ణి తెచ్చి నాదగ్గర పడుకోబెట్టుకొంటేకాని నాకు నిద్ర పట్టేట్టులేదు. కాని నేను అంత ధైర్యం చెయ్యలేను.

అలానే పక్కమీద అటూ ఇటూ దొర్లుతూ గడప సాగాను.

బయట వెన్నెల . చలి. పువ్వులవాసన.... నాకు నిద్ర పట్టటంలేదు....

అరుణ గురించే నా తలపు నిండిపోయింది. చప్పున వీరయ్య అడిగిన ప్రశ్న గుర్తు వచ్చింది. దాంతోపాటే యెన్నెన్నో గుర్తువచ్చాయి.

వాడు అడిగిన ప్రశ్నలోని అంతరార్థం ఇదై వుంటుంది.

జ్ఞాపకాల తెరలని చీల్చిచూస్తే—పదేళ్ళనాటి సంగతి.

* * *

ఆఫీసునుంచి రాగానే అట్టహాసంగా అలంకరించుకుని వచ్చి 'వెళ్దామా మరి' అన్నది అరుణ.

"దేవిగారి సెలవైతే...." అన్నాను.

"అబ్బ! అంతా నా ఆజ్ఞప్రకారమే నడుస్తున్నట్లు...."

"ఏం కాదన్నాను చెప్పు...."

అరుణ కళ్ళు గర్వంతో మెరిసిపోయినయ్.

"మరి బయలుదేరుదాం" అన్నది.

బయలుదేరాం.

సుందర్‌విలాస్ దాటి నడుస్తుంటే అరుణ నా వైపు ప్రశ్నార్థకంగా చూసింది. కాఫీతాగుదామని లోపలకు వెళ్ళాము. అరుణకళ్ళు అందంగా మెరిసిపోతున్నాయి.

కాఫీతాగి బిల్లు చెల్లించుదామని కౌంటర్ దగ్గరకు వచ్చే సరికి వొక దృశ్యం నన్ను విచలితుణ్ణి చేసింది. నేను కొన్ని రోజులుగా అలాటి దృశ్యాలు అరుణకంటబడటం కూడదని, కంటబడకుండా వుండాలని లోపల్లోపల కోరుకుంటున్నాను. అరుణ చూడకుండానే వెళ్ళిపోదామనుకున్నాను. మెట్లు దిగుతున్నాను. దురదృష్టం యెదురు నడచి వచ్చినట్లుగా కృష్ణారావు యెంతో సంతోషంతో వచ్చి నా భుజం చరిచాడు.

అరుణ నా వెనకాల నిలుచుని వుంది.

"ఏమిటోయ్ బొత్తిగా కనపడటం మానేశావు? ఈ మధ్య క్యాంపులు యెక్కువైనాయిలా వుంది?" అన్నాడు.

"వస్తాను మరి, పనుంది బజార్లో" అని తప్పించుకోబోయాను.

కృష్ణారావు యేమిటో అర్థమైనట్లు నవ్వాడు.

అరుణవేపు చూశాను. అరుణ ఆ దృశ్యాన్ని అతిశ్రద్ధగా పరికిస్తోంది. నా హృదయంలో యేదో దిగులైంది. ఆ విషయము నన్ను అడుగుతుంది. మేము నడుస్తున్నాం. అరుణ ముఖంలో యేదో అసంతృప్తి కనపడుతున్నది.

ఆ దృశ్యం మరేం లేదు. ఒక గుడ్డిమనిషి సుందర్ విలాస్ ముందు కూచుని ముష్టి అడుక్కుంటుంది. అద మనిషి. నేను మామూలుగా చూస్తూనేవుంటాను. ఇవాళ కూడా అలానే ఆ మనిషి కూచునుంది. పాతికేళ్ళకంటే యెక్కువుండవు. ఆ మనిషి తన సంతానానికి పాలు కుడుపుతోంది.

అరుణ వేసే ప్రశ్నను నేను ఊహించగలను.

అరుణ అడగనే అడిగింది.

"భగవంతు డెందుకండీ అలాటివాళ్ళకుసంతుయివ్వటం?"

ఒక్కోసారి అరుణను చూస్తే నాకు చిరాకు కలుగుతుంది. అరుణని యేమిటో వెలితి బాధిస్తున్నది. కొద్ది రోజులుగా ఆమె అసంతృప్తితో బాధపడుతోందని నేను లీలగా గ్రహిస్తూనే వున్నాను.

ఒక సంవత్సరంనుంచీ ఆమె నాతో వందపాళ్ళా జీవితాన్ని పంచుకున్నప్పటికిన్నీ ఆమె తత్త్వం నేను తెలుసుకోలేకపోయినందుకు ఆశ్చర్యపోయేవాణ్ణి అప్పుడప్పుడు. ఎప్పుడో క్యాంపునుంచి ఇంటికివచ్చినా యెంతో దిగులుతో, యేమిటో అసంతృప్తితో యెదురుచూస్తూ వుండేది. నాకు కొద్దికొద్దిగా అర్థమవుతూవుంది. ఆమెకు ఏమిటో అసంతృప్తి.

అరుణ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేదు.

అరుణమాత్రం ఆలోచిస్తూనేవుంది.

పార్కుకివెళ్ళి వొకమూలగా పచ్చటి గడ్డిపైన కూచున్నాం. రకరకాల మనుష్యులు, పిల్లా పాపా, కుఱ్ఱకారు, ముసలివాళ్ళు యెంతమందితోనో పార్కు కలకల్లాడిపోతున్నది.

అరుణ హటాత్తుగా నావేపుతిరిగి 'చూడండీ, చూడండీ' అని అటువేపు చూపింది. నేను చూశాను. దంపతులు తమ చిన్నకుఱ్ఱాణ్ణి మధ్య చెరొకవేలూ పట్టుకుని నడిపించుకుంటూ వస్తున్నారు. అదేమి ఆశ్చర్యకరమైన దృశ్యమా!

అకుఱ్ఱాడు నడవనని మారాం చేస్తున్నాడు.

అరుణవేపు చూశాను. అరుణకళ్ళు సంతోషంతో మెరిసిపోతున్నాయి. వాళ్ళు మావేపే వచ్చారు. నాకు మళ్ళీ వొక గడ్డుప్రశ్న యెదుర్కొన్నది. ఆ వచ్చినతడు నా చిన్ననాటి స్నేహితుడు రామారావు. అయినా నేను ముభావంగానే ఊరుకున్నాను. అతడే దగ్గరగావచ్చి పలకరించాడు. వాళ్ళు కూడా మా పక్కనే వొకచోట కూచున్నారు. అరుణ ఆవిడతో అప్పుడే మాటలు కలిపేసింది. ఆ కుఱ్ఱాణ్ణి వొళ్ళో కూచోబెట్టుకుని ముద్దాడింది.

రామారావు అదృష్టవంతుడివి అని నన్ను అభినందించాడు.

రామారావుకి ముగ్గురు పిల్లలట. ఒక పిల్లను అమ్మమ్మ వాళ్ళింట్లోనూ, కుఱ్ఱాణ్ణి తన తండ్రిదగ్గరా వదిలేసి వచ్చారట. వీడు చిన్నవాడు. రామారావు అందుకే నన్ను అభినందించాడు. నేను చిన్నగా నవ్వి ఊరుకున్నాను. ఇంకా నయం.

అరుణ మా మాటలు వినలేదు.

వాళ్ళు వెళ్ళిపోయారు ఇంకా పైకి.

అరుణ నా పక్కనే జరిగి కూచుంది.

"రెండోయేడేనట. అన్ని మాటలూ వచ్చునండీ" అన్నది ఆ చిట్టిబాబు నుద్దేశించి. నేను నిర్లిప్తతతో 'ఊ' అన్నాను.

అరుణముఖం చిట్లించుకుంది. ముభావంగా కాసేపు అటూ ఇటూ చూస్తూ కూచుంది.

ఇంతలోకే నా చేతిని మృదువుగా నొక్కి ఆకాశంకేసి చూస్తూ "వాన వచ్చేలా వుంది ఇక వెళ్ళిపోదామా" అన్నది.

ఆకాశం నిమిషంలో నల్లటి మబ్బులతో నిండిపోయింది. చల్లటి గాలికూడా వీచసాగింది. లేచి పార్కుగేటుదాకా నడిచి వచ్చాము. పార్కుగేటుపైకి అర్చీలా కాగితపు పూల చెట్లు యెగబాకి రంగురంగుల పూలతో యెంతో అందంగా వున్నాయి. గుత్తులుగుత్తులపూలు. లైట్లు వెలిగించారు. చాలా మనోహరంగా వుంది సాయంకాలం. ఇటువంటి సాయంకాలాలంటే నాకు యెంతో ఇష్టం.

రిక్షాని పిలిచాను.

“ఎందుకు నడిచిపోతే సరిపోదూ” అన్నది అరుణ.

“వాన వచ్చేలావుంది.”

పార్కునుంచి చర్చి ముందుదాకా సిమెంటురోడ్డు పల్లంగా వుంటుంది. రిక్షా జోరుగా పోతున్నది.

చర్చిముందు వచ్చి ఆగిపోయింది.

రోడ్డుమీద వొక పెద్ద గుంపు వుంది అడ్డంగా. ఇంకా రెండు మూడు రిక్షాలుకూడా వున్నాయి. ఒక పోలీస్ కాన్‌స్టేబిల్‌కూడా అక్కడే నిలుచుని వున్నాడు. రోడ్డుకి అడ్డంగా వుంది ఆ గుంపు. రిక్షావాడు రిక్షా ఆపి దిగి ఆ గుంపులోకి దూరాడు. ఒక్క రెండు నిమిషాల్లోనే వచ్చాడు. నేనుకూడా అప్పటిదాకా దిగేవున్నాను. రిక్షావాడు రాగనే నేను రిక్షా యెక్కాను. గుంపు కాస్త చెదిరింది. ఒక దారుణమైన దృశ్యం కంటబడింది. రోడ్డుమీద గుంపుమధ్య ఇద్దరు మనుష్యులు పెద్దపెద్ద లాటీల్లాంటి కఱ్ఱలు పుచ్చుకుని నిలుచుని వున్నారు. వాళ్ళ కాళ్ళదగ్గ వొకకుక్క పడివుంది. ఆ కుక్క నోట్లోంచి వరదగా నెత్తురు కారుతోంది. మధ్య మధ్య కుయ్యోమని అరుస్తోంది. ఆ దృశ్యం అరుణకూడా చూసింది. అరుణ వొక్కసారిగా వొణికిపోయి నా భుజంమీదికి వొరిగిపోయింది. విహ్వలమైన స్వరంతో ‘యేమిటండీ. యేమిటండీ’... అన్నది. రిక్షాఅతను ఇంకా వెళ్ళేందుకు వీలులేక అలానే నిలబడిపోయాడు.

పోలీస కాన్‌స్టేబిల్ గుంపుని చెదరగొడుతున్నాడు. కుక్క మొత్తుకుంటున్నది. కుక్కకి రెండుపక్కలా నిలుచునివున్న మొద్దు మనుషులు కఱ్ఱలతో వొకరు విడిచి వొకరు మళ్ళీ దాన్ని బాదారు. మాకు బాగా కనపడుతూనే వుంది. కుక్క మూలగలేదు. అరుణ యేడుస్తూ “ఇక్కడొద్దు. ఇక్కడొద్దు. పోనియ్. పోనియ్ .. మీరు చెప్పండి. పోనీమనండీ....” నాచెయ్యి తన చేతుల్లోకి తీసుకుని “మనం వెళ్ళిపోదాం. నడచిపోదాంరాండి. పశువులు. నేను చూడలేను అని ముఖం కప్పేసుకుంది.

“ఎలాపోనిస్తానమ్మగారూ” అన్నాడు రిక్షావాడు.

“పోనీయ్ నెట్టుకుపో” అరుణ యేడుపుగొంతుతో వాణ్ణి ప్రాధేయపడుతోంది.

గుంపు చెదరిపోయింది. చిన్న కుక్కపిల్ల. చచ్చిపోయింది. అరుణ కళ్ళుమూసుకునివుంది. రిక్షా మెల్లగా ముందుకు సాగిపోయింది. అరుణ నన్ను వొరుసుకుని కూచుంది. ఆమె చేయి నాచేతిలోనేవుంది. అరుణ యేమాత్రపు విషాదాన్నీ భరించలేదు. అందుకే ఆమెను చూస్తే నాకు దిగులవుతుంది. క్యాంపులో వున్నన్నిరోజులూ మనసంతా అనుక్షణమూ ఆమెచుట్టూ పరిభ్రమిస్తూ వుంటుంది.

దారిలో అరుణ అడిగింది రిక్షావాణ్ణి.

రిక్షావాడు చెప్పాడు. రిక్షావాడు చెప్పకముందే అరుణ మనుష్యులను తిట్టింది. పశువులన్నది. పశువులు నయమన్నది. దయలేదన్నది. మనుషులుగా యెందుకు పుట్టారన్నది. వణికిపోవటం నాకు తెలుస్తునే వున్నది.

రిక్షావాడు చెప్పాడు.

“పిచ్చికుక్క అమ్మా. పిచ్చెత్తింది. ఇద్దరు పిల్లల్ని కరచింది. పాపం ఒక పిల్లవాడు ఆస్పత్రిలో పోయినాడట. ఇందాక వొక యెద్దునూ కరచిందట. పిచ్చెక్కిన తర్వాత చంపకపోతే యెలా నమ్మా. మనుషులని కరిస్తే బతికే ఆశ వుందా.” అరుణ యేడుపు దిగమింగుతుంది. ఆ కళ్ళలో యెంత దైన్యమో! అరుణవేపు చూస్తే నాకు దిగులైంది.

ఇల్లు చేరుకున్న తర్వాతనైనా అరుణ అలానే వుండిపోయింది. ఎక్కడో, యేమిటో ఆలోచన. మధ్యమధ్య కళ్ళు చెమ్మగిల్లటం, నేను చూస్తూనే వున్నాను. దగ్గరగా తీసుకుని అనునయించాను.

ఆమె అడిగింది.

“అవునండీ నిజంగా పిచ్చెక్కుతుందా. ఎందుకు పిచ్చెక్కిందో దానికి పాపం.”

అరుణకి యేమని సమాధానం చెప్పను.

అరుణ అంటే అమాయకత్వం. అరుణ జాలి.

ఆవాళ రాత్రి అంతా అరుణ వణకిపోతూనే వుంది. అరుణనిచూస్తే నాకు దిగులైంది. ప్రొద్దున్నే నేను క్యాంపుకు వెళ్ళాలి. ఉదయానికల్లా అరుణ మామూలుమనిషైంది. ఎప్పటిలానే “తొందరగా వచ్చేయండి.” అని చెప్పింది.

కలతదేరిన మనస్సుతోటి వీరయ్యని తీసుకుని నేను క్యాంపుకి వెళ్ళిపోయాను. అడవిలో యేడిసింది ఆ పల్లె. పొద్దుగూకితే భయం.

ఆ వారం రోజులూ బ్రహ్మప్రళయంలా గడచింది.

వీరయ్యనిమాత్రం మట్టోజున్నే పంపించివేశాను.

మట్టోజున బయలుదేరి నేను వెళ్ళిపోవచ్చు.

చీకటిపడిన అరగంటకి తూర్పు దిక్కున చంద్రబింబం ఎఱ్ఱగా తోచి క్రమంగా తెల్లబడింది.

బంగళా ఆరుబయట కుర్చీ వేయించుకుని కూచున్నాను. దూరంగా చెట్ల ఆకుల సందునుంచి ఆ దృశ్యం నాకు బాగా కనపడుతున్నది.

అందమైన రాత్రి.

చింతచెట్టుకొమ్మమీంచి వెలిగిపోతున్న చంద్రబింబం నా కెన్నో పూర్వ స్మృతులని గుర్తుకు తెచ్చింది. ఎక్కడి నుంచో అడవిపక్షులు గోలచేస్తున్నాయి. పేరుతెలీని పువ్వులు వాసనలు వెదజల్లుతున్నాయి. ఆఫీసరుగారు దూరంగా కూచుని చుట్ట కాల్చుకుంటున్నారు. బంగళాముందు అడవి మృగాలు రాకుండా ఎఱ్ఱటిమంట మండుతున్నది.

నిజంగా అందమైన రాత్రి.

సరిగా యిలాటి రాత్రే అంచుల్లేని బంగారు పళ్ళెంలా చందమామ తూర్పుదిక్కున వెలుగుతుండగా అరుణతో పల్లకీ యెక్కి వూరేగాను. అవాళ ఉత్సాహం, అవాల్టి సంబరం, యేమని వర్ణించను. హృదయం కూడా నేను చెప్పలేను అంటున్నది.

అరుణ ఆరోజున రూపుగొన్న ముగ్ధత్వం,

కన్నులు అరమూతలు పడి ఆరోజున యెన్ని కలలు కన్నదో - భవిష్యత్తుని గురించి తియ్యగా వూహించి వుంటుంది. కలల్లో బతుకుతున్నదానివలె, యెవరివేపూ కన్నె తికూడా చూడలేదు. నావేపు చూడటానికే యెంత సిగ్గుపడి పొయ్యేది!

ఆమె కలలన్నీ యేమైనాయో-? నాతోటి చెప్పిందా? అసంతృప్తి అంటే అసంతృప్తికాదూ! ఐదేళ్ళు గడచిపోయినవి.

పదిరోజులు వుంటే పదిరోజులు ఇంట్లో వుండటానికి వీలులేని ఉద్యోగం. ఆమె ఒక్కతే ఇంట్లో బిక్కుబిక్కుమంటూ కాలం గడపాలి. అరుణపైన చెప్పలేని జాలి కలిగింది.

ఎంత త్వరగా తెల్లవారుతుందా అని హృదయం వేగిరపాటు చెందింది.

అరుణతోటి జీవితాన్ని పంచుకున్ననాటి సంగతులు ఒక్కొక్కటే కళ్ళముందు తిరిగాయి. పాపం, ఆమెకు అసంతృప్తి లేకుండా చెయ్యాలి. ఇకముందు ఆమె మనసులోని వెలితిని కనుక్కునేందుకు ప్రయత్నిస్తాను.

తెల్లవారగానే ఆఫీసరుకు చెప్పాను. మూడు నెలలదాకా నాకు క్యాంపుడ్యూటీ పెట్టవద్దని, ఆయన ఒప్పుకున్నారు. ఎంతో సంతోషంతో ఇంటికి బయలుదేరి వచ్చేశాను.

ఇల్లు చేరుకునేసరికి నాకు ఆశ్చర్యమైంది.

ఎవరింటికన్నా చేరుకున్నానా అనిపించింది.

నేను ఇంట్లోకి అడుగు పెడుతుండగానే యెదురువచ్చే అరుణ యెదురు రాలేదుకదా, యెక్కడవుందో మరి కన్పించలేదు. హాల్లో నా టేబిలు ప్రక్క కుర్చీలో ఒక కుక్కపిల్ల కూచుని నన్ను చూసి భౌ భౌ మంటూ మొరగటం సాగించింది. నా టేబిలూ, కుర్చీ వాటి స్థానాలు మార్చుకున్నాయి. ఆ కుక్కపిల్ల నన్నుచూసి మండిపడసాగింది. దాని మెడకి వున్న చిన్న బెల్టూ, గొలుసూ లేకుండానే వుంటే వున్నట్లయితే నామీదబడి పీకిపెట్టేదేమో నన్నట్లుగా వుంది దాని వాలకం. నేను అప్రతిభుణ్ణయిపోయి కాసేపు అలానే నిలుచుండిపోయాను.

ఇంతలో అరుణ వచ్చింది .. వస్తూనే నన్ను చూసింది.... చూస్తూనే అతి సంతోషంగా నవ్వింది . నవ్వుతూనే ఆ కుక్కపిల్లదగ్గరకు పోయింది....పోయి దాన్ని రెండు చేతుల్లోనూ తీసుకుంది.

"బుజ్జిముండా యెవరనుకున్నావే, తెగ అరుస్తున్నావు. నాన్నగారమ్మా, అలా చెయ్యొచ్చునా తప్పుకదూ. అల్లరి చెయ్యకూడదు. బుద్ధిమంతుడిలా వుండాలి. కన్నా, నేను చెప్పినట్లు వింటావుకదూ" అని దాన్ని దువ్వుతోంది.

అది నన్ను చూసి ఇంకా మధ్యమధ్య కుంయ్, కుంయ్ మంటూనేవుంది. నాకు తల తిరిగిపోయినంత పనైంది. అరుణకి పిచ్చిపట్టలేదుకదా — అరుణ నిజంగా పిచ్చిదైపోతున్నది.

ఒక్కొక్కరికి ఒక్కొక్కరకం పిచ్చి. అరుణకి... పిచ్చి.

అరుణ దాన్ని తీసుకునే నా దగ్గరగా వచ్చింది.

అరుణను చూస్తుంటే నాకు నవ్వూ యేడుపుకూడా వస్తున్నాయి. నేను ముఖం పక్కకి తిప్పుకున్నాను.

"బుజ్జిముండ మీదగ్గరకు వస్తుందట తీసుకోండి" అన్నది. నేను తీసుకోలేదు. అరుణవేపు చూసిమాత్రం దిగులుగా నవ్వాను, అరుణా అంతే.

నమ్మకం కుదిరినట్లుగా నేనెవరో దానికి తెలిసిపోయినట్లుగా నా మీదికి మీదికి పాకుతోంది కుక్కపిల్ల.

"బుజ్జిగాణ్ణి తీసుకోరేమండీ"

కుక్కపిల్లని దువ్వి ఇంట్లోకి వెళ్ళిపోయాను.

అరుణకూడా నా వెనకనే వస్తుంటే కుక్కపిల్ల కుయ్యోమని మొత్తుకుంటూ అరుణదగ్గరనుంచి పోవటంలేదు.

"కన్నయ్యా నీతో ఆడుకుంటాని కెళ్లానమ్మా. నాన్నగారికి కోపంరాదూ. ఇప్పుడే వస్తానుమరి. నాన్నగారికి పిళ్ళు తోడాలి, కాఫీ కలిపి ఇవ్వాలి. నీవంటే పాలుతాగి గంతులేస్తుంటివి".

అరుణకి పిచ్చిపట్టుతుందా భగవంతుడా. అరుణని యెలా సరిదిద్దుకోవాలి. నాకేం తోచటంలేదే. ఏం చెయ్యాలి అనుకున్నాను.

నిమిష నిమిషానికీ ఆ కుక్కపిల్లను చూస్తుంటే నాకు వొళ్ళు మండిపోతున్నది.

స్నానంచేసి కాఫీ త్రాగుతూ "వెధవ కుక్కపిల్ల. దాన్ని బయట వదిలేసి వస్తాను" అన్నాను అరుణవేపు చూస్తూ. అరుణ ముఖం చిట్లించుకుంది.

"పోనీండి. అది మిమ్మల్నేం చేసింది. పాపం దిక్కులేనిది. ఒకరోజు ప్రొద్దున్నే చూద్దునుగదా మీ టేబిలుచాటున దాక్కొని వణికి పోతున్నది. పెద్దకుక్కలన్నీ కలిసి పీకి పెట్టినయ్ కాబోలు. వళ్ళంతా గాయాలు దిక్కులేని ముండ అని. దాని కిన్ని పాలు పోసి ఆ సాయంకాలం బయటకు పంపించివేద్దాం కదా అని అనుకున్నాను. కాని యెంతకూ పోనంటుందే. చూడండీ కుక్కవిశ్వాసం మనిషికికూడా వుండదంటారు. ఆ విషయం నా కవాళ బాగా తెలిసింది. కాళ్ళకు కాళ్ళకు చుట్టుకుని తిరిగింది. వీరయ్యా దీన్ని బయట విడిచి పెట్టు అని పంపించాను. బయటకు తీసుకెళ్లుతుంటే ఒకటే గోల. తలుపులు వేయమన్నాను. వీరయ్య వీధి వాకిలి మూశాడు. వాకిలి దగ్గర కాళ్ళతో తలుపులు గోకుతూ రెండు గంటలు యేడ్చిందండీ! నాకు జాలైంది. యేడుపు కూడా వచ్చింది. చిన్నముండకు నేనంటే యెంత ప్రేమ అనుకున్నారు! తలుపు తియ్యగానే ఒక్క పరుగున వచ్చి కాళ్ళచుట్టూ తిరిగింది. దీన్ని యెలా పంపించనండీ బయటికి! మీరుకూడా పంపించలేరు. పోనీలెండి. ఈ బుజ్జిముండతోటి నాకు బాగా కాలక్షేప మవుతోంది. మీరూ క్యాంపుకెళ్ళినప్పుడు ఒక్కదాన్ని బిక్కుబిక్కుమంటూ వుండేదాన్నా! ఇప్పు డాభయంలేదు. ఏదో కాలక్షేపమవుతుంది. ఈ బెల్టు వీరయ్య చేత తెప్పించానండీ. ఏమంత బాగా లేదు. సాయంకాలానికి మీరొక మంచి బెల్టు తెచ్చి పెడతారుకదూ! తప్పక తేవాలేం! మంచివారుకదూ! తెస్తారు. పిచ్చిముండా వస్తున్నానే. నాన్నారికి కాఫీ యివ్వవద్దూ."

నాకు తలపట్టుకోవాలనిపించింది.

అసలే నా సహజప్రవృత్తికి కుక్కలంటే పరమ అసహ్యం. నేనేమైనా మూర్ఖంచేసి దాన్ని వెళ్ళగొట్టిస్తే అరుణ అన్నం నీళ్ళు మానేస్తుంది. అది తథ్యం. కనుక భరించవలసిందే తప్పదు. భగవంతుడా అరుణకుగాని పిచ్చెత్తదుగదా!

భగవంతుడికి రెండుచేతులూ యెత్తి మనస్సులోనే నమస్కరించాను.

రోజు రోజుకీ వాళ్ళిద్దరిమధ్య ప్రేమానురాగాలు యెక్కువవుతూ వున్నాయి. చూస్తున్నాను. నాకు చాలాకోపంగాను కూడావుంది. అయినా యేమీ చెయ్యలేక చూస్తూ వూరుకున్నాను. ఈమధ్య క్యాంపులుకూడాలేవు. రోజురోజుకి భరించలేకుండావున్నాను అరుణ వ్యవహారం. దానికి నీళ్ళు పొయ్యటం, పాలుపొయ్యటం, షికార్లు తిప్పటం, మొదలైనవన్నీ కళ్ళప్పగించి చూస్తూ వుండవలసి వస్తున్నది.

చివరకు నాగురించికూడా శ్రద్ధ తక్కువైంది అరుణకు. ఎప్పుడేనా నేను విసుక్కుంటే "యేం చేసేదండి, బుజ్జిగాడి అల్లరి రోజురోజుకి మరీ యెక్కువవుతున్నది. ఏపనీ చేసుకోలేకపోతున్నాను" అనేది.

ఒక్క నెలరోజుల్లో అరుణ పెంచిన కుక్కపిల్ల వచ్చినప్పటికి రెండింతలు బలిసింది. నున్నగా నిగనిగలాడుతూ బొచ్చుపెరిగి వొక్కొక్కసారి నాకూడా ముచ్చటయి ఇదివరకున్న కోపంకాస్తా కరగిపోతున్నదా అనిపించేది.

ఒక రోజున కృష్ణారావు నాతో పనుండివచ్చారు.

మా కుక్కపిల్లకాస్తా కృష్ణారావుమీద యెగబడ్డది.

అరుణ దాన్ని యెత్తుకుని లోపలికి తీసుకువెళ్ళినదాకా కృష్ణారావు అలానే వాకిట్లోనే నిలబడిపోయినాడు.

లోపలికి వచ్చి కూచున్న తర్వాత "ఛాఛా కుక్కపిల్లను పెంచుతున్నావుటోయ్. అసలంటే నాకు పరమ అసహ్యం. వెధవ న్యూసెన్సు...." అన్నాడు కృష్ణారావు. నేనేమీ సమాధానం చెప్పలేదు. అయితే తలుపుచాటున నిలుచుని వున్న "అరుణ నేత్రాలు" మాత్రం నా కళ్ళలో కదిలినై.

కృష్ణారావు యింకా కాసేపు కుక్కలను తిట్టి వెళ్ళిపోయాడు. కృష్ణారావు అలా వెళ్ళాడో లేదో అరుణ వుప్పెనలా వచ్చి "ఆయన ఇంక మనింటికి రావలసిన పనిలేదు" అని చెప్పింది.

ఇంకానయం అతడు వుండగానే చెప్పలేదు. చెపితేమాత్రం నేను చేసేదేముంది.

రెండు నెలలు గడచిపోయినై. ఇంకో నెలరోజుల్లో నేను మళ్ళీ క్యాంపుకి పోవలసివుంటుంది. వర్షాలు ప్రారంభమై నాలుగైదు వానలు కురిసినై.

ఒకరోజు ప్రొద్దున్నే లేచి ముఖం కడుక్కొని మామూలుగా కాఫీ కొరకు వంటింట్లోకి వెళ్ళాను. కుంపటిముందు కూచుని అరుణచేతి కేమిటో తడిగుడ్డ చుట్టుకుంటున్నది. నన్ను చూడగానే నేను చూడకూడదనే వుద్దేశంతో గబగబా చేతికి చుట్టుకోవటం ప్రారంభించింది. నేను ఆమె చేతిని నా చేతుల్లోకి తీసుకుని ఆ తడిగుడ్డ విప్పిచూచాను.

ఆమె తల వంచుకుంది.

అరటిపువ్వులాటి ఆమె మణికట్టు పైభాగంలో రక్తపు మరకలుచూసిన తర్వాత నా కళ్ళు చెదరిపోయినయ్. "ఏమి హైంది?" అన్నాను.

ఆమె చిరునవ్వుతో 'బుజ్జిగాడి అల్లరి' అంటే నా పై ప్రాణాలు పైనే పోయినయ్. నిజంగా యీమెకు పిచ్చి పట్టిందా! నా కళ్ళు చెమర్చాయి. భగవంతుడా అరుణకు పిచ్చి పట్టిందా!?

ఇల్లు నాలుగుమూలలూ వెతికాను. కుక్కపిల్ల కనపడ లేదు. కనపడితే దాన్ని గొంతుపిసికి చంపాలని. వీరయ్య చేత రిక్షా పిలిపించాను. ఆమె యేమంటున్నా వినిపించుకో కుండా డాక్టరు దగ్గరకు వెళ్ళి కట్టు కట్టించాను. గోళ్ళతో గీకిన గాయమేనట. అదృష్టవంతుణ్ణి. బ్రతికి పోయాను. ఆవాళ ఆఫీసుకు సెలవు పెట్టాను.

డ్రాయింగురూములో కూచుని పని చేసుకుంటున్నాను. అరుణ వచ్చి నా పక్కనే నిలుచుంది. కళ్ళెత్తి ఆమె వేపు చూశాను. అరుణ కళ్లనీళ్ళు పెట్టుకుని "బుజ్జిగాడు ఎక్కడా కనపడలేదు. ఇల్లంతా వెతికాను" అన్నది. పీడా పోయింది అనుకున్నాను మనస్సులో. "ఎక్కడకూ పోదు. మళ్ళీ వస్తుంది" అన్నాను. అరుణ దిగులుగా చూసింది. వాకిట్లోనే కనిపెట్టుకుని కూచుంది. పన్నెండైనా కుక్కపిల్ల రాలేదు. నాకు సంతోషంగానే వుంది, కాని అరుణను చూసి నాకూ దిగులుగా వుంది. అరుణ అన్నం తిననని పటుపట్టింది. ఎంతో బ్రతిమాలిన తర్వాత కొద్దిగా తిన్నది. నాకు కొత్త దిగులు పట్టుకుంది. అరుణ యీ దుఃఖాన్ని యెలా మరచి పోవాలి. సాయంకాలమైనా కుక్కపిల్ల రాలేదు. అరుణ ఆరాత్రి అన్నం తినలేదు. ఎంత బ్రతిమాలినా వినలేదు.

మర్నాడు ప్రొద్దున ఆలగా నిద్రలేచింది. కాని కుక్క పిల్ల కనుపడలేదు.

"మీరు డాక్టరు దగ్గరకు వద్దో మొర్రో అంటే వినక పోతిరి. మనం డాక్టరు దగ్గరకు పోయినప్పుడు యీ నిద్ర పెద్దమ్మ వీరయ్యని మోసంచేసి బుజ్జిగాణ్ణి యెవరో తీసుక పోయి వుంటారు. నా బుజ్జిగాడు నాక్కావాలిప్పుడు. తీసుకు రాండి" అని వీరయ్యని తిట్టింది. నన్ను సాధించింది. తనని తాను తిట్టుకుంది. "వీరయ్యా బుజ్జిగాణ్ణి తీసుకురా. నీకు పది రూపాయలిస్తాను. వెతుకు పో. వెతుకుపో." అని వీరయ్యని బ్రతిమాలుకుంది.

అరుణని చూస్తుంటే భయమవుతున్నది. దిగులవుతున్నది. ఆవాళకూడా కుక్కపిల్ల ఇంటికి రాలేదు.

అరుణ ఆవాళకూడా అన్నం ముట్టలేదు.

నేను యెంతో బుజ్జగించాను. "వస్తుంది. ఎక్కడో వుంటుంది. ఎవరో కట్టేసే వుంటారు చిన్నపిల్లలు. వీలుగాక వుండేవుంటుంది. ఎప్పుడోవాళ్ళు యేమరివుంటే పరుగెత్తుకుని వస్తుంది. నామాట వినవూ. అట్నే ఇలా అయిపోతారా పిచ్చీ. నువు ఇలా అయిపోతే నాకెంత దిగులవుతుందో వూహించుకో."

అరుణ నావేపు దిగులుగా చూసింది. వీరయ్య ఎక్కడెక్కడో తిరిగి వచ్చాడు. మూడోరోజుకూడా కనపడలేదు. అరుణ అన్నం తింటునే వుంది. ఐనా ఏదో చెప్పలేనిదిగులు. నిర్లిప్తత. నాలుగోరోజు నేను ఆఫీసునుంచివస్తూ ఇలా ఆలోచించుకున్నాను. "కనపడింది. పది రోజుల్లో పంపిస్తా మన్నారువాళ్ళు. అని చెపుదామని ఆలోచించాను. పదిరోజు లయేసరికి కొంత స్వస్థ పడుతుంది. చిన్నగా అలవాటవు తుంది అని వూహించాను.

ఇంటికి వచ్చి యెంతో ఉత్సాహంతో అరుణని పిలిచాను. అరుణ వచ్చింది.

"మన బుజ్జిగాడు కనపడింది అరుణా, ఆ వీథిలో వాళ్ళింట్లో వుంది. వాళ్ళ పిల్లలు సరదాపడ్డారు పాపం. పది రోజుల్లో పంపిస్తామని చెప్పారు" అన్నాను.

అరుణ నాకు బాగా దగ్గరగా వచ్చింది. నా ముఖంలోకి చూస్తూ "నాకేం మాయమాటలు చెప్పనక్కరలేదు. నన్నేం మోసపుచ్చ నవసరంలేదు. ఇందాక వీరయ్య చెప్పాడు. ఆ వీథిన నా బుజ్జిగాణ్ణి చంపేశారట. పిచ్చెక్కిందని చంపేశా రుట. నా బుజ్జిగాడి కేం పిచ్చెక్కలేదు. వాళ్ళకే పిచ్చి పట్టింది వాళ్ళు పశువులు. వాళ్ళు మనుషులు కారు. అమ్మో కట్టెలతో కొట్టి చంపివుంటారు. వాళ్ళు మనుషులు కారు. పశువులు, మనుషులు కారు...." అంటూ నా వొళ్ళో తల ఆన్చి వెక్కివెక్కి యేడ్చింది అరుణ.

## నయనప్రణవము

ఆవ్యోమాయత విద్యుదద్భుత వినీలాంభోద శుంభద్ద్యుతుల్
దీవ్యద్భాను సుధాంశుబింబ సుషమా ధ్యేయమ్ము, లామ్నాయముల్
సవ్యాసవ్యము లంబ యంబకము ; లా సప్తార్చి తార్తీయ దృ
గ్దివ్య జ్వాలిక ; శ్రీవిశాల నయనాంతేవాసియౌ సర్వమున్.

సాకారమ్ములు లోకముల్ లలిత వీక్షా పావనాంభోనిధి
ప్రాకామ్యస్థితి నిర్నిమేష భజనవ్యాసంగి మీనమ్ములై
చీకుల్‌గాక చరించి, మించు తెలివిన్ చింతామణుల్ పొందుచున్
శ్రీకల్యాణి దృగంశు మాలికలలో క్రీడించు నశ్రాంతమున్.

ఉపమాతీత, మజయ్య, మద్భుతము, కాంతోత్స్మేరతారాపరం
తప, మాత్యంతిక భక్తకోటి కభయస్థానమ్ము, సద్యస్స్ఫుర
చ్చపలానేక సితేతరోత్పల మహస్సంవ్యాన చిత్సాగరం
బపకోశప్రకటంబు శ్రీమహాదయోధ్యాదృష్టి రక్షించుతన్.

ధారాసార సుధా ప్రసార రుచిమద్రాకా సుధాంశూజ్జ్వల
త్తారుణ్యాతిగ నిత్య నూతన కృపాధారా జగత్సాగర
క్షారక్షాళన దక్షముల్ శ్రుతిశిర స్సాయుజ్యముల్ శ్రీదృశా
ధారాలోకనముల్ సమస్తమును నోతప్రోతమై నింపుతన్.

ఊహాతీత మనోజ్ఞముల్ కువలయ ప్రోత్సాహ చైతన్యముల్
మాహాక్షీర నవేక్షుసార విలసన్మార్ద్వీక పుష్పాసవ
స్నేహస్విన్నము, లాత్మభక్తజన హృన్నీరేజ సంవాసముల్
శ్రీహేలా మధురావలోకనము లార్తిం ద్రోచి మన్నించుతన్.

మృదు జంబూనద సైకతోదర వినిర్భిన్నార్ద్రి జంబూఫలా
స్పద మాద్యన్మధుమూర్తు, లర్థి జన లిప్సా పూర్తి కీర్తిప్రభా
ప్రదరోన్మీలిత మోహమూలములు, పారావార సౌందర్యముల్
హృదయాంభోజ వినోద భోగవతికా దృక్శ్రీద్యుతుల్ మించుతన్.

శాంతస్వచ్ఛ మనస్సర స్స్తిమిత హంసస్ఫూర్తి రమ్యాంబుజ
స్వాంతారామము, లాత్మదర్శన సమర్థాదర్శ మాణిక్యముల్
కాంతేందూపల బింబితాత్మజగతీ కైవల్య కాంతిచ్ఛటా
వంతీ దృక్కులు శ్రీనివాసమగు తత్త్వంబిచ్చి రక్షించుతన్.

త్రైగుణ్యంబున ద్వంద్వతం బెరసి క్షుబ్ధంబై యనేకంబునై ,
పోగుల్ చిక్కుపడంగ లోఁబడుచు తెంపుంబొందగాలేక లో
వ్రేగై సాగు విపక్షపక్షిసమజీవిశ్రేణికిన్ విచ్చుకోల్
వేగుంజుక్కలు శ్రీవిలాస విజయా వీక్షల్ శరణ్యమ్ములౌ.

"విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపా ఽఽధారాధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టి స్తే బహునగర విస్తారవిజయా
ధ్రువం తత్తన్నామ వ్యవహరణయోగ్యా విజయతే."

అణువణు వంబికానయన హార్దసుధామయ దృఙ్మయూఖికా
కణశ ఉదంచితమ్ములగు గాన జగమ్ములు సంస్మరింపకే
మనుట పొసంగునే, విడిచి మైకము కన్నులు విచ్చిచూడుడీ
అణగిన భారతీయతయు నందుకొనున్ పరమార్థ దుగ్ధముల్.

# పుస్తక సమీక్ష

## పంచకల్యాణి

రచయిత : పుటలు 124
డా. యస్వీ. జోగారావు వెల : రు. 1-50
ప్రచురణ :
ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాదు.

ఇది ఖండకావ్యము. నలభై ఎనిమిది శీర్షికలతో నున్న ఖండకావ్యము. సాధారణముగా వివిధములైన జడచేతన వస్తుసంబంధిభావ భావనా వ్యాపారముచేత ఖండకావ్యము సమున్మీలనమగును. ఇది ఈ నేటికాలపు ఖండకావ్య స్వరూపము. ఈ "పంచకల్యాణి" కూడ అట్టిదే. కుంతకుని మతానుసారమున్న వక్రతలోని భావవక్రత ఈ ఖండకావ్యమున ప్రచురముగా నున్నది. వ్యంగ్యరచనాదికమంతయు- హాస్యరచనయు- ఈ భావవక్రత నాశ్రయించి సాగినది. వ్యంగ్యము తత్ర తత్ర హాస్యగర్భముగా నుండును. ఈ ఖండకావ్యములోని "సినీవాలి" అన్న శీర్షికతోడి గేయ మట్టిది. ఒక అతివాస్తవిక కవి పగటికలల పలవరింత లా గేయమున పరమ రమణీయముగా చిత్రింపబడినవి. కరుణగర్భము హాస్యరచన 'అనుభవశాలి' అన్న శీర్షికతోడి పద్యములం దుదాత్తముగా నున్నది. ఇది ఖండకావ్యమగుట వలన శృంగార హాస్య కరుణాదులన్నియు కేవలము భావమాత్ర పర్యవసితములే. ఇట్లొక భావమును గర్భస్థముచేసి మరొకటిగా చూపించు రచన భావవక్రత నాశ్రయించినది గాని మరొకటిగాదు. ఈ ఖండకావ్యమున చిత్రములైన రచనలు రెండున్నవి. ఒకటి "అవతారము" రెండు "మన్వంతరము". ఈ సర్వసృష్టియొక్క ఆద్యంతము లా రెండింటియందును క్రమముగా, వచనమును పద్యమును గాని ఒక క్రొత్త రచనాధ్వమున వ్యక్తీకరింపబడినవి. 'ఊహా ప్రహేళిక' లని రచయిత వానిని పేర్కొనెను. ఏవం విధమైన రచనమొక నూత్నప్రయోగము. అది ఈ గ్రంథమున ప్రయుక్తమైనది.

పూర్వాధునికములైన రెండు కవితా మార్గములందును అనగా రచనా విధానమునను- భావనమునందును ఈ రచయిత తానున్నాననిపించుచున్నట్లు ఈ గ్రంథమున్నది. అటు సంప్రదాయము- ఇటు అభ్యుదయము, ఈ రెండును భిన్నమార్గగాములుగా చూచిన ఈ రచయిత సమన్వయమునకై యత్నించుట 'కావ్యసూక్తము' 'పొలిమేరలు' 'సమన్వయము' అన్న శీర్షికలతోడి రచనలయందున్నది. స్తిమితముగానుండి భావనచేసినచో సాంప్రదాయికమైన పద్ధతిని పరమోదాత్తముగా చేయగల సంస్కారము అందుకుతగిన భాషాసామగ్రి ఈ రచయిత కున్నవి. 'పితృప్రశంస' అని ఒక పద్యము చమత్కారముగా నున్నది.

నాయన నీ మనస్సు సుమనస్సు
కుమారము నీదువాక్కు ద్వై
పాయన సూక్తి ఫక్కికము;
అమ్మ సరస్వతి సార్థకావ్యా, వా
గ్గేయకృతి ప్రతీతి పరికీలిత;
ఆమెయు నీవు నాకు రా
మాయణ భారతమ్ములటు
మాన్యులు సాంబశివాఖ్య సత్కవీ !

తల్లిదండ్రులను రామాయణ భారతములతో పోల్చుట నిశితపరిశీలనాదక్షము ధీవిశేషముతో కూడినపని. రామాయణము సీతాస్వరూప స్వభావ నిరూపణాత్మకము. భారతము శ్రీమన్నారాయణాత్మకము. అనగా ఒకటి ప్రకృతి తత్వమును నిష్కర్షించునది. రెండవది పురుషతత్త్వమును పరిష్కరించునది. ప్రకృతి పురుషతత్త్వనిరూపకములైన భారతీయేతిహాసములను రెండింటిని తల్లిదండ్రులుగా భావనచేయుటకు జాతీయతాబుద్ధి తీవ్రకుశలమైనగాని సాధ్యముగాదు. ఈ విషయమింకను వ్యాఖ్యానింపవచ్చును. పద్యమును వ్రాయుటలోను చమత్కారమున్నది. తండ్రితో ప్రారంభించి మూడవపాదము మధ్యనుండి తల్లిని ముందుగాచేయుట కావలయునని చేసినది. అందుకే స్తిమితముగానుండి భావనచేసినచో అన్నది. ఇట్టి పద్యము వ్రాయుటకు సాంప్రదాయిక జ్ఞానము కలిగినజీవనాడిస్పందన ముండవలయును. పై మెరుగులు— కావలయునని తెచ్చి పెట్టుకొన్నవి— సంప్రదాయమును చంపలేవు. రచయిత యెడతెగని భావనా సమున్మీలనమైన కావ్యము వ్రాయుటకు శక్తిచాలినవాడని ఈ ఖండకావ్యమును బట్టి చెప్పవచ్చును. ఇందలిఖండికలన్నియు ఏదో ఒకవిధముగా చమత్కారగర్భములుగానే ఉన్నవి.

—క్షేమేంద్ర

Regd. No. H. 761

## వచ్చే సంచికలో

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

తుమ్మపూడి కోటీశ్వరరావు

వేముగంటి నరసింహాచార్యులు

సి. నారాయణరెడ్డి

రమణశ్రీ

రాంషా

వేటూరి ఆనందమూర్తి

కేతవరపు రామకోటిశాస్త్రి

విశ్వనాథ సత్యనారాయణ

౩౦౮, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జ్యోతి గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : ౪౩౨౮
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.